
మళ్ళీ మళ్ళీ తిరిగి చూస్తారు జనం
సూపర్ రిన్‌తో తళతళలాడే
ఆ తెల్లదనం
250 గ్రాముల
బిళ్ళ కూడా దొరుకుతోంది.
SUPER
RIN
STRIKES WHITER
సూపర్ రిన్‌తో తళతళలాడే తెలుపు
మరే ఇతర డిటర్జంట్ బిళ్ళ లేదా బార్ కంటే తెలుపు.
హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ఠ ఉత్పత్తి
LINTAS RIN 115 2/20 TL

# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

**దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు**

స్థాపితం . 1908

**శివలెంక శంభుప్రసాద్**

సంపాదకుడు : (1938-1972)

6-12 మార్చి'87

శ్రీ అక్షయ నామ సం ఫాల్గుణ శు. సప్తమి.

**సంపుటము 79 : సంచిక 27**

ముఖ్య సంపాదకుడు :

**శివలెంక రాధాకృష్ణ**

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు .

**మతుకుమల్లి మాధవరావు**

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

**ఆంధ్రపత్రిక కార్యాలయము,**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

**ముఖచిత్రం :**

నటి . సుమలత

(ఫొటో . జగమోహన్)

### కథలు :


| | |
|---|---|
| దాహం! దాహం! | .. 16 |
| పందెం | .. 31 |
| రాతిముక్క | ... 51 |
| మనయ్య మరణం | ... 62 |


### సీరియల్ నవలలు:


| | |
|---|---|
| ప్రతిస్పందన (కొత్త సీరియల్ ప్రారంభం) | ... 8 |
| ఒడిలో చెలి మోహన రాగం | ... 22 |
| ఆశయం | ... 46 |
| ఆరోహణ | ... 56 |


### వ్యాసాలు, శీర్షికలు :


న్యూఢిల్లీ లేఖ-4, ఉత్తరాలు-7, వీరభద్రుని వివిధ రూపాలు-15, ఆ'వేమన' పద్యాలు-20, రచయిత్రి జవాబులు-26, చిన్నారి బాలల దీనగాథలు-28, ప్రశ్నావళి-30, వారఫలం-34, అభినేత్రి భానుప్రియ సమాధానాలు-36, అభిమాన తారలపై అభిప్రాయం-37, సినిమా విశేషాలు-40, బైద్యనాథ్ ఆరోగ్యదీపిక-45, ధర్మపథం-59, గర్భస్థ శిశువు చెప్పిన కథలు-60, డాక్టర్ సలహాలు-66 ఫాలాక్షుని డైరీ-67, హైదరాబాద్ నోట్‌బుక్-68 వ్యక్తిగతం-69, దూర దర్శనం-70, ప్రపంచ బాక్సింగ్ టైటిల్ విజేత మైక్ టైసన్-72.




## ఉత్తరాలు

### కథలు

6-12 ఫిబ్రవరి, '87 ఫారా ముఖచిత్రంతో వెలువడిన 'పత్రిక' చాలా ఆకర్షణీయముగావుంది 'కనువిప్పు', "నాకూ ఆడదానిగా పుట్టాలనుంది" కథలు చాలా బాగున్నాయి. ఇలాంటి కథలు ఎక్కువగా ప్రచురించవలసిందిగా కోరుచున్నాం

-ఎస్. ప్రవీణ్ నారాయణరాజు, వి శ్రీధర్, కోటబొమ్మాళి

★ ★ ★

నాకూ ఆడదానిగా పుట్టాలనుంది" యన్ భారతీదేవిగారి కథ చాలా బాగానచ్చింది. తనకు ఆడపిల్ల పుట్టబోవుచున్నదని తెలిసి భయపడి అబార్షన్ చేయించుకుంటానన్న మంజూకు ఆమెలోని భయం పోగొట్టి ఆడవాళ్ళకు ఆడవాళ్ళే శత్రువులు అను నిజాన్ని చక్కగా తెలియపరిచాడు రవిచంద్ర ఆ పాత్ర నాకు చాలా బాగా నచ్చింది.

శ్రీకంతం కామాక్షమ్మ, నెల్లూరు

### ధర్మపథం

6-2-87 సంచికలో "ధర్మపథం"లో నియమపాలన చాలా అద్భుతంగా ఉంది. విజ్ఞానదాయకముగాను, ఉపయోగపడేదిగానూ ఉంది రచయితగార్కి నా హృదయపూర్వక సలాములు.

-యస్ ఎ సత్తార్, విజయవాడ

### సీరియల్స్

ఒకటి ఒకటి మూడు, ఆరోహణ సీరియల్స్ మమ్మెంతగానో ఆకట్టుకున్నాయి

పి గీతా, కె లతా, గడేకల్, అనంతపూర్

★ ★ ★

మా అభిమాన ఆంధ్ర సచిత్రవార పత్రికలో ప్రచురిస్తున్న నాలుగు సీరియల్స్ చాలా బాగుంటున్నాయి ఒక దానిని మించి ఒకటి సాగుతున్నాయి ఒడిలో చెలి మోహనరాగం'లో ప్రణీత్ పాత్ర చాలా బాగుంది రాష్ట్రంలో జరుగుతున్నది కళ్ళకి అద్దినట్లు వ్రాస్తున్నారు రచయిత్రిగారికి మా అభివందనలు ఇక ఒకటి ఒకటి మూడు"లో లక్ష్మి పాత్ర చాలా బాధగా వుంది ఆరోహణ చాలా బాగుంది. "ఆశయం" మొదటి బోనే మా ఇంటిల్లిపాదిని ఆకట్టుకుంది

-సి హెచ్. రమేష్, బసవన్న దుర్గ (కర్నాటక)

★ ★ ★

ఆంధ్ర సచిత్రవార పత్రికయందు ప్రచురితమవుతున్న శ్రీశైలకుమార్‌గారి 'ఆరోహణ' సీరియల్ – నేడు చిత్ర పరిశ్రమలో జరుగుతున్న తీరు తెన్నులను వాస్తవంగా తెలియజేస్తున్నట్టుగా, దృశ్య కావ్యంగా ఉంది రచయితగారికి అభినందనలు

-కె వి నాగేశ్వరరావు, నార్త్ రాజుపాలెం, నెల్లూరు

★ ★ ★

తేజోవతిగారి 'ఒకటి ఒకటీ మూడు"లో కేరళలోని కోవలం బీచి, కన్యాకుమారివద్ద జరిగిన విశేషాలు బాగున్నాయి ' శ్యామసుందర్, లక్ష్మిల పాత్రలు బాగున్నాయి కథ చాలా ఇంటరెస్టింగ్‌గా నడుస్తుంది -పోలోజు వెంకటాచారి, హైదరాబాదు

★ ★ ★

ఒడిలో చెలి మోహనరాగం సీరియల్‌లో హరిణి హత్యగావింపబడటం చాలా బాధవేసింది

సాయినిరాజు, నేలకొండపల్లి

### వ్యాసాలు

6-12 ఫిబ్రవరి 87 వ సంచికలోని మా పత్రికలో నాటి 'కాలాపానీ' – నేటి కమ్మని దృశ్యకావ్యం 'లో అండమాన్ దీవుల గురించి చక్కగా వివరించారు అప్పుడప్పుడు ఇలాంటి విషయాల గురించి తెలుసుకోవడం ఎంతో సంతోషదాయకం అదే సంచికలో ప్రచురించిన 'కాంపాక్ట్ డిస్క్ లు" కూడ ఎంతో ఆసక్తికరంగా విజ్ఞాన దాయకంగా ఉంది

డి జ్ఞానలక్ష్మి, కోయిలకుంట్ల

### శీర్షికలు

"గర్భస్థ శిశువు చెప్పిన కథల శీర్షిక చదివిన కొద్దీ చదవ బుద్ధి అవుతున్నది

గరిగ నర్సయ్య, రామకృష్ణపూర్

★ ★ ★

6-12 ఫిబ్రవరి '87 మా అభిమాన వారపత్రికపై నటి ఫారా ముఖచిత్రం చాలా బాగుంది అభిమాన తారలపై అభిప్రాయం, భానుప్రియ సమాధానములు బాగుంటున్నాయి

పక్కి మధుసూదనరావు, విజయనగరం □

కొత్త సీరియల్ ప్రారంభం!

# ప్రతిస్పందన

అన్నపూర్ణ

"సౌందర్యా, ఓ సౌందర్యా!" అంటూ చొరవగా ఆ యింట్లో అడుగు పెట్టింది సాకేత.



"సాకేతా, నువ్వా!... కమాన్, కమాన్..." అంటూ గదిలోంచి బయటికి వచ్చింది సౌందర్య. చేతిలో ఏదో నవల-దాన్ని చదువుతున్నట్లు వుంది. పేజీల మధ్య వేళ్ళు వున్నయ్.

# ప్రతిస్పందన

**"పుస్తకం చదువుతున్నట్లు న్నావ్? ఏమిటి అది?"**

**"ఏదో లే. చదువుతున్నాను" అంటూ అక్కడే వున్న సోఫాలో కూర్చుంది. సౌందర్య. ఆమె ప్రక్కనే చోటు చేసుకుంది సాకేత.**

"ఏది? ఆ పుస్తకం ఇటు తే."

ఇచ్చింది సౌందర్య.

"దొరక్క దొరక్క ఈ నవలే దొరికిందా నీకు?... బోర్ కొట్టడం లేదూ?"

"ఎందుకు?"

"వట్టి ఫ్యామిలీ సెంటిమెంట్స్!... మధ్య తరగతి మనుషులు, పేదరికం, కష్టాలు..."

"ఆ మనుషుల మధ్యే అనురాగాలు, ఆత్మాభిమానాలు, త్యాగాలు, కాస్తంత రొమాన్స్..."

"ఆదాయాలు తరిగి ధరలు పెరిగి సంసారాలు గడవక నూటికి డెబ్బై అయిదు మంది బాధపడుతున్నారు ఈ వేళ ఇది జగమెరిగిన సత్యం మరి అందరూ అనుభవిస్తున్న ఈ ఆర్థికపరమైన అంశాలనే కథా వస్తువులుగా తీసుకొని ఎందుకు రచనలు చేస్తున్నట్లు? ముఖ్యంగా ఈ 'సమాజ సత్యం' రచనలన్నీ అంతే! నిజ జీవితంలో కష్టాలు ఎలాగో తప్పవు మరి చదివే నవలల్లోనూ, చూసే సినిమాల్లోనూ కూడా కన్నీళ్లే అయితే మనిషికి కాస్తంత రిలీఫ్ దొరికేదెక్కడ మరి?"

"ఏమో చదివితేనూ, చూస్తేనూ మనసుకు రిలీఫ్ దొరకడం అన్నది కేవలం మన వూహ మాత్రమే నిజానికి మనశ్శాంతి అన్నది మన మనసులు, ఆలోచనలనుబట్టి వుంటుంది సాకేతా ఊహాజనితమైన రచనలు మనల్ని ఏవో తెలియని సుందర లోకాలకు తీసుకు వెళ్లే మాట యథార్థమే అయితే ఆ అనుభూతి శాశ్వతమంటావా? . నిజ జీవితంలోకి వస్తే అంతా తల్లక్రిందులు! వాస్తవికతను ప్రతిబింబించే రచనలు మాత్రం మనల్ని నేల విడిచి సాము చేయనీయవు.. నీకు గుర్తుందా? మనం ఒకసారి ఆర్ట్ ఎగ్జిబిషన్‌కు వెళ్లాం అక్కడ నీకు నచ్చిన చిత్రం ఏది?"

"అప్పుడే చెప్పానుగా, 'బడుగు బ్రతుకులు' అని?"

"ఆ బొమ్మలో నీకు కనిపించేదేమిటి?"

"పేదరికమే అయినా అది మంచి ఆర్ట్! అందుకే బావుందన్నాను "

"ఆర్ట్ అంటే ఏమిటి?"

"కళ"

"ఏ రంగంలో అయినా తనకున్న ప్రజ్ఞను ప్రదర్శించే ప్రతి వ్యక్తీ ఆర్టిస్టే కద?"

"కావచ్చు "

"నా దృష్టిలో రచయిత కూడా ఓ ఆర్టిస్టే సాకేతా! చిత్రకారుడు తన నైపుణ్యాన్ని గీతలలో చూపిస్తే రచయిత అక్షర రూపంలో ప్రదర్శిస్తాడు దాన్ని కళాకారుడు అన్నవాడు సమాజాన్ని అన్ని దృక్కోణాల నుండీ పరిశీలించ గలగాలి సమాజంలోని మంచి చెడులను ఎత్తి చూపగలగాలి- అన్నింటికీ ముఖ్యం- వాస్తవాన్ని ప్రతిబింబింపజేయగలగాలి ఇందాక నువ్వన్నట్లే నేటి పరిస్థితులనుబట్టి నూటికి డెబ్బై అయిదు మంది పేదరికంతోనూ, కష్టాలతోనూ మగ్గిపోతున్నారు దీన్నిబట్టి పేదరికం, కష్టాలు- ఇవి మెజారిటీ ప్రజల సమస్యలే కద?"

"నిజమేలేవే తల్లీ ఏ విషయంలోనైనా నీతో వాదించాలంటే కష్టం .. ఓ పెద్ద ఆఫీసరుగారి అమ్మాయివైయుండీ ఇలాంటి మధ్య తరగతి ఫ్యామిలీ సెంటిమెంట్స్‌ను గురించి వ్రాసే రచయితను మెచ్చుకుంటున్నావ్."

"నీ అభిప్రాయం తప్పు సాకేతా రచయిత హైక్లాస్ ఫ్యామిలీ గురించి వ్రాసినా, లోక్లాస్ వ్యక్తులను గురించి వ్రాసినా- వాస్తవికతను మాత్రం గాడి తప్పనీయకూడదు ఐ లైక్ నేచురాలిటీ! ప్రస్తుత మన సమాజాన్ని ప్రతిఫలింపజేయగల ఏ రచననైనా నేను మెచ్చుకుంటాను. చదువుతాను "

"ఏ రచననైనా చదువుతాను అని ప్రగల్భాలు పలికే నువ్వు నా అభిమాన రచయిత్రి 'రంజితా దేవి' నవలల్ని కనీసం దగ్గరికైనా రానీయవు ఎందుకని? పైగా ఆవిణ్ని తెగ విమర్శిస్తూంటావ్?"

"మీ రంజితాదేవిగార్ని గురించి మాత్రం నా ముందు చెప్పకు ఆవిడ వ్రాసేవన్నీ ప్రేమ పుక్కిటి పురాణాలు హీరో హీరోయిన్లు ఈవేళ ఊటీలో వుంటే తెల్లవారేసరికి అమెరికాలోని ఆమ్‌స్టర్ డామ్‌లో వుంటారు హీరో జమిందారు కోటీశ్వరుడు- హీరోయిన్ కటిక దరిద్రురాలు- ఇద్దరి మధ్య ప్రేమ, మధ్యలో అపార్థాలు, చివరికి సుఖాంతం- ఇలా ఎన్ని నవలలు? ఆవిడ నవలల్లో వ్రాసినన్ని ఎస్టేట్లు అసలు మన రాష్ట్రంలో ఏమిటి మొత్తం భారత దేశంలో వున్నయ్యా అన్నది నా తీరని ధర్మ సందేహం"

"పోనీలే సౌందర్యా ఎవరి టేస్ట్ వాళ్ళది నవలల విషయంలో మన వాదనకు ఫుల్‌స్టాప్ పెట్టేసి మిగతా విషయాలు మాట్లాడుకుందాం"

"ఓ కె! అసలు నవలల విషయం ఎత్తింది నువ్వే కద ?"

"బుద్ధి పొరపాటు అయిందే ఒప్పుకుంటున్నానుగా! ఇంతకూ ఈవేళ ప్రోగ్రామ్ ఏమైనా వున్నదా?"

"నువ్వే చెప్పు అది కూడా "

"ఇంట్లో కూర్చుంటే తెగ బోర్ కొట్టేస్తోందే అందుకని "

"ఏదైనా పిక్చర్‌కు వెళ్దామంటావ్ అంతేగా?"

"ఎగ్జాక్ట్లీ!"

ఇంత సేపూ గదిలో కూర్చుని వీళ్ళ యిద్దరి సంభాషణ వింటున్న సౌందర్య అన్న రవి కిరణ్ గబుక్కున ఇవతలికి వచ్చాడు. అతడు ఏదో పుస్తకం చదువుతున్నట్లున్నాడు చేతుల్లో వుంది

"ఇంతకూ మీ యిద్దరి వాదనలో ఎవరిది నెగ్గినట్లు సాకేతగారూ?"- ప్రశ్నించాడు.

"మా తెలిసీ తెలియని వాగుడు మీరూ వినేశారన్న మాట" అంది సాకేత



ఎగ్గుగా

"అంతా పూస గుచ్చినట్లు విన్నాను నా వుద్దేశ్యంలో మాత్రం మీ యిద్దరి అభిప్రాయాలూ సరి అయినవి కావు ఎందుకంటే ఈనాటి పాఠకుడు చాలా ఎదిగిపోయాడు వాస్తవం పేరుతో కష్టాలు, కన్నీళ్ళు భరించలేడు అలాగని అభూత కల్పనలనూ సహించలేడు- ఈ రెండింటి సమన్వయాన్ని సరికొత్త రీతిలో ఆహ్వానిస్తున్నాడు అందుకు నిదర్శనమే ఈ నవల- బవంత ప్రసాద్‌గారి 'బ్రబ్రక్ బద్రకాళి!''- తన చేతిలో వున్న నవలను చూపించాడు తర్వాత "నేటి పాఠకుల అబిరుచికి అనుగుణంగా వ్రాసింది కాబట్టి ఈ నవల సూపర్ సక్సెస్ అయింది" అంటూ ఘనంగా పొగిడాడు

"అయితే అయిందిలేగాని అన్నయ్యా, కథ కమామీషు అంటూ ఆ నవలను గురించి మాకేం చెప్పటానికి ప్రయత్నించకు చెప్పావంటే రాత్రికి నాకు నిద్రే పట్టదు సాకేతా! మనం బయలుదేరుదామా మరి?" అంటూ లేచింది సౌందర్య

"పద వెళ్దాం"-సాకేత కూడా లేచింది

"మా అమ్మకు చెప్పి వస్తానుండు" అని లోపలికి వెళ్ళి తల్లికి చెప్పి వచ్చింది సౌందర్య

"నన్ను ఒక్కణ్ణీ ఇలా వదిలి మీరు యిద్దరు మాత్రమే నూన్‌షోకి వెళ్ళటం చాలా అన్యాయం పాపం చుట్టుకొని మీకు టిక్కెట్లు దొరక్కుండా పోవుగాక''- రుషీశ్వరుడి పోజు పెట్టి శపించాడు రవి కిరణ్

"అలా శాపాలు పెట్టి నోరు పాడు చేసుకోవటం దేనికి? నిన్ను బయలుదేర వద్దని మేం అన్నామా? అయినా టిక్కెట్ల కోసం 'క్యూ'లో మేం ఎక్కడ నిలబడగలం? త్వరగా బయలుదేరు మరి?" అంది సౌందర్య నవ్వి వూరుకొంది సాకేత

ఇట్టే గదిలోకి వెళ్ళి అట్టే తిరిగి వచ్చాడు రవికిరణ్

రోడ్డు మీదికి వచ్చాక ముగ్గురూ కలిసి ఆటో ఎక్కారు

సౌందర్య తండ్రి శేషాద్రిగారు గెజిటెడ్ ర్యాంక్‌లో వుద్యోగం చేస్తున్నారు రెండు చేతులా సంపాదన సౌందర్య, రవి కిరణ్- ఇద్దరే సంతానం పట్నంలో సొంత యిల్లు, పల్లె పట్టున పొలం పుట్ర వున్నాయి బి ఎ ఫైనల్ పరీక్షలు వ్రాసింది సౌందర్య రవి కిరణ్ నాలుగుసార్లు దండయాత్రలు చేశాడు కానీ బి ఎ పూర్తి కాలేదు

కొడుకును ఇంజనీరింగ్‌లోనో, మెడిసిన్‌లోనో చేర్పించాలని విశ్వ ప్రయత్నం చేశాడు శేషాద్రిగారు కానీ, 'నాకు లెక్కలు రావు ఇంజనీరింగ్ వద్దు, నెత్తురు చూస్తేనే కళ్ళు తిరుగుతయ్ మెడిసిన్ చెయ్యలేను నేను ' అంటూ అడ్డు చెప్పి ఆయన ప్రయత్నాలు కొనసాగనివ్వ లేదు వంశోద్ధారకుడైన కొడుకును గద్దించి చదివించలేకపోయాడు శేషాద్రిగారు ఇష్టపడ్డాడని బి ఎ లో చేర్పిస్తే ఇంత వరకు గట్టెక్కలేక పోయాడు అతడు

ఇక ' సాకేత- ఆమె తండ్రి ఓ గవర్నమెంట్ గుమాస్తా, కుటుంబ నియంత్రణను కొంచెం ఆలస్యంగా పాటించాడు ఇద్దరు ఆడపిల్లలు ఇద్దరు మొగ పిల్లలు కలిగాక వాళ్ళ ఆవిడకు ట్యూబెక్టమీ ఆపరేషన్ చేయించాడు అదనపు ఇంక్రిమెంట్ కోసం పేరు నిరంజనరావు ఇంటికి పెద్ద బిడ్డగా పుట్టింది సాకేత మిగతా పిల్లలు వయసుకు తగ్గ చదువులు చదువుతున్నారు తెల్లవారింది మొదలు ఇంట్లో సాకేతకు దరిద్ర దేవత భరత నాట్యం చేస్తూ కనిపిస్తుంది దాంతో మానసిక సంఘర్షణతో నలిగిపోతూంటుంది ఆమె ఖాళీ సమయాల్లో ఇంట్లో వుండబుద్ధి కాక సౌందర్య వాళ్ళ యింటికి వస్తూంటుంది

హైస్కూల్ విద్య నుంచీ స్నేహితురాళ్లే సౌందర్య, సాకేత ఉమెన్స్ కాలేజీలోనే చదివారు ఇద్దరూ

సాకేత కుటుంబ పరిస్థితులు పూర్తిగా తెలుసు సౌందర్యకు ఎక్కడికి వెళ్ళినా సాకేతను పైసా ఖర్చు పెట్టనివ్వదు అన్నీ తానే భరిస్తుంది సాకేత ఏమైనా అంటే 'రేపు నువ్వు ఏదైనా వుద్యోగంలో చేరాక నేనిప్పుడు ఖర్చు పెట్టేదంతా అణా పైసలతో సహా లెక్క గట్టి ఇచ్చేద్దువుగాని లేకపోతే పెళ్ళయ్యాక మీ ఆయనగారికి చెప్పి ఇప్పించుదువుగాని' అంటుంది సౌందర్య ఇంకేం మాట్లాడగలదు సాకేత?

* * * * *

ఇంట్లో అందరూ నిద్రపోతున్నారు రవి కిరణ్‌కు మాత్రం ఎంత ప్రయత్నించినా నిద్ర రావటం లేదు. లాభం లేదని తన అభిమాన రచయిత నవల 'ఛూ చూ చాముండి' చేతిలోకి తీసుకున్నాడు

కానీ మనసు పుస్తకం మీద కూడా లగ్నం కావటం లేదు ఓ తీయని అనుభూతిలాంటిది ఏదో అతని హృదయాంతరాళాలను వుక్కిరి బిక్కిరి చేసేస్తోంది ఈ రోజు జరిగినట్లే మరో మారు జరిగితే ఎంత బావుణ్ను! రేపు కూడా సినిమాకు వస్తుందేమో సాకేత?

రవి కిరణ్ దివ్యానుభూతికి, అనవసర ఆలోచనలకు కారణం ఆ రోజు సినిమా హాలులో ఏర్పడిన పరిస్థితే

సౌందర్య సాకేతలతో పాటు అతడూ సినిమాకు వెళ్లాడు బాల్కనీ టిక్కెట్లు ఒక లైన్‌లో చిట్ట చివర కూర్చున్నాడు రవి కిరణ్ అతడి తర్వాత సౌందర్య, సాకేత- మిగతా అంతా ఆడవాళ్లే

ఏం గ్రహచారమోగాని సాకేత ప్రక్కన ఓ హిడింబిలాంటి స్త్రీమూర్తి ఆశీనురాలై వుంది మాట్లాడితే మోచేతులతో పొడుస్తోంది ఆవిడ ' పెద్దమ్మ గారూ, కొంచెం సర్దుకు కూర్చోండి" అని చెప్పింది సాకేత ఎంతో మర్యాదతో "నా పిండాకూడు సర్దుకొని కూర్చోవాలనే నేనూ ప్రయత్నిస్తున్నాను వెధవ కుర్చీలు మనిషి విశ్రాంతిగా కూర్చోటానికి కూడా వీలులేదు' అంటూ పొరబాటున చెయ్యి ఇట్లా అంది పెద్దమ్మ దాంతో ఆవిడ మోచేయి వచ్చి సాకేత గడ్డానికి తగిలింది

"అబ్బా!"- కొంచెం పెద్దగా మూలిగింది సాకేత




'ఏమైందే సాకేతా - కొంచెం గాభరా పడింది సౌందర్య

"గడ్డం పగిలిందే- పెద్దమ్మగారి పోరు పడలేకుండా వున్నాను '

' ఆవిడ సంగతి నేను చూస్తాను నువ్విటు వచ్చి కూర్చుంటావేమిటి? '

"అలాగే "

సీట్లు మారి కూర్చున్నారు సౌందర్య, సాకేత

పెద్దమ్మగారి మోచేతుల బాధ వదిలితే చాలు అన్నదే సాకేత తపన సీటు మారితే ప్రక్కనే రవి కిరణ్ వుంటాడని ఆమె ఆలోచించనే లేదు

తీరా చూస్తే ప్రక్కనే రవి కిరణ్! చేసేది లేక సౌందర్య వైపు వంగి కూర్చుంది

స్థూల కాయురాలైన పెద్దమ్మగారు సర్దుకొని కూర్చోవటం అసంభవం అనుకున్న సౌందర్య తనే ఇవతల ప్రక్కకు ఒరిగి కూర్చుంది

ఇక రవి కిరణ్ ఆలోచన మరో విధంగా వుంది సాకేతకు తనంటే వేరే అభిప్రాయం వుంది పెద్దమ్మగారు చేతులు వేసి కొట్టటం, అందుకోసం సీటు మారటం అనేది వట్టి యాక్షన్- సౌందర్య నమ్మిక కోసమే అలా చేసి వుంటుంది! ఆమె ఆంతర్యం మాత్రం తన మీదే వుంది అందుకే కావాలని ప్రక్కకు చేరింది!

మనసులో ఆ అభిప్రాయం కలిగాక రవికిరణ్ దృష్టి ఇక తెర మీదికి మళ్ళటం లేదు సాకేత వైపే చూస్తూండిపోతున్నాడు

'సౌందర్య' అన్న పేరు చెల్లాయికి కాకుండా ఈమెకు పెట్టి వుంటే ఆ పేరుకు సార్థకత ఏర్పడేదేమో!

# ప్రతిస్పందన

అందమైన సాకేత తన సొంతమైతే- కావలసిందేముంది? అవసరమైతే ఈ ప్రపంచాన్నే జయించగలడు!

ఏమిటో ఎంతసేపటికీ తన వైపుకు తిరగటం లేదు సాకేత చెల్లాయి గమనిస్తుందేమోనన్న భయమా? కావచ్చు . ఛీ ఛీ సెటప్ అంతా అప్‌సెట్!

ఈలోగా ఇంటర్వెల్ అయింది

ముగ్గురూ థియేటర్ బయటికి వచ్చారు

రవి కిరణ్ వెళ్ళి ముగ్గురికి కూల్ డ్రింక్స్ తెచ్చాడు

కూల్ డ్రింక్ సిప్ చేస్తున్నప్పుడు కూడా అతడి చూపులు సాకేత వైపే కనిపెట్టేసింది సౌందర్య 'అన్నయ్యను తను కూడా సినిమాకు తీసుకు వచ్చి తను పొరబాటు చేసింది' అనుకొంది అయినా పైకి పొక్క లేదు

వచ్చి సీట్సలో కూర్చున్నారు తిరిగి ఎడ్వర్టయిజ్‌మెంట్స్ అయిపోయాయి పిక్చర్ మొదలైంది

ప్రొద్దస్తమానం ఒకే వైపుకు వరిగి కూర్చోలేక తన సీట్లో మామూలుగా కూర్చుంది సాకేత రవి కిరణ్ భుజాలు ఆమెకు తగులుతున్నయ్ కానీ, పెద్దగా పట్టించుకోలేదు సాకేత పూర్తిగా సినిమాలో లీనమైపోయింది

తన భుజాలు తగిలినా కిమ్మనలేదు సాకేత దీన్నిబట్టి చూస్తే- తనకు దగ్గిర కావటమేగా ఆమె వుద్దేశ్యం?- అలా ఆలోచించి సాకేత చేతిమీద తన చెయ్యి వేశాడు రవి కిరణ్ వెంటనే తన చేతిని ప్రక్కకు లాక్కొంది ఆమె రెండు మూడుసార్లు అలాగే జరిగింది

తను చెయ్యి వేసినప్పుడల్లా ఆమె చెయ్యి వెనక్కి తీసుకొంటోందేగాని పెదవి విప్పి ఏమీ అనటం లేదు కాబట్టి తనంటే సాకేత లోలోపల ఇష్టపడు తున్నట్లే కాకపోతే చెల్లాయి కనిపెట్టేస్తుందేమోననే సంశయిస్తోంది అంతే. అంతే

ఈ రోజు కాకపోయినా మరి కొంత కాలానికైనా అందమైన సాకేత తన స్వంతమౌతుంది అప్పుడు తన జీవితం మధుర స్వప్నమే!

అదీ రవికిరణ్ దివ్య అనుభూతి!

సాకేతను తను స్వంతం చేసుకొనే విషయంలో తల్లిదండ్రులను, చెల్లాయినీ- అందర్నీ ఎలా ఒప్పించాలి ? ఏమని చెప్పాలి?- ఇది అతడి అప్పటి అంతులేని ఆలోచన.

ఇక సాకేత-

రెండు గదులున్న సామాన్యమైన పోర్షన్ వాళ్ళది. ఆ రెండు గదులకే మూడు వందలు అద్దె చెల్లిస్తున్నారు. తల్లిదండ్రులు వెనుక గదిలో పడుకుంటారు. పిల్లలకు ముందు గది కేటాయించారు.

ఇంట్లో అందరూ నిశ్చింతగానే నిద్రపోతున్నారు కానీ, అక్కడ- వాళ్ళ యింట్లో రవి కిరణ్‌లానే ఇక్కడ సాకేతకూ నిద్ర పట్టటం లేదు

కాకపోతే ఆమె దృక్పథంలో ఎక్కడా రవికిరణ్ జాడే లేదు తన అభిమాన రచయిత్రి రంజితాదేవి నవలల్లో దర్శనమిచ్చే ఆరడుగుల అందగాడు, సకల ఐశ్వర్యవంతుడు అయిన హీరో దోబూచులాడుతున్నాడు. సాకేత కన్నె మనసుతో

అలాంటి వ్యక్తి తనకు తారసపడతాడా?

తారసపడితే?

తామిద్దరి కలయికకూ ప్రాతిపదిక ఎలా వుంటుంది?

అసలు ఆ ప్రాతి పదిక ఎలా వుండాలి?

అలా. తీయగా రకరకాలుగా ఆలోచిస్తోంది సాకేత

ఆలోచించీ. ఆలోచించీ నిద్రలోకి జారుకోవటం ప్రతి రాత్రీ ఆమెకు అలవాటే

మళ్ళీ తెల్లవారితే- రాత్రి ఆ కమ్మని కలలన్నీ పటా పంచలై పోతాయి నిజ జీవితంలోని ఈతి బాధలు రకరకాలుగా దర్శనం యిస్తుంటాయి ఇంట్లో

అప్పుల్లో మునిగిపోయిన తండ్రీ, కనీసావసరాలు తీరక గొడవ చేసే తమ్ముళ్ళు, చెల్లాయి- ఫస్ట్ తారీఖు అప్పులు తీర్చటానికి పోను మిగిలిన కొద్ది జీతం డబ్బులు ఇంట్లో వాడమని తండ్రి తల్లి చేతిలో పెట్టటం- అంతా నరకప్రాయంగా తోస్తుంటుంది సాకేతకు

అందుకే తన బాధలను మరచి పోవటానికీ, తీయని వూహా లోకాల్లోకి తేలిపోవటానికీ ఆమె రంజితాదేవిగారి నవలలను ఎక్కువగా చదువుతూంటుంది

మరి సౌందర్య విషయానికి వస్తే- ఆమె ఏ విషయాన్నయినా హేతువాద దృక్పథంతో పరిశీలిస్తుంది. 'వూహా లోకాల్లో విహరిస్తూ గాలి మేడలు కట్టుకోవటం వట్టి ఆత్మవంచనే' అని వాదిస్తుంది

'భవిష్యత్తు మీద ప్రతి మనిషికి ఆశలు వుంటాయ్ అలా వుండటం సహజం కూడా! కానీ, సరైన అవగాహన, ఆలంబన లేకుండా ఎవరూ పేరాశకు పోకూడదు అలా జరిగితే ఆశించిన వాటికి భిన్నమైన పరిణామాలు ఎదురవుతయ్'- ఇది సౌందర్య నమ్మిన సత్యం

*　　*　　*　　*　　*

"పోస్ట్!" అంటూ ఒక కవరును లోపలికి గిరాటు పెట్టి వెళ్ళిపోయాడు పోస్ట్‌మాన్

హాలులో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్న సౌందర్య లేచి వచ్చి ఆ కవరును అందుకొంది అప్పుడు ఆమె ఒక్కర్తే వుందక్కడ రవికిరణ్ ఎవరో స్నేహితుడు వస్తే కలిసి బయటికి వెళ్ళాడు తండ్రి క్యాంపులో వున్నాడు. తల్లి వంట ప్రయత్నంలో వుంది లోపల చూస్తే- కవరు మీద తన పేరే వుంది ఫ్రమ్ అడ్రస్ కోసం వెతికింది . కనిపించలేదు 'ఎవరు రాసి వుంటారబ్బా' అని ముందు సంశయించినా అంతలోనే ఏదో స్ఫురణకు వచ్చి ఆత్రంగా దాన్ని చించింది

"కుమారి సౌందర్య గార్కి,

నమస్కారాలు

కేరాఫ్ పత్రిక అడ్రసుకు మీరు వ్రాసిన వుత్తరం నాకు అందినది సంతోషం











## ప్రతిస్పందన

నేను ఓ చిన్న రచయితను. అలాంటి నాకు కూడా అభిమాన పాఠకులు వుండటం, ఓ పాఠకురాలి నుండీ వుత్తరం అందుకోవటం- ఇది నాకు తొలి అనుభవం! మీ వుత్తరం నా రచనల పట్ల నాకు ఆత్మ విశ్వాసం కలిగించిందంటే నమ్ముతారా? కానీ, ఇది మాత్రం నిజం!

రచయితల మీద అభిమానంతో పాఠకులు వారికి వుత్తరాలు వ్రాయటం మంచిదే. కాదనను. కాకపోతే పాఠకుడు రచయితను రచయితగానే అభిమానించాలి. అలాగే రచయిత పాఠకుణ్ని పాఠకుడిగానే ఆదరించాలి. ఇద్దరూ ఈ గాడి తప్పకూడదు. అలా జరిగితే మరి పరిణామాలే వేరుగా వుంటయ్- ఇది కేవలం నా అభిప్రాయం.

మీకు మరో మాట కూడా చెబుతున్నాను. రచయిత కూడా మామూలు మనిషే. రాగద్వేషాలకు, కాలప్రవాహపు ఆటు పోట్లకు అతడేం అతీతుడుగాడు. అలాగే నేనూను! ఈ దేశం నాకిచ్చిన వరంగా భావించి ఓ చిన్న వుద్యోగం చేసుకుంటున్నాను. తీరిక సమయాల్లో నా ఆలోచనా పరిధిలో సమాజపరంగా సామాన్యుడికి ఎదురయ్యే సమస్యలను రచనల రూపంలో వెలువరిస్తున్నాను.

ఈ వుత్తరంలో నా వ్యక్తిగత చిరునామా ఇవ్వటం లేదు. అయినా ఉద్యోగస్థుడికి ఒక చిరునామా ఏమిటి? రేపు నేను మీ వూరే వచ్చేయవచ్చు!

మీకు రచయితగా నా పట్ల గల అభిమానానికి కృతజ్ఞతలు. చివరగా ఓ మాట. మీరు రచయితలకు వుత్తరాలు వ్రాయదలిస్తే దయ చేసి వారి వారి వ్యక్తిగత విషయాలు ప్రస్తావించకుండా జాగ్రత్త పడండి.

ఇట్లు
మీ అభిమానానికి పాత్రుడు,
"సమాజ సత్యం"

ఉత్తరం చదవటం పూర్తి చేసిన సౌందర్య తనలో తాను నవ్వుకొంది. అదీ కొంచెం పెద్దగానే ధ్వనించింది.

అప్పుడే అటు వచ్చిన తల్లి యమునాదేవి అది చూసి, "ఏమిటి బేబీ, నవ్వుతున్నావ్?" అంటూ కూతురి దగ్గరికి వచ్చింది.

"ఉత్తరం మమ్మీ!... చూడు..." అంటూ నవ్వుతూనే ఆ వుత్తరాన్ని తల్లికి అందించింది సౌందర్య.

"ఎవరైనా ప్రేమలేఖ వ్రాశారా?"- చేతిలోని వుత్తరాన్ని చదవకుండానే అడిగింది యమునాదేవి.

"కాదు." అంది సౌందర్య.

"మరి?" అంటూ సాలోచనగా చేతిలో వుత్తరాన్ని చదివింది. తర్వాత, "ఆ రచయిత బాగానే వ్రాశాడుగా? ఇందులో అంత చేటు నవ్వు తెప్పించే విషయం ఏముంది?" అడిగింది యమునాదేవి.

"అతడు నాకు వ్రాసిన వుత్తరం నాకు నవ్వు తెప్పించలేదు. కానీ, నేను అతడికి రాసిన వుత్తరమే..."- మరోసారి నవ్వింది సౌందర్య.

"ఏం రాశావ్?... ఏవో పిచ్చి పిచ్చి రాతలు రాసి వుంటావ్. అందుకేగా అతడు చురకలు వేశాడు నీకు ఈ వుత్తరంలో?" అంది యమునాదేవి.

"నిజమే మమ్మీ. పొరపాటైపోయింది... నా అభిమాన రచయిత అయిన 'సమాజ సత్యం' ఎలాంటి వాడు? నిజ జీవితంలో అతడి మనస్తత్వం ఎలా వుంటుంది? ఇవి తెలుసుకోవటానికే నేనతడికి కవ్వింపు ధోరణిలో వుత్తరం వ్రాశాను. కానీ, నా అంచనా తారుమారైంది. అతడికి అలా వుత్తరం వ్రాసినందుకు ఇప్పుడు సిగ్గు పడుతున్నాను. రచయితలు- పాఠకుల అనుబంధం గురించి 'సమాజ సత్యం'గారు చెప్పింది సమంజసంగానే వుంది. కొన్ని సిద్ధాంతాలకు కట్టుబడి రచనా వ్యాసంగం కొనసాగిస్తున్న అతణ్ని రచయితగా ఎప్పుడూ అభిమానిస్తాను" అంది సౌందర్య దృఢంగా.

"బాబీ ఎప్పుడు వస్తాడో ఏమో?... వంట పూర్తయిపోయింది... నువ్వు రా బేబీ. ఇద్దరం కలిసి భోంచేసేద్దాం" అని తిరిగి లోపలికి వెళ్ళింది యమునాదేవి.

చేతిలోని వుత్తరాన్ని భద్రంగా దాచి భోజనం చేయటానికి వెళ్ళింది సౌందర్య.

(ఇంకా ఉంది)

# వీరభద్రుని వివిధ రూపాలు

దక్షుని యాగ మంటపములో శివయోగవహ్ని మేల్కొలిపి అందు దుమికి భస్మమయింది మహాదేవి. ఆ వృత్తాంతము దధీచి శివున కెరిగింప రుద్రుడు కాలరుద్రుడై హుంకారము చేయగా వీరభద్రుడు పుట్టెను.

ధారుణి దిద్దిరం దిరుగఁ దామరస
ప్రభవాండ భాండముల్
భోరున ఘూర్ణిలన్ నిఖిల భూతములున్
బెదగొంద శూలి .
హుంకారము చేసెఁ జేసిన నఖండ
తరప్రళయాగ్ని సన్నిభా
కారుడు వీరభద్రుడతి గర్వసముద్రుడు
పుట్టె రౌద్రతన్.(పోతన)

కడప జిల్లాలో అతిపురాతన మయిన శివాలయము లెన్నో వున్నాయి. ఈ ఆలయములలో



సోమశిల ప్రాజక్టు వద్ద త్రవ్వకాలలో లభించిన వైష్ణవ సాంప్రదాయ పద్ధతిలో నున్న శ్రీ వీరభద్ర స్వామి విగ్రహం

శ్రీ వీరభద్రస్వామి కూడ తప్పక కనిపిస్తాడు. పదినారు చేతుల ప్రచండ మార్తాండ మండల మండితోద్దండుడీ వీరభద్రుడు. అనేక ఆయుధాలు ధరించి మెరుస్తున్న కోరలతో ప్రకాశించి అతి భయంకరమూర్తి వీరభద్రుడు.

కడప జిల్లా సోమశిల ప్రాజక్టు వద్ద త్రవ్వకాలలో బయటపడ్డ వీరభద్రుని విగ్రహాలలో నొకటి వైష్ణవ సాంప్రదాయములో చెక్కబడి వుంది. ఒక చేతిలో ఖడ్గము, ఎడమచేత విల్లు, మరో చేతిలో ముద్గరము, నాల్గవ చేతిలో 'ప్రాస' అనే ఆయుధముతో, పెద్ద ఎత్తైన కిరీటము, చిన్న బొజ్జ కలిగియుంది విగ్రహము.

ఇక్కడనే లభించిన మరొక విగ్రహము మొదటి వానికి భిన్నంగా వుంది. కొంచెము ప్రక్కకు వంచిన నడుము, చిన్న కిరీటము, పెద్ద చక్రాకారములో నున్న కర్ణాభరణాలు, మూతిపై మీసము, ప్రక్కనే



శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాముల వారిచే చెక్కబడిన శ్రీ వీరభద్ర స్వామి విగ్రహం



కడపజిల్లా 'పెద్దనపాడు' లోని శిధిలాలయ మందలి ప్రసన్న వీరభద్రుడు

వాహనము. నాలుగు చేతులలో నాలుగు రకములయిన ఆయుధములు కలిగి వుంది.

కడప జిల్లా లోనే అల్లాడపల్లి ఆలయములో శ్రీ పోతులూరి వీరబ్రహ్మము గారిచే నిర్మింపబడిన విగ్రహము భీకరమై కనిపిస్తుంది. ఇది నిలువెత్తు విగ్రహము. ఈ విగ్రహములోని మూర్తికి రెండు హస్తములే వున్నాయి. ఒక చేత భయంకరమైన ఖడ్గము మరో చేత ముద్గరము వున్నాయి. ఇది దాదాపు నాలుగు వందల యేళ్ల క్రితము ప్రతిష్ఠించిన విగ్రహము. సన్నని నడుము - కొంచెము కుడి వైపుకు వంగి నిలుచున్నట్లున్న భయంకర రూపములో వుంది విగ్రహము.

నాల్గవ విగ్రహము కూడ కడప జిల్లా యర్రగుంట్ల గ్రామానికి ఐదు కిలోమీటర్ల దూరములో నున్న శిథిలాలయములో వుంది. ఈ ఆలయము శ్రీ కృష్ణదేవరాయల నాటిదని



సోమశిల ప్రాజక్టు వద్ద త్రవ్వకాలలో లభించిన శ్రీ వీరభద్రుని విగ్రహం

ఆలయమందలి శాసనము చెబుతూ వుంది. పూర్వమీ ఆలయమున్న చోట 'పెద్దనాపురం' మనే పట్టణముండేది. ఇది ఆంధ్ర కవితా పితామహుడైన అల్లసాని వారి గ్రామము. ఇందలి వీరభద్రస్వామి అరదుగుల ఎత్తయిన నల్లరాతి విగ్రహము. ఇది ప్రసన్న వీరభద్రస్వామి విగ్రహము. నాల్గు చేతులలో ఆయుధాలు పెద్ద కర్ణాభరణాలు, చిన్న కిరీటము. సలాకవంటి సన్నని మూర్తి, సన్నని నడుముతో, ప్రసన్న వదనముతో వుంది విగ్రహము. ఇటువంటి ప్రసన్న మూర్తియైన వీరభద్రుడు మరెచ్చటను కానరాదు. ఈ ఆలయము పాడుపడి, దీపము వెలిగించే దిక్కులేక, ఊరికి దూరంగా వుంది. ఈ వీరభద్రమూర్తులకు భోగమెప్పుడు లభిస్తుందో!

ఏది యేమయినా చూడ చక్కని వీరభద్రుని విగ్రహాలీ నాలుగు.

వ్యాసం, ఫోటోలు:
—ఏ. వీరారెడ్డి



శ్రీధర్ పోర్టికోలో కారుదగ్గర నిలబడి లత, దీపక్ కొంచెం హాలులోకి చూడసాగాడు వాళ్ళు స్కూలు [illegible] లత, [illegible] వచ్చాయి [illegible] ముందు [illegible] వెనుక సీట్లో [illegible] ముందువైపు కూర్చున్నారు శ్రీధర్ కూడ కూర్చుని స్టార్ట్ చేశాడు దీపక్ తండ్రి మొహంమీద చేయివేసి 'డాడీ! నా నీళ్ళ సీసా మర్చిపోయాను టేబిల్ మీద ఉంది' అని గాబరాగా అన్నాడు శ్రీధర్ కారాపి కొడుకువేపు చూచాడు దీపక్ వరండా వేపు చూచి తల్లి అక్కడ నిలబడి ఉన్నందున 'మమ్మీ! నా వాటర్ బాటిల్ మర్చిపోయాను తెచ్చిపెట్టవూ' అన్నాడు. కమల లోపలికి వెళ్ళాలని ప్రక్కకు తిరిగే టప్పటికి అత్తగారు శాంతమ్మ తీసుకువస్తూ కనిపించింది శాంతమ్మ కారు దగ్గరకు వెళ్ళి మనవడి చేతికి యిచ్చి ప్రేమగా తల నిమిరింది పిల్లలిద్దరూ తల్లికి మామ్మకి టా! టా! చెప్తుంటే కారు ముందుకి వెళ్ళింది.

శాంతమ్మకు ముగ్గురు కొడుకులు మూడో కొడుకు పది సంవత్సరాలప్పుడు భర్త చనిపోయాడు. ఆస్తిని జాగ్రత్తగా కాపాడుకొంటూ పిల్లలని పెంచి పెద్ద చేసింది. ముగ్గురు కొడుకులు బాగా చదువుకొని వృద్ధిలోకి వచ్చారు పెళ్ళిళ్ళు చేసింది. పెద్ద కొడుకు లిద్దరికి యిద్దరేసి ఆడపిల్లలు పుట్టిన తరువాత ఆపరేషన్ చేయించు కున్నారు మూడో కొడుకు శ్రీధర్‌కి లత తరువాత పుట్టిన బాబుని చూసి మురిసిపోయింది. యింటి పేరు లేకుండా యింతటితో అంతమై పోతుందని తను పడిన ఆరాటానికి భయానికి భగవంతుడు కరుణించి యింటికి దీపంలా కంటికి వెలుగులా ప్రసాదించాడని దీపక్ అని పేరుపెట్టుకున్నారు మూడు కుటుంబాల మధ్య ప్రేమతో, అనురాగంతో పెరగసాగాడు. ముఖ్యంగా శాంతమ్మ దీపక్ పుట్టిన తరువాత చిన్నకొడుకు శ్రీధర్ దగ్గరే ఉండిపోయింది మనవడి ఆలనా పాలనా చూస్తూ. ఎప్పుడైనా పెద్ద కొడుకుల దగ్గరకి వెళ్ళినా సాయంత్రానికల్లా వస్తుంది అందరి అతి గారాబంతో పెరిగి మొండిగా తయారౌతాడని కమల భయపడేది అందుకు భిన్నంగా అతి చురుకుగా ఉంటూ చదువులో కూడ ఫస్టున ఉండేవాడు వయసుకి మించిన తెలివి తేటలు ఉన్నాయి దీపక్‌కి

రాత్రి భోజనాల సమయంలో దీపక్ "డాడీ! రేపు ఆదివారంకదూ. బీచ్‌కి వెళ్ళాలి గుర్తుందా!" అన్నాడు శ్రీధర్ నవ్వుతూ "నేను మర్చిపోయినా నువ్వు వూరుకోవుకదా" అన్నాడు. అంతలోనే ఏదో గుర్తు తెచ్చుకున్నట్లు "డాడీ! మరే మంచినీళ్ళు ఎక్కువ త్రాగాలట. అలా చేస్తే మనం తిన్న ఆహారం బాగా జీర్ణం అయి బలం వస్తుందని మా టీచర్ చెప్పారు ఈ రోజు" మీరూ తెలుసుకోండి అన్నట్లు ఉంది ఆ చెప్పే తీరులో. వెంటనే లత "మీ టీచర్ చెప్పకపోయినా నీకు సీసా ప్రక్కన ఉండాలికదా" ఉడికిస్తున్నట్లు అంది

'అక్కా, నువ్వు నీళ్ళు ఎక్కువ త్రాగితే లావు అవుతావు' ఉచిత సలహా యిచ్చాడు లతకి

నువ్వు లత వాక్యం పూర్తి చేయకుండానే శాంతమ్మ లతా' నీకు టమాటా పెరుగు పచ్చడి యిష్టంకదా. యింకొంచెం వేసుకో' అంది. లేకపోతే ఆ విషయంమీదే యింకొక పావుగంట వాదించు కుంటారని ఆవిడకు తెలుసు దీపక్ సింక్ దగ్గర చేయి కడుక్కొంటూ డాడీ! వచ్చేవారం మాకు మంత్లీ టెస్ట్ ఉంది నేను వెళ్ళి చదువుకోవాలి" అని అక్కకొంటకు అక్కడే నిలబడ్డాడు శ్రీధర్ పిల్లలవేపు చూస్తూ" ఏమైన తెలియకపోతే మమ్మీని అడగండి రేపటినుండి ఉదయం లెక్కలు చెప్తాను" అన్నాడు దీపక్ సీరియస్‌గా ముఖంపెట్టి" డాడీ! మా టీచర్ చాలా పిసినారి. ఎంతబాగా లెక్కలు చేసినా నూటికి నూరు మార్కులేవేస్తారు. పదిమార్కులు కూడ ఎక్కువ వెయ్యరు" అన్నాడు శ్రీధర్ కమల గట్టిగా నవ్వారు వాడి అమాయకత్వానికి.

బీచ్ అంతా సందడిగా ఉంది. ఎటు చూచినా జనమే రంగు రంగుల బట్టలతో వివిధ రకాల ఫేషన్‌లతో హడావిడిగా ఉంది పెద్దలు తమ వయస్సు మర్చిపోయి పిల్లలతో సమానంగా అలలతో ఆడుకుంటూ చుట్టూ పరిసరాలు మర్చిపోయి సంతోషంతో అరుస్తున్నారు. దీపక్ అక్క చెయ్యి పట్టుకొని నీళ్ళల్లో నిలబడ్డాడు ఒక్కొక్కసారి పెద్ద కెరటాలు విసురుగా వచ్చి కాళ్ళను తడిపి ఒడ్డుకు చేరేవి. అలాంటప్పుడు కాళ్ళక్రింద యిసుకంతా కదిలి వింత అనుభూతి కలిగేది. ఈసారి పెద్ద కెరటం రావటంతో వాళ్ళిద్దరికి మోకాళ్ళపైవరకు నీళ్ళు వచ్చాయి. నిలదొక్కుకోలేక త్రుళ్ళిపడ్డాడు దీపక్. లత తేరుకొని దీపక్‌ని లేపటానికి వంగింది అప్పటికే శ్రీధర్, కమల, శాంతమ్మగారు పరుగున వెళ్ళి దీపక్‌ని పైకెత్తారు. కొంచెం దూరంలో ఉన్నవాళ్ళు పిల్లవాడికి ఏమీ ప్రమాదం లేనందుకు సంతోషించి పిల్లలని ఒకకంట కనిపెట్టి ఉండాలని జాగ్రత్తలు చెప్పారు. దీపక్ సముద్రం వేపు చూస్తూ "మామ్మా! ఈ నీళ్ళు ఎంత ఉప్పగా ఉన్నాయో. అసలు బాగాలేవు" అన్నాడు ముఖం అదోలాపెట్టి. శాంతమ్మగారు మనవడి తల నిమురుతూ ఉండి పోయింది. వచ్చేటప్పుడు గుడికి వెళ్ళి అష్టోత్తరం చేయించింది ఆవిడ,ఆపద గడిచినందుకు.

* * *

అరొంట ప్రోగ్రెస్ రిపోర్ట్సు యిచ్చాయి లత, దీపక్ తండ్రి రాపటంతోటి చేతికి యిచ్చారు దీపక్‌కి ఫస్టురాంక్ వచ్చినందుకు మెచ్చుకున్నారు. లతకు ఫోర్త్ రాంక్ వచ్చింది. ఈసారి యింతకంటె మంచిరాంక్ రావాలి అని ధైర్యం చెప్పారు కూతురికి 'డాడీ! తమ్ముడు సెకెండ్ స్టాండర్డ్ కదా వాళ్ళకి మాకంటె తక్కువ పుస్తకాలు. మా ఫిఫ్త్ వాళ్ళకి బోలెడు ఉంటాయి " అంది లత దీపక్ ఫస్టురాంక్ రావటం గొప్పకాదన్నట్లు ఉంది ఆ చెప్పే తీరు

వెంటనే దీపక్ "మాకూ ఉన్నాయి తెలుసా, హోమ్‌వర్క్ కూడ ఎక్కువ ఉంటుంది కోపంగా అసహనంగా అన్నాడు. కమల నవ్వుతూ "ప్రతీక్లాస్‌కి సరిపడా పుస్తకాలు ఉంటాయి మీరు శ్రద్ధగా చదవాలి ఎప్పుడూ మీరిద్దరూ మంచి రాంక్స్ తెచ్చుకోవాలి తెలిసిందా వెళ్ళి ఆడుకోండి" అని వాళ్ళని అక్కడినుండి పంపివేసింది.

* * *

ప్రతిరోజూ ఆరుగంటలకల్లా లేచి కాసేపు చదువు కుంటారు లత, దీపక్ అందుకు భిన్నంగా లత ఒక్కతే కూర్చుని ఉంది హాలులో. అటుగా వచ్చిన శాంతమ్మ దీపక్ చదవకుండా ఏం చేస్తున్నాడని అడిగింది లతని. తను లేపితే లేవకుండా ముసుగుతన్ని పడుకున్నాడని చెప్పింది ఎందుచేత లేవలేదో అని దీపక్ దగ్గరకెళ్ళి మంచంమీద కూర్చుని మెల్లిగా "దీపూ, లేమ్మా. బాగా తెల్లవారి పోయింది. ముఖం కడుక్కొ పాలుత్రాగుదువు కాని" అంది రెండు మూడుసార్లు పిలిచినా 'ఊ' అని అన్నాడే కాని లేచే ప్రయత్నం చెయ్యలేదు. పోనీలే కాస్సేపు పడుకోనీ అని ఆవిడ వెళ్ళిపోయారు ఏడుంపావు అయినా దీపక్ లేవలేదు దీపక్ రోజూలా యిల్లంతా తిరుగుతూ తనపనులు చేసుకోకుండా గదిలో పడుకొనేటప్పటికి కమలకూడ ఆదుర్దాగా దీపక్‌ని లేపటానికి ప్రయత్నించింది కళ్ళు తెరిచి చూచి మళ్ళీ కళ్ళు మూసుకున్నాడు నుదురు, చేతులు పట్టుకొని చూచింది మామూలుగానే ఉంది శ్రీధర్ కూడ వచ్చి చూచాడు ఒంట్లో ఎలా ఉంది అని అడిగితే బాగానే ఉందని నిద్రపోతానని చెప్పాడు కుటిసాకులతో స్కూలు మానేసే రకంకాదు స్కూలు అన్నా, చదువన్నా శ్రద్ధ ఎక్కువ ఈమధ్య పరీక్షలని ఎక్కువ సేపు చదివాడు నిద్ర సరిపోలేదేమో ఈరోజు స్కూలుకి వెళ్ళకపోతే బలవంతం చెయ్యవద్దని. తనిష్టమైనంతసేపు పడుకొని రెస్టు తీసుకోనివ్వమని చెప్పాడు భార్యకి ఆరోజు లత ఒక్కతే స్కూలుకి వెళ్ళింది

"దీపూ లేమ్మా, ముఖం కడుక్కొని పాలు త్రాగుదువు పది గంటలైంది దీపూ బంగారు కొంత చెప్పిన మాట వినడు కమల మనస్సు ఆదోలా ఉంది.

నిరాసంగా లేపి కూర్చోపెట్టింది ముఖం కడిగించి పాలగ్లాస్ యిచ్చిం చేతికి నాలుగయిదు గుక్కలు



తాగి ప్రక్కనపెట్టాడు. కమల బుజ్జగిస్తున్నట్టు 'తాగు నాన్నా. ఆకలివేస్తుంది.' అంది.

"మమ్మీ, బాగా చలిగాఉంది' అన్నాడు దీపక్ కొంచెం వణుకుతూ. ఎందుకైనా మంచిదని ధర్మామీటర్ తీసుకొచ్చి జ్వరం చూసింది నార్మల్‌గా ఉంది జలుబు చేసిందేమో. ఆ లక్షణాలు ఏమీ కనిపించడంలేదు. 'దీపూ, పోనీ నాలుగు బిస్కెట్స్ తిను లేకపోతే మరీ నీరసంగా ఉంటుంది," బిస్కెట్లు పళ్లెంలో పెట్టి యిచ్చింది అయిష్టంగానే రెండు తిని తక్కినవి వదిలేశాడు యిక చేసేదిలేక దీపూని పడుకోబెట్టి బ్లాంకెట్ తెచ్చి సరిగా కప్పింది శాంతమ్మ కూడ మధ్యలో రెండు సార్లు వచ్చిచూసి దీపక్ కళ్ళుమూసుకొని పడుకోవటంతో వెళ్ళిపోయింది.

ఒంటిగంటకు కమల వెళ్ళి దీపక్‌ని లేవదీసి డైనింగ్ టేబిల్ దగ్గఱకు తీసుకువచ్చి భోజనం వడ్డించింది అది కూడ అంతంత మాత్రంగానే తిన్నాడు గ్లాస్‌తో మంచినీళ్ళు యిచ్చింది ఒకసారి దానివేపు చూసి కళ్ళు మూసుకొని వద్దన్నాడు.

"దీపూ! మంచినీళ్ళు తాగమ్మా" మళ్ళీ గుర్తు చేసింది కమల. 'ఊహూ... . వద్దు" తల తిప్పాడు చేసేది లేక టవల్‌తో మూతి చేతులు తుడిచింది "దీపూ! కారమ్స్ ఆడుదామా!" కొడుకుని ఉత్సాహపరిచేందుకు అడిగింది "వద్దుమమ్మీ! చలి వేస్తుంది" నెమ్మదిగా అన్నాడు అక్కడే ఉన్న శాంతమ్మ కూడ ఆశ్చర్యంగా చూసింది దీపక్‌వేపు చలివేసేంత వాతావరణం కాదు అదీకాక చలిగా ఉన్నప్పుడు కూడ ఫాన్ వేసుకొని పడుకుంటారు యింట్లో అందరూ. మరి యిదేవిటి దీపుయిలా అంటున్నాడు అత్తా కోడళ్ళు ఒకరి మొహంలోకి ఒకరు చూసుకున్నారు "కమలా! సాయంత్రం అబ్బాయి రావటంతోటే దీపూని డాక్టర్ గారి దగ్గరకు తీసుకెళ్ళండి ఒకసారి చూపిస్తే బాగుంటుంది" కోడలితో అంది శాంతమ్మ.

'అలాగే' అన్నట్టు తలూపింది కమల. శాంతమ్మ మనవడ్ని తీసుకొని పిల్లల గదిలోకి వెళ్ళింది దీపక్ మంచంమీద పడుకున్నాడు మామ్మా! లైటు ఆర్పేయి" అన్నాడు కళ్ళు చికిలిస్తూ ఆవిడ ఆశ్చర్యంగా లైటు వేపు చూసింది లైట్లు ఎక్కడ వెలుగుతున్నాయా అని కిటికీగుండా బాగా వెలుతురు లోపలికి పడుతున్నందువల్ల అలా అంటున్నాడని లేచి కిటికీలకు ఉన్న కర్టన్లు దించింది. గదిలో వెలుగు నీడలు దోబూచులాడుకుంటున్నట్టు ఉంది

* * *

గోడగడియారం నాలుగు గంటలు అయినట్టు తన ఉనికిని తెలియచేస్తూ శబ్దం చేసింది దీపక్‌కి సేమ్యా ఉప్మా యిష్టమని చేయించింది కమల పళ్ళెంలో ఉప్మాతో మంచినీళ్ల జగ్‌తో దీపక్ దగ్గరకి వచ్చి "దీపూ! టిఫిన్ తినమ్మా మధ్యాహ్నం సరిగా భోజనం చేయలేదు " ఆప్యాయంగా దగ్గఱ కూర్చుని మెల్లగా తినిపించింది కమల "మమ్మీ! దాహంగా ఉంది నీళ్ళు కావాలి." దీపక్ కంఠం మామూలుగా లేదు నూతిలోనుండి వచ్చినట్టుగా ఉన్నాయి మాటలు కమల గ్లాసులోకి వొంపి చేతికి యివ్వబోయింది గ్లాసు మూతి దగ్గఱకు తీసుకోబోయిన వాడల్లా విసురుగా అవతలకి తోసేశాడు ఆ విసురుకి దూరంగా వెళ్ళి పెద్ద శబ్దంచేస్తూ క్రింద పడింది. ఏం జరిగిందో తెలుసుకొనే లోపలే సగం కమల చీరమీదా మిగతావి గచ్చుమీదా పడ్డాయి

దీపూ! ఏమ్మా, ఏమైంది ఎందుకలా చేశావు కొడుకు తలమీద చేయివేసి నిమిరింది అయోమయంగా ఆ ప్రశ్నలకి సమాధానం చెప్పకుండా తల్లిని రెండు చేతులతో చుట్టివేశాడు సన్నగా వణుకుతున్నాడు కమలకు ఏం చెయ్యాలో తోచక కొడుకు వెన్ను తట్టింది మెల్లిగా భయపడవద్దన్నట్టుగా

"మమ్మీ! భయం వేస్తున్నది' తల్లిని మరింత గట్టిగా పట్టుకున్నాడు గదిలో వచ్చిన శబ్దానికి శాంతమ్మ, పనిమనిషి మైసమ్మ అక్కడికి వచ్చారు ఆతృతగా అత్తగార్ని చూచిన కమల' దీపూ ఎందుకో భయపడుతున్నాడత్తయ్యా" అంది శాంతమ్మ దీపక్ మంచంమీద కూర్చుని మనవడ్ని మెల్లగా దగ్గఱకు తీసుకొని తన వొడిలో పడుకోబెట్టుకొంది

ఆవిడకి ఏం చెయ్యాలో తోచలేదు మైసమ్మకు కూడ ఏదోలాగ ఉంది ఒక్క నిముషం కూడ ఊరుకోకుండా అల్లరిగా సరదాగా గెంతుతూ గుమ్మటంలా యిల్లంతా తిరుగుతూ సందడిగా ఉండే బాబు అలా మన్నుతిన్న పాములా ఉండేటప్పటికి మనసంతా చేదుతిన్నట్టు అయింది. శాంతమ్మ వేపుచూచి "అమ్మగారూ! బాబు ఏదైనా చూసి జడుసుకున్నాడేమో. లేక ఏదైనా గాలి

సోకిందేమో. ఎందుకైనా మంచిది సాయంత్రం ఎర్రనీళ్ళు దిగతుడిచివేద్దాము. మా వీధిలో మస్తాన్ సాయబు దగ్గఱ తాయెత్తు తెస్తాను. కద్తామమ్మా" ఏమంటారోనని ఆదుర్దాగా చూచింది కోడలివేపు చూచి "అమ్మాయ్, మైసమ్మ చెప్పినట్టు కూడ చేద్దాం అందువల్ల నష్టం ఏమీలేదుగా ఎలాగు డాక్టర్‌గారి దగ్గరఱకు తీసుకువెళ్దామనుకున్నాము కదా!" సాలోచనగా అంది. కమల మవునంగా కళ్ళతోనే తన అంగీకారం తెలిపింది.

* * *

సాయంత్రం శ్రీధర్‌వెంట లత కూడ వచ్చింది యింటికి ఫోన్‌ద్వారా సంగతి విన్న శ్రీధర్ రావటం తోటే దీపక్ దగ్గఱకు వెళ్ళి పలకరించాడు. తండ్రిని చూచి మామూలుగా నవ్వాడు. లత బట్టలు మార్చుకొని టిఫిన్ తిన్న తరువాత తమ్ముడు దగ్గఱ కూర్చుంది రోజూలా హుషారుగా మాట్లాడక పోవటం బంతాటకి రాకపోవటం ఏదో వెలితిగా అన్పించింది మామ్మా! దీపూకి జ్వరం వచ్చిందా" సందేహం తీర్చుకోవటానికి అడిగింది." లేదే లతా, జ్వరం లేదు పాడూలేదు. జడుసుకున్నాడో ఏమో, ప్రొద్దుటి నుండి మగతగా పడుకున్నాడు' శాంతమ్మ దిగులుగా అంది. లత మాట్లాడకుండా హాలువేపు వెళ్ళింది. శ్రీధర్, కమల కొడుకును తీసుకొని కారులో వెళ్లారు డాక్టర్ దగ్గఱకి డాక్టర్ విశ్వనాథం ఫామిలీ డాక్టరేగాక శ్రీధర్‌కి చిన్నప్పటినుండి మంచిఫ్రెండ్ కూడ సాయంత్రం వేళల్లో క్లినిక్‌లో బిజీగా ఉంటాడని దీపక్‌ని అక్కడికే తీసుకెళ్లారు. లేకపోతే ఫోన్‌చేస్తే యింటికి వచ్చేవాడే. డాక్టర్ విశ్వనాథం నిదానంగా పరీక్ష చేశాడు దీపక్‌ని ఏలోపం కనిపించలేదు. పైన ఫాన్ తిరుగుతున్నా విపరీతంగా చెమటలు పడుతున్నాయి దీపక్‌కి మధ్య మధ్యలో, అంతకు మినహా మరేమీలేదు. ప్రొద్దుటనుండి సరిగా భోంచెయ్యక పోవటంచేత నీరసం ఎక్కువౌతుందని ఒక ఇంజక్షన్ చేశాడు.

తనకు కలిగిన అనుమానం శ్రీధర్‌కు చెప్పటమా మానటమా అని క్షణంసేపు ఆలోచించాడు. అది కేవలం అనుమానం కావచ్చు. ఎంత స్నేహితుడయినా తన వృత్తి ధర్మాన్ననుసరించి కొన్ని విషయాలు చెప్పకూడదు. ఎంత ఆత్మీయులకైనా కొన్నిసార్లు మేలుకంటే కీడు జరగవచ్చు శ్రీధర్‌తో "బాబుకు ఏమీ పర్వాలేదు. తనకిష్టం లేకుండా ఏపని చెయ్యవద్దు నేను పదిగంటలకు యింటికి వెళ్ళే ముందు ఒకసారి వచ్చి చూస్తాను కంగారు పడకండి" అని ధైర్యం చెప్పి దీపక్‌తో "దీపూ, ఈ రోజుకి చదువుపక్కన పెట్టెయ్యి. రెస్టు తీసుకో. సరేనా!" అన్నాడు నవ్వుతూ. "అంకుల్, నేను క్లాసులో ఫస్టున పాసయ్యాను నా రాంక్ ఫస్టు" ఎంతో ఉత్సాహంగా చెప్పాలని ప్రయత్నించినా ముఖంలో అలసట కొట్టవచ్చినట్టు కన్పించింది "వెరీగుడ్' నవ్వుతూ దీపక్ బుగ్గ సాగదీసాడు.

* * *

డా విశ్వనాథం శ్రీధర్ యింటికి వచ్చేటప్పటికి అందరూ దీపక్ దగ్గర కూర్చొని ఉన్నారు దీపక్ స్కూలు సంగతులు చెప్పుతున్నాడు గదిలో లైటు

## చరిత్ర పుటల్లో.....

నెలవంక ఊలు తివాసీలపై
నర్తించిన మొగలాయి వైభవం
శిదిలమైన కోట గోడల మాటున
జిజియా పన్ను ప్రతిఘటన
కేకలు ప్రతిధ్వనిస్తున్నాయి!
    నల్లవాడు
    తెల్లవాణ్ని తరిమికొట్టిన బాటలో
    తెల్లవాడికి నల్లవాడు
    తన ఉప్పుపైతను గట్టిన
    పన్ను ముద్రలు పడివున్నాయి!
నల్లవాడు నల్లవాణ్ని
పాలిస్తున్న నేడు
పన్నుగట్టి రహదారిపై
పాదం మోపమంటున్నాడు
రేపటి చరిత్ర పుటల్లో
పన్నుల విధింపు ఫలితం
ప్రస్ఫుటంగా కనిపిస్తుంది!

–అడిగోపుల వెంకటరత్నమ్

## "దాహం! దాహం!"

మాత్రం లేదు. హాలులో ఉన్న లైట్ల వెలుతురు కొంచెంగా పడుతున్నది ఆ గదిలో "దీపూ! ఎలా ఉన్నావు. భోజనం చేశావా" అడిగాడు "లేదంకుల్, ఆకలిలేదు బిస్కెట్లు తిన్నాను" అన్నాడు. ఆ మాటల్లో ఏదో కంగారు ఉంది ఒకసారి దీపక్ ముఖంలోకి చూచాడు "పాలు త్రాగావా" అన్నాడు. "కొంచెం త్రాగాడండి" కమల సమాధానం చెప్పింది. "దీపూ, యింకేమైనా తినాలని ఉందా!' పరిశీలనగా చూస్తూ అన్నాడు..."వద్దంకుల్, చాలా దాహంగా ఉంది. "మెల్లిగా అన్నాడు కమల ఏదో గుర్తుకు వచ్చినట్లు "డాక్టర్, రోజుకి నాలుగు సీసాలైనా నీళ్ళు త్రాగుతాడు. అలాంటిది యివేళ పట్టుమని సగంసీసా కూడా తాగలేదు" అంది

"గాజుగ్లాసుతో నీళ్ళు తీసుకురండి" అన్నాడు డా. విశ్వనాథం. కమలవెళ్ళి పట్టుకొచ్చింది "దీపూ, త్రాగమ్మా" అన్నాడు గ్లాసు చేతితో పట్టుకొని దీపక్ దగ్గరగా తెచ్చి. త్రాగటానికి ముందుకు పెట్టిన మొహాన్ని ఒక్కసారి గందరగోళంగా, భయంగా పెట్టి "వద్దు. . వద్దు అఖ్ఖర్లేదు" అని గట్టిగా కళ్ళు మూసుకున్నాడు. ఆ వింత ప్రవర్తనకి అందరూ భయంగా చూడసాగారు. గ్లాస్ టేబిల్‌మీద పెట్టి దీపక్ వీపు మెల్లగా నిమరసాగాడు భయం లేదన్నట్టు డా. విశ్వనాథం.

డా. విశ్వనాథం ఒకసారి శ్రీధర్ వైపు చూచాడు పరిస్థితి ఎలా ఎదుర్కొని మాట్లాడాలా అని ఆలోచించాడు ఒక్క క్షణం

"శ్రీధర్, బాబుని జనరల్ హాస్పటల్‌కి తీసుకెళ్దాం అక్కడ ట్రీట్ చేయిద్దాం." అంతకంటే ఏం మాట్లాడాలో వివరంగా ఎలా చెప్పాలో తోచలేదు విశ్వనాథంకి.

"విశ్వా, యింటి దగ్గర ట్రీట్‌మెంట్ చేయటానికి వీలులేదా. లేక వేరే స్పెషలిస్టుకి చూపించాలనుకుంటున్నావా అసలు జబ్బు ఏమిటి?" శ్రీధర్ అనుమానంగా అడిగాడు. విశ్వనాథం మెల్లగా నవ్వాడు. ఆ నవ్వులో వైరాగ్యం ఉంది అసహాయత ఉంది స్నేహితుని ప్రశ్నలకు జవాబు చెప్పలేని వేదన ఉంది నిజాన్ని నిర్భయంగా చెప్పలేని పిరికితనానికి ప్రతీకలా ఉందా నవ్వు. "విశ్వా, మాట్లాడవేంటి బాబూ, దీపూకి ప్రమాదమా చెప్పునాయనా" శాంతమ్మగారి కంఠంలోని బరువుకి మాట్లాడక తప్పిందికాదు.

'ఫర్వాలేదమ్మా, ఇది కొంచెం అంటువ్యాధిలాంటిది లత కూడ చిన్న పిల్ల కదా. ఎందుకైనా మంచిది దూరంగా ఉంటే రెండు రోజులు హాస్పిటల్‌లో ఉంచి మందులు యిప్పిస్తాము" ధైర్యం చెప్తున్నట్టు అన్నాడు.

"యిప్పుడే వెళ్దామా" ఆందోళనగా అన్నది ఆమె.

"ఎప్పుడైనా ఒకటే గదమ్మా" తప్పదన్నట్టుగా ఉంది ఆ జవాబు.

"శ్రీధర్, బాబుకి కావలసిన సామాన్లు ఒక ప్లాస్టిక్ బుట్టలో సర్దమను" అన్నాడు. కమల పనిమనిషి సాయంతో సర్దసాగింది ఆమె మనసంతా ఆందోళనగా ఉంది తనని హాస్పటల్‌కి తీసుకువెళుతున్నారని దీపక్‌కి అర్థమయింది. 'అంకుల్, అక్కడ పెద్ద ఇంజక్షన్ యిస్తారా అవంటే నాకు భయం, మీకు తెల్సుగా" జాలిగా అన్నాడు "మనం వెళ్ళింది మొదలు మళ్ళీ నిన్ను అక్కడి నుండి తీసుకొచ్చేవరకు నీతోనే ఉంటాను. అయినా రెండు, మూడు రోజులకంటే ఎక్కువ అక్కడ ఉండము అమ్మ, నాన్న కూడ అక్కడ ఉంటారు అక్కడ అందరూ నాకు తెల్సినవాళ్లే పరీక్షలు చేయించుకొని వచ్చేద్దాము" అభయమిస్తున్నట్టుగా అంటున్న విశ్వనాథం కంఠం చిన్నగా వణికింది గబగబా హాలులోకివచ్చి యింటికి ఫోనుచేసి తాను యింటికి రావటంలేదని తనగురించి చూడవద్దని భార్యకి చెప్పి అక్కడే ఉన్న సోఫాలో కూర్చున్నాడు. దీపక్‌ని ఎత్తుకొని శ్రీధర్, సరంజామాతో వస్తున్న మైసమ్మ వెనుకగా కమల వచ్చారు హాలులోకి.

విశ్వనాథం వాళ్ళను చూచి "శ్రీధర్! నువ్వు, కమల వస్తే చాలు అమ్మకు, లతకు సాయంగా మైసమ్మను, తోటమాలి రాజయ్యను ఉంచు యింటిదగ్గఱ కావాలంటే ప్రొద్దుట అమ్మవస్తుంది అక్కడకు" అని తన కారుపార్కు చేసిన దగ్గఱకు వెళ్ళి తలుపుతీసి స్టీరింగ్ దగ్గర కూర్చున్నాడు. కమల శ్రీధర్‌బాబుని తీసుకొని వెనుక సీట్లో కూర్చున్నారు. వెళుతున్నకారువేపు చూస్తూ కళ్ళు మూసుకొని తన యిష్టదైవాన్ని తలుచుకొంది శాంతమ్మ. మైసమ్మ కూడ అప్రయత్నంగా చేతులు జోడించింది బాబు క్షేమంగా యింటికి రావాలని

రాత్రి పదకొండు గంటలప్పుడు ఎమర్జెన్సీ గది ముందు ఆగినకారుని చూసి డ్యూటీలో ఉన్న నర్సు ఎవరా అనిచూసింది. ఏదో ఆలోచిస్తున్న శ్రీధర్

కూడ అప్రయత్నంగా చుట్టూ చూశాడు. అది జనరల్ హాస్పిటల్ వాతావరణంలాలేదు. ఏదో నిశ్శబ్దం. అక్కడక్కడా లైట్లు. విసిరేసినట్లున్న దూరదూరంగా ఉన్న వార్డులు జత్తు విరబోసుకొని తలలు ఊపుతున్నట్లు అనుభూతి కలిగించే పెద్ద చెట్లు ఆ మసక చీకట్లో భయం కలిగించాయి ముగ్గురూ బాబుతో కారుదిగి డ్యూటీ నర్సు దగ్గరకు వెళ్ళారు. విశ్వనాథాన్ని చూచి గుర్తుపట్టి నర్సు విష్ చేసింది వాళ్ళను కూర్చోమని డ్యూటి డాక్టర్‌కు కబురు చేసింది.

డ్యూటి డాక్టరువచ్చి విశ్వనాథాన్ని పలకరించి, బాబుని పరీక్షించి కొంత సమాచారాం విశ్వనాథం ద్వారా తెలుసుకొని ఎందుకైనా మంచిదని హాస్పిటల్ సూపర్నెంటు యింటికి ఫోన్ చేసి అన్ని వివరంగా చెప్పాడు డా విశ్వనాథం పేరున్న డాక్టరు కావటం ఒకటి, శ్రీధర్‌కి పేరు ప్రఖ్యాతులు. ఆ వూళ్ళో బాగా పలుకుబడి ఉండటం వేరొక కారణంచేత సూపర్నెంటుకు ఫోన్ చేయటం జరిగింది పావు గంటకల్లా సూపర్నెంటు హాస్పటల్‌కి వచ్చాడు తన గదిలో విశ్వనాథంతో వేదినిముషాలు మాట్లాడాడు తరువాత బాబుని పరీక్షచేసి అడ్మిట్ చెయ్యమని చెప్పాడు డ్యూటీ డాక్టర్‌కి దీపక్ ఆందోళన, భయం, కంగారు తగ్గటానికి ఇంజక్షన్ చెయ్యమన్నాడు బాబు నిద్రపోతాడని డిస్టర్బ్ చేయవద్దని, ప్రొద్దుటే వచ్చి చూస్తానని చెప్పి వెళ్ళిపోయాడు

యింజక్షన్ యిచ్చిన పదిహేను నిముషాలకల్లా నిద్రలోకి జారిపోయాడు. తెల్లవారేలోగా నాలుగైదు సార్లు డాక్టరు, నర్సులువచ్చి చూసి పోయారు

"మమ్మీ.... దాహం .. దాహంగా ఉంది" తెల తెలవారుతుండగా మెల్లగా కళ్ళు విప్పి అన్నాడు దీపక్ "ముందు పళ్ళుతోముకో. తరువాత తాగుదువు" అని కమల మెల్లగా బ్రష్ చేయించి నీళ్ళ జగ్ తీసుకొని నోట్లో నీళ్ళు పోసింది పుక్కిలింతకు. దీపక్ ఉక్కిరి బిక్కిరి అయి ఆయాస పడిపోయాడు అతి కష్టంమీద రెండుసార్లు పుక్కిలించాడు కళ్ళు గట్టిగా మూసుకొని వణికి పోతూ తల్లిని గట్టిగా పట్టుకొని "నాకు భయంగా ఉంది మమ్మీ, దాహం వేస్తుంది. మంచినీళ్ళు కావాలి స్కూలుకు వెళ్ళాలి టైమ్ అవుతూంది దాహంగా ఉంది. మమ్మీ అక్కను కోప్పడవద్దు నాకూ . మంచినీళ్ళు తాగుతాను "

ఒకదానికి ఒకటి సంబంధం లేకుండా ఏమిటో తొందరగా మాట్లాడుతున్నాడు

శ్రీధర్‌లేచి మంచినీళ్ళ గ్లాసు యిస్తూ "దీపూ, యివిగో- త్రాగు నీకు ఎందుకు భయంగా ఉంది. చెప్పకపోతే మాకు ఎలా తెలుస్తుంది" లాలనగా అడిగాడు నీళ్ళు చూస్తూనే వెర్రెత్తిన వాడిలా తలవిదిలిస్తూ పెద్దగొంతుతో "వద్దు.. వద్దు వద్దు" అన్నాడు. కమలకు నోట మాట రాలేదు భయంతో

* * * * *

సూపర్నెంటు గదిలో నుండి నిద్రలో నుండి అప్పుడే లేచి నడిచి వస్తున్నట్లు వచ్చాడు శ్రీధర్. కళ్ళు ఎర్రగా మంకెన పువ్వుల్లాగ ఉన్నాయి. ముఖంలో ఎన్నో లంఖణాలు చేసిన నీరసం ఉంది. బలవంతంగా దుఃఖాన్ని అదిమిపట్టినట్లు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఎగిరెగిరి పడుతున్నాయి. ఎదురుగా ఉన్న హాలులో కూర్చున్న విశ్వనాథం వస్తున్న శ్రీధర్‌ని చూసి మవునంగా దగ్గఱకు వచ్చి చుట్టూ చేయివేసి దగ్గరకు తీసుకున్నాడు. అంతవరకూ అదుపులో పెట్టుకున్న బాధని ఒక్కసారిగా స్నేహితుని చేతుల్లో ముఖం దాచుకొని కుమిలి పోయాడు. విశ్వనాథానికి కూడా అదే మంచిదనిపించింది ఆ సమయంలో, హఠాత్తుగా "విశ్వా, ఈ సంగతి నీకు ముందే తెలుసుగదూ. దీపూ నలభై ఎనిమిదిగంటల్లోపల మనల్ని విడిచి వేరే లోకానికి వెళ్ళిపోతాడా. ఇది . ఇది నిజమేనా! నో.. నో అలా జరగటానికి వీల్లేదు. ఎంత డబ్బైనాసరే ఎన్ని లక్షలు ఖర్చు అయినా సరే దీపూ బ్రతకాలి ఫారెన్ నుండి విమానంలో మందులు తెప్పిస్తాను. లేకపోతే దీపూని ఫారెన్ తీసుకెళ్ళి ట్రీట్‌మెంట్ యిప్పిద్దాం ఈ రోజే. కాని. దీపూ బ్రతకాలి. విశ్వ చెప్పు. నీ మవునం నాకు పిచ్చెక్కిస్తున్నది విశ్వా మాట్లాడు " స్నేహితుడ్ని కుదిపేస్తూ అన్నాడు. భర్తకు ఏదో చెప్పటానికి అక్కడికి వచ్చిన కమల ఆ మాటలు విన్నది. పరిసరాలను కూడ మరిచిపోయి ఏమండీ! .. దీపూ నాదీపూ, బాబు మీరు అంటున్న మాటలు అబద్ధం మీరూ " భర్త

# ఈ వేమన పద్యాలు




హింసలన్ని మాని హితుడయి జనుడు సం
సారి యయిన ముక్తి చేరవచ్చు
హింసలెన్నొ చేసి హితుడౌట యెట్టులో
విశ్వదాభిరామ వినురవేమ.

చేతుల్లో ఒరిగిపోయి ఆపైన మాట్లాడలేక పోయింది. శ్రీధర్ ముందుగా తేరుకొని విశ్వనాథం సాయంతో అక్కడ ఉన్న బెంచీపై కమలను పడుకో బెట్టి డాక్టర్‌ను పిలవటానికి వెళ్ళాడు

* * * * * *

ఫోన్లు అందుకున్న శ్రీధర్ అన్నయ్యలు, వదినలు, పిల్లలు, స్నేహితులు, బంధువులు, పరిచయస్తులు యింకా ఎందరో వచ్చారు హాస్పటల్‌కి ఎవరు ఎంత చెప్పినా కమల కొడుకు దగ్గర నుండి కదల్లేదు. శాంతమ్మకు బాబుని

## "దాహం! దాహం!"

ఒకసారి చూపించి యింటికి తీసుకెళ్ళారు ఆవిడ పరిస్థితిని అదుపులో ఉంచేందుకు అవసరమై నప్పుడల్లా నిద్రయింజక్షన్ యిస్తున్నారు. దీపూ పరిస్థితి గంటగంటకూ దిగజారసాగింది కుక్క కాటువల్ల ఆ జబ్బు వస్తుందని, విపరీతమైన దాహంతో అరుస్తూ అంగలారుస్తారని తీరా నీళ్ళు కళ్ల దగ్గరకు వచ్చేసరికి భయంతో అరిచి వాటిని దరిదాపులకు రానివ్వరని డాక్టర్లు చెప్పారు. అది ప్రమాదకరమైన జబ్బని, రోగి ఉమ్మి, ఆరోగ్యమైన వారికి చిన్నగాయమైనా ఆ ఉమ్మి దానిమీద పడితే ఆ రాబిస్" అనే వ్యాధి వస్తుందని చెప్పారు వారం రోజుల క్రిందట బంతిఆట ఆడుతూ గేటు బైటికి వెళ్ళిన బంతిని తెచ్చుకోటానికి వెళ్ళిన దీపక్‌ని ఆ వీధిలో తిరిగే కుక్క కాలిమీద గాటు వేసిందని లత ద్వారా తెలుసుకున్నారు యింట్లో చెప్తే ఏమన్నా అంటారని చెప్పలేదని చెప్పింది లత ఆ వ్యాధి వచ్చిన తరువాత ప్రాణాల్ని రక్షించేందుకు యింకా మందు కనిపెట్టలేదని, దానికి యింకా ప్రయత్నాలు జరుగుతున్నాయని, ఎన్నో దేశాలు నిర్విరామంగా కృషి చేస్తున్నాయని డాక్టర్లు చెప్పారు విధి విచిత్రం ఏమంటే ఆ వ్యాధి వచ్చిన రోగి తన చావు తథ్యమని తనవాళ్ళని వదిలి మృత్యువు వెంట వెళ్ళాలని తెల్సుకుంటాడు దీపూకి ఈ విషయం తెలుసుకొనే వయసు రాలేదు. అంతే తేడా.

* * * * *

"డాడీ .దాహం. దాహంగా ఉంది

"మమ్మీ– నాకు నీళ్ళు కావాలి నా వాటర్‌బాటిల్ మర్చిపోయాను '

'మామ్మా నేను అల్లరి చెయ్యను నువ్వు పూజలో ఉన్నావుగా "

అలా పలవరిస్తూనే ఉన్నాడు దీపక్ దీపక్ మాటలు వింటుంటే అక్కడ ఉన్నవాళ్ళ హృదయాలు ద్రవిస్తున్నాయి చుట్టూ బంధుజనం. ఊరిలోని ప్రముఖ డాక్టర్లు అనేకులు ఉన్నారు అక్కడ శ్రీధర్‌కున్న లక్షల ఆస్తి తనఏకైక వారసుడు వంశోద్ధారకుడు అయిన దీపక్ దాహాన్ని తీర్చలేక పోయాయి. కనీసం చెంచాడు నీళ్ళు ఆ పిల్లవాడి గొంతులో పోలేక పోయాయి.

అక్సిజన్ ఎక్కిస్తున్నారు దీపక్ ఎడతెరపి లేకుండా రెండు నిముషాలు కూడ ఒకవైపు పడుకో లేకపోతున్నాడు. మంచంమీద ఎగిరెగిరి పడుతున్నాడు కమలను పట్టుకోటానికి శక్యం కావటంలేదు.

లతకు మాత్రం 'తమ్ముడు దాహం, దాహం అని ఏడుస్తూ అంతపెద్దగా అరుస్తుంటే అన్ని నీళ్ళు ఉంచుకొని ఎందుకు త్రాగించరా అని అర్థం కావటంలేదు దీపక్‌లో శక్తి నశించి అగాధంలో నుంచి అంటున్నట్లుగా "దాహం... దాహం.. దాహం' అని పెదాలు కదుల్తున్నాయి కొంచెం సేపటికి అదికూడ ఆగిపోయి దీపక్ శరీరం నిర్జీవంగా అయింది అక్కడే ఉన్న నర్సు తెల్లటి దుప్పటి కప్పింది దీపక్ మొహంమీద. అప్పటికే శ్రీధర్‌ని, కమలని తీసుకెళ్ళి కారులో కూర్చొపెట్టారు

డాక్టర్ విశ్వనాథం మటుకు దీపక్‌కి యిచ్చిన మాట ప్రకారం చివరి వరకు దగ్గరే ఉండి దీపక్ నిర్జీవ శరీరాన్ని వాళ్ళ యింటికి తీసుకెళ్ళటానికి ఏర్పాట్లు చేస్తున్నాడు. హాస్పటల్‌లోఉన్న నాలుగు కుక్కలు మాత్రం యివేవి మాకు పట్టదన్నట్లు క్షణం తీరిక లేనట్లు అటూ, యిటూ హడావుడిగా తిరుగు తున్నాయి. □



లాటరీల రద్దు
మిమ్మల్ని భాగ్యలక్ష్మి త్వరలో వరించబోతోంది....
చాలు చాల్లే వయ్యా!! భాగ్యలక్ష్మిని రద్దు చేసేస్తే ........
ఏమిటోయ్!! లాటరీ రద్దు చేయటం వల్ల నా కన్యాయం జరిగిందా?? ఎలా???
నాకు లాటరీ తగుల్తే నీ అప్పు తీర్చేద్దామనుకున్నాగా మరి-
అదృష్టం పరీక్షించుకోటానికెళ్తున్నారా!! లాటరీలు రద్దు చేసారు కదండీ....
సో - వాట్....
గుర్రప్పందాలలో జాక్ పాటు తగుల్తుందేమో ట్రై చేస్తా-
మార్చి
నిజంగా మీరిచ్చిన మందు అత్యద్భుతం డాక్టరు గారూ.. నిన్నటి నుంచీ మావారు భాగ్యలక్ష్మి అని కలవరించటల్లేదు-




(గత సంచిక తరువాయి)

ఆ కేసు ఎంక్వయిరీకి వచ్చిన ఆఫీసర్లకు బాబూరావే సకల మర్యాదలు చేశాడు

పోలీస్ కుక్కలొచ్చాయి అవి సరాసరి ప్రణీత్ ఇంటి వేపు పరుగెత్తటాన్ని ఆసక్తిగా చూస్తున్నారు ప్రజలు

"ఆ కుక్కల మాటకి తిరుగు లేదు అవి ఎవర్ని పట్టుకుంటే వాళ్లే నేరస్థులు " అనుకుంటున్నారు

అవి తిన్నగా ప్రణీత్ ఇంటి చుట్టూ తిరిగి పెరటి వేపు వెళ్ళి, ఒక చోట గోళ్ళతో త్రవ్వటం మొదలెట్టాయి

జనం విరగబడిపోతున్నారు

కామేశ్వరి బిక్క చచ్చిపోతోంది హైమ అక్కడ ఆమెనంటుకునే ఉంది

అక్కడ తవ్వితే రక్తంతో తడిసిన ప్రణీత్ బట్టలు, కత్తీ దొరికాయి అంతా అతన్ని దోషిలా చూశారు ప్రణీత్ మొహం భావరహితంగా ఉంది అతనిలో ఏ స్పందనా లేదు

వెంకట్రామయ్య మొహం పాలిపోయింది ఎంత గౌరవంగా బ్రతికారు తామీ ఊళ్లో! అదంతా ఒక్క తృటిలో కొట్టుకుపోతోంది ,

"సామాన్యుడికైతే బేడీలు వేసి తీసికెడతారు ప్రణీత్‌కి మాత్రం ఎందు కెయ్యరు? నేరం చేసినప్పుడు ఆ చేసిన వాడు ఎవడైనా సరే వాడిని సామాన్యుడిలాగే చూడాలి అలాగే బేడిలేసి తీసకెళ్లాలి ' అన్నారెవరో

జరిగిన కథ –17 . ప్రణీత్ మీద కక్ష తీర్చుకోవడానికి బాబూరావు, పాపారావు ప్రయత్నిస్తుంటారు పాపారావు సూర్యకళతో ఫోన్ చేయించి ప్రణీత్‌ను ఆమె ఇంటికి రప్పిస్తాడు అక్కడ ప్రణీత్‌కు మత్తుమందు ఇచ్చి సూర్యకళతో పడక మీద ఉండగా ఆ దృశ్యం మంజీర చూసేలా చేస్తాడు అది చూసిన మంజీర కోపంతో తండ్రి దగ్గరికి వెళ్ళిపోతుంది. మత్తు నుంచి మేలుకుని ప్రశ్నించడం మొదలు పెట్టిన ప్రణీత్‌ను సూర్యకళ నలుగురినీ పిలిచి అవమానిస్తుంది మంజీర కోసం స్వయంగా ప్రణీత్ బాబూరావు ఇంటికి వెళ్తాడు మంజీర రానంటుంది సూర్యకళ హత్య చేయబడుతుంది ప్రణీత్ సస్పెండవుతాడు

వెంటనే ఆ మాటకు మిగతా వాళ్ళ మద్దతు లభించింది నినాదాలు ప్రారంభమయ్యాయి .

"ఈ జనానికి ఎంత చేశాడు ప్రణీత్! మానవుడికన్నా విశ్వాస ఘాతకమైన ప్రాణి ఈ సృష్టిలో ఇంకేదీ ఉండదు ఒక మనిషి "మంచి చేశాడు" అంటే "ఔను" అనని వాడు కూడా ఆ మనిషి "చెడు చేశాడు " అనగానే "ఔనౌను వాడిని పట్టుకుని ఉరి తియ్యాల" అనేస్తాడు ఇంకో పది మందితో అదే మాట అనిపించాక గానీ తృప్తి పడడు " బాధగా అనుకుంటున్నాడు వెంకట్రామయ్య

బేడీలు వేసి తీసుకెడుతున్న ప్రణీత్‌ని చూడగానే కామేశ్వరి గుండె బ్రద్దలయింది

"ఇదంతా కుట్ర నా కొడుకలాంటి పని చెయ్యడు వాడెటువంటి వాడో మీకందరికీ తెలీదా? ఇదంతా బాబూరావు చేసిన పని మా కుటుంబం మీద పగబట్టి ఇలా వేధిస్తున్నాడు" అని ఏడుస్తూ అక్కడ గుమి గూడిన వాళ్ళవేపు తిరిగి "మీరు చెప్పండి, మా ప్రణీత్ అలాంటి వాడా?!" అని ఆక్రోశిస్తోంది కామేశ్వరి

"నాన్నగారూ! అమ్మని లోపలికి తీసికెళ్ళండి" అన్నాడు ప్రణీత్ వేన్ ఎక్కబోతూ

వెంకట్రామయ్య కంటి నుంచి ఒక నీటి బొట్టు బుగ్గ మీదికి జారింది

కామేశ్వరి బుజాల చుట్టూ చెయ్యేసి లోపలికి నడిపించుకెళ్లాడాయన..

* * * * *

"చూశావామ్మా మీ ఆయన ఘనకార్యం? సూర్యకళతో తన సంబంధం బయట పడేసరికి మనం ఆరాలు తీస్తామని, ఏకంగా ఆమెని మర్డర్ చేసిపారేశాడు పోలీసు కుక్కలే స్వయంగా అతన్ని పట్టిచ్చాయి నువ్వెలాంటి వాడిని ప్రేమించావో ఇప్పటికయినా అర్థమవుతోందా?" అన్నాడు బాబూరావు.

మంజీర వచ్చినప్పట్నుంచీ సమయం వచ్చినప్పుడల్లా ఇలా ఏదో ఒకటి ప్రణీత్‌కి వ్యతిరేకంగా నూరిపోస్తూనే ఉన్నాడు బాబూరావు...

**తండ్రీ కూతుళ్ళ మధ్య గతంలో ఎన్నడూ లేనంత మైత్రి ఏర్పడింది**

"**ప్రణీత్ ఇలాంటి వాడా! అతను తన మీద చూపించిన ప్రేమానురాగాలు.. పంచి ఇచ్చిన అనుభూతులు. ఇదంతా నటనేనా!**

**అతను తననెంత లాలించేవాడు! ఎన్ని కబుర్లు చెప్పేవాడు! ఎంత పంచన!" మంజీరకు కోపంగా . దుఃఖంగా ఉంది కసిగా ఉంది .**

**తను అతన్నెలా మర్చిపోగలదు?**

**తన మనసులో తిష్ఠ వేసి మరీ ఏడిపిస్తున్నాడు అతన్నొదిలి తనెలా**

ఉండగలదు?

కానీ అతని మొహం చూడాలనిపించటం లేదు ఇంత తెలిశాక తను ఇహ అతన్ని భరించలేదు అది నటన అని తెలిశాక అతనితో ఏమీ జరగనట్టుండటం తనకు సాధ్యం కాదు

ఒక్క రోజు గడిస్తే ఒక్క యుగం గడిచినట్టుందిప్పుడు మంజీరకు.

ప్రణీత్ సరసనుంటే రోజులు సెకన్లలా గడిచిపోయేవి! అవన్నీ తలుచుకుంటే ఏడుపొస్తోందామెకు..

"మంజూ! ఇది విన్నావా? ప్రణీత్ అన్నయ్యని అరెస్ట్ చేశారు!" సుడిగాలిలా దూసుకొచ్చిన హైమ వగరుస్తూ చెప్పింది

ఆ అమ్మాయి కళ్ళ నిండా నీళ్ళు!

మంజీర ముఖం కఠినంగా మారిపోయింది

"నేరం చేసిన వాళ్ళని అరెస్ట్ చెయ్యక ఏం చేస్తారు?" అన్నది హేళనగా

"అంటే? నువ్వు కూడా అన్నయ్యననుమానిస్తున్నావా!?" దిగ్భ్రాంతిగా అన్నది హైమ

"పోలీసు కుక్కలు అబద్ధం చెప్పవు "

"నీ మొహం భగవంతుడి చేత కూడా అబద్ధం చెప్పించగల సత్తా మీ నాన్నకుంది అఫ్కోర్స్! అల్ప ప్రాణులయిన కుక్కలనగా ఎంత?

కత్తి, రక్తం గుడ్డలు పెరట్లో కనపడ్డంత మాత్రాన అతను హంతకుడవుతాడా? ఆ పని మీ నాన్నే చేయించి ఉండొచ్చు.

కుక్కలు సరాసరి వెళ్ళి ప్రణీత్‌ని పట్టుకోలేదు అసలతని జోలికే పోలేదు

ఈ సంగతి ఎవరికీ తెలీక కాదు తెలియనట్టు నటిస్తున్నారంతే "

"రోజు రోజంతా సూర్యకళ గుండెల మీద గడపగలిగిన రసికుడతను అలాంటి నీతి, నిజాయితీలు లేని వ్యక్తికి హత్య చెయ్యటం అనేది ఒక లెక్క కాదు "

"ఛీ! ఇలా అనటానికి నీకు సిగ్గనిపించటం లేదూ? అన్నయ్య ఎలాంటి వాడో నీకు తెలీదూ?"

"నా కళ్ళతో నేను చూశాను "

"ఏమిటి నువ్వు చూసింది?"

"మీ అన్నయ్య నగ్నంగా ఉన్న సూర్యకళ కౌగిలిలో మైమరచి ఉండగా నేను చూశాను "

"అసాధ్యం ఒక్కోసారి మన కళ్ళే మనని మోసం చేస్తాయి.."

"ఔనౌను, ఒక వేళ అతను ఆమెను పొడుస్తుండగా మనం స్వయంగా చూసినా మన కళ్ళే మనని మోసం చేస్తున్నాయిలే అని ఊరుకోవాలి కాబోలు "

"నా దృష్టిలో అలా కాదు ఎవరు చేసినా నేరం నేరమే! నేరస్థుడికి శిక్ష పడి తీరాల్సిందే. ."

"ఇదంతా మీ నాన్న ఆడుతున్న నాటకం "

"ఔను నాటకమే అనుకో! అంటే ఒక వేళ మా నాన్న 'నువ్వెళ్ళి సూర్యకళతో గడుపు" అని చెపితే ప్రణీత్ అలా చేసి వస్తాడా? అలాంటి ఒత్తిడులకు లొంగి నీచంగా ప్రవర్తిస్తాడా? ఇండివిడ్యుయాలిటీ లేని మనుషులంటే నాకసహ్యం!"

"అన్నయ్య అలాంటి వాడు కాదు ఇందులో ఎక్కడో ఏదో మెలిక ఉంది"

"నా మొగుడి నిజాయితీ నాకన్నా ఎక్కువగా నీకే తెలుసల్లే ఉందే!" మంజీర వెటకారానికి హైమ మొహం ఎర్రబడింది

"నువ్వీ స్థితికి దిగజారాక ఇహ నీకు నచ్చ చెప్పటం అనవసరం నీలాంటి మూర్ఖురాలు నా స్నేహితురాలంటే నాకే సిగ్గేస్తోందిప్పుడు.

మీ నాన్నలాంటి వాళ్ళు అధికారంలో ఉంటే ప్రణీత్‌లాంటి వాళ్ళు జైళ్ళలో ఉంటారు పాపారావులాంటి వాళ్ళు ఊరి పెద్దలుగా వ్యవహరిస్తూ ఉంటారు.

కళ్ళారా చూస్తున్నా ఇది నీకర్థం కావటం లేదు. పైగా. చిన్నప్పట్నుంచీ నీకు తెలిసిన... నీ సోదరిలా మసులుతున్న నా మీదనే అసహ్యకరమైన నింద వేస్తున్నావు నువ్వు. ఆ విషయం పూర్తిగా నీ తలకి ఎక్కక ముందే నేను తప్పుకోటం మంచిది ఇప్పుడు ఎవరేం చెప్పినా నీకు వ్యతిరేకంగానే అనిపిస్తుంది. ఓ.కా కొన్నాళ్ళపాటు నేను నీకు కనపడను " అంటూ చర చరా వెళ్ళిపోతోంది హైమ



# ఒడిలో చెలి మోహన రాగం

హైమను వెనక్కి పిలవాలనుంది మంజీరకు.

"నేనలా అనాలనుకోలేదు హైమా! నా మనసేమిటో నాకే తెలీటం లేదు. తిక్క తిక్కగా అనిపిస్తోంది నాకు ప్రణీత్ తరవాత చెప్పుకోదగిన ఆత్మీయురాలివి నువ్వే...

నాకు మిమ్మల్ని తిట్టాలనుంది . మిమ్మల్నే కావలించుకుని ఏడవాలనుంది

నేను మీ ఉనికిని భరించలేకపోతున్నాను

కానీ. మీకు దూరంగా ఉండలేకపోతున్నాను. .

దయ చేసి . నువ్వయినా నన్నర్థం చేసుకో నేస్తం!" ఈ మాటలేవీ మంజీర పెదవి దాటి బయటకు రాలేదు మనసులోనే మెలికలు పడుతున్నాయి.

ఆమె కళ్ళు మూగగా చెమరిస్తున్నాయి

"హైమా! ఇహ రావా అమ్మా!"

తలెత్తి చూసింది హైమ ఎదురుగా తాతగారు!

"తాతయ్యా! మీరూ నమ్ముతున్నారా ప్రణీత్ నేరస్థుడని?" ఆత్రంగా అడిగింది హైమ

"లేదమ్మా! ప్రణీత్ నిజాయితీ నాకు తెలుసు నా కొడుకు ప్రతిభ కూడా నీకన్నా ఎక్కువగా నాకే తెలుసు వాడి అధికార దాహం అలాంటిది తన స్థానానికి ఎసరు పెడుతున్నాడనే అనుమానం వాడికి కన్న తండ్రి మీద కలిగినా సరే . వాడు పగ తీర్చుకోకుండా వదలడు ఏ మార్గంలో నుంచయినా సరే ప్రయత్నించి దారికి అడ్డు తొలగించుకుంటాడు

పాపారావులాంటి హంతకుడిని పెద్ద మనిషిగానూ ప్రణీత్‌లాంటి నిజాయితీ పరుణ్ణి హంతకుడుగానూ నిరూపించగల ప్రజ్ఞ వాడికుంది

ఈ సంగతి అందరికీ తెలుసు అయినా ఎవరూ నోరెత్తరు నా కొడుకు అధికార పీఠం మీద ఉన్నాడు గనక అంతా వాడి వేపే పలుకుతారు వాడి మెప్పు కోసమే ప్రాకులాడతారు చివరికి మంజూ కూడా ప్రణీత్‌కి వ్యతిరేకంగా మారిపోయింది. దానికి కాస్త మొండితనం ఎక్కువ బాబూరావు తిరిగి తన కూతురి మనసు ప్రణీత్ వేపు మొగ్గకుండా వెయ్యి కళ్ళతో కాపలా కాస్తున్నాడు " ఆవేశంగా . బాధగా అన్నారు తాతగారు

"అయితే మనమేం చెయ్యలేమా? ఇలా చేతులు ముడుచుకుని కూర్చోవాల్సిందేనా?

"ఆ రామచంద్రుడు దయ చూపే వరకూ ఇంతే "

"హుఁ! రామచంద్రుడు

తెలివితేటలు ప్రతిఘటించగల శక్తి వివేకం ఉన్న మీలాంటి వాళ్ళంతా ఇలాగే రామచంద్రుడి వెనక దాక్కోండి తాతయ్యా! మీ కొడుకులాంటి వాళ్ళు చేస్తున్న దారుణాలన్నిటినీ రాము దాజ్ఞలుగానూ... ఆయన లీలలుగానూ అభివర్ణించుకోండి...." విరక్తిగా అని వెళ్ళిపోయింది హైమ.

"పబ్లిక్‌లో ప్రణీత్‌కున్న పరపతి తగ్గాలంటే... అతని క్యారెక్టర్ మీద దెబ్బతీసి, ప్రజల సింపతీ కోల్పోయేలా చెయ్యాలి " అనే అస్త్రాన్ని ప్రయోగించి, తిరుగులేని విజయాన్ని సాధించాడు బాబూరావు.

"అంతే! ఎర్రటోపీలోళ్ళు ఏం చేసినా సెల్లుద్ది మానభంగాలు హత్యలు అదే మేం చేస్తే. నడిబజార్లోనూ, ఆ తరువాత లాకప్‌లోనూ పారేసి చావబాది మరీ కొసెదతారు '

'అసలు పోలీసోళ్ళని నమ్మమని చెప్పిందెవరెహె! బాబూరావు దొరమీద ద్వేషంతో మనల్ని పూసుకుతిరిగాడుగానీ మనమీద నిజంగా ప్రేమ ఏడిసిందంటావా ఆయనకి? అంతా నాటకం '

"ఆయన మనకు ఊడబొడిచిందేమిటసలు? గుడి ఆయన సొంత డబ్బుతో కట్టించాడా? బడి ఆయన స్వయంగా కట్టాడా? మన శ్రమ. చందాల డబ్బు గవర్నమెంటిచ్చిన సొమ్ము అన్నీ పోగేసి కట్టించి, తనే అన్నీ చేసినట్టు ఫురానా ఫోజెట్టాడు '

ఈ పోలీసు నాకొడుకుల గురించి రోజూ పేపర్లో ఎన్ని చదువుతున్నామో! ఒంటరిగా చిక్కిన ఆడకూతుళ్ళని చెరచటం, ఆ తరువాత ఆళ్ళని కొప్పెట్టటం పోలీసాళ్ళ కలవాటే "

"అమాంతం బాబూరావుదొర కూతుర్నే లేపుకొచ్చిండు మొనగాడు ఆయన మారాజు గనక ఊరుకున్నాడు భగవంతుడులేడూ? ఆడూరుకుంటాడా!

అప్పటిదాకా ప్రణీత్‌చేత రకరకాలుగా ఉపకారాలు పొందిన వాళ్ళు కూడా పై విధంగానూ . అంతకన్నా ఘోరంగానూ వ్యాఖ్యానాలు చేస్తుంటే దిగ్భ్రాంతుడవుతున్నాడు వెంకట్రామయ్య

ఒక్కో వూళ్ళో ఒక టైంలో ఒకమాట ప్రచారంలోకి వస్తుంది అందులో గల నిజా నిజాలెవరూ పట్టించుకోరు అందరి పెదవులూ ఆ మాటనే ఉచ్చరిస్తాయి చివరకు అక్కడ వీస్తున్న గాలికూడా అదే శబ్దంతో నిండి ఉంటుంది ఆ ధ్వనితో చెవులు ప్రతిధ్వనిస్తూ ఉంటాయి దాన్నుంచి తప్పించుకోటం కష్టం అందుకు సంబంధించిన వ్యక్తులు వీధి మొహం చూడకుండా ఇంట్లో దాక్కున్నా కూడా ఆ ధ్వని వెంటాడుతూనే ఉంటుంది

ఒక మనిషి మీద వ్యతిరేకత అంటూ ఏర్పడితే అది అంటు వ్యాధిలా ఊరంతా వ్యాపిస్తుంది

అంత పరకూ ఎంతో గౌరవ మర్యాద లందుకున్న వెంకట్రామయ్య కుటుంబం ఇప్పుడిలాంటి పరిస్థితినే ఎదుర్కొంటోంది

ఆ మహాతల్లి ఏమంటూ కాలు పెట్టిందో అప్పట్నుంచీ గొడవలే చివరకు నా బిడ్డ కూడా నాకు దూర మయ్యాడు ఆ రాక్షసి కుటుంబంతో వియ్యమంది చేతులారా నాశనాన్ని కొనితెచ్చుకున్నాం " అని వాపోతోంది కామేశ్వరి

ప్రణీత్ అంటే రాంబాబుతో పాటు, మిగిలిన కానిస్టేబుల్స్‌కు కూడా చాలా ఇష్టం వాళ్ళతో పైఅధికారిలా కాకుండా ఫ్రెండ్లీగా మెలిగే వాడతను

'ఆ గూడెం లంజా కొడుకుల కోసం ఎంత చేశారు మన ఎస్ ఐ గారు!

నాగులు గాడి బారి నుంచి వాళ్ళని కాపాడి, వాడి పొగరణిచారు చాలా వరకూ దొంగతనాల్ని అరికట్టారు

బీదా గొప్పా తేడా లేకుండా అందర్నీ సమానంగా చూశారు అందరికీ ఒకే రకమైన న్యాయం చెయ్యాలని తహతహలాడేరు

ఆయన చేత ఉపకారం పొందిన వాళ్ళుకూడా ఈ రోజాయన్నూ, మన డిపార్ట్ మెంటునూ కలిపి తూర్పార బడుతున్నారు వీళ్ళ నసలు . చెప్పు కింద తేలులా అణిచి ఉంచాలే తప్ప . . పైకి లేవనియ్య కూడదు ' కసిగా అన్నాడు రాంబాబు

"మన ఎస్ ఐ గారు లేకుంటే స్టేషన్ బావురు మంటున్నట్టుంది మన డిపార్ట్ మెంటులో వాళ్ళకే ఆయన్ను చూస్తే కడుపు మంట. అందుకే .. బాబూరావు విజయం సాదించగలిగాడు జనం మనని తిట్టారంటే తిట్టరూ? మన వాళ్ళే మన వెనక గోతులు తవ్వుతుంటిరి.

ఇంతకీ .. మన ఎస్ ఐ గారికి శిక్ష పడుతుందంటారా!?" దిగులుగా అన్నాడు





# కన్న కలలు ఫలించాయి.

పైలట్! పైలట్ కావలనే మావాడు ఎప్పుడూ కలకనేవాడు. చిన్నతనంలో ఎప్పుడు మాట్లాడినా సరే దాని గురించే చెబుతూ ఉండేవాడు. మంచి బలంగా, ఆరోగ్యంగా, దారుఢ్యంగా పెరిగి పెద్దయ్యేందుకు రోజుకి రెండుసార్లు హార్లిక్స్ తాగమని వాడికి చెప్పేదాన్ని, నాకు జ్ఞాపకం ఉంది.

ఇప్పుడు అవన్నీ నిజం అయ్యాయి. రోజుకి రెండుసార్లు హార్లిక్స్ తాగడం వాడికి అలవాటు చేశాం. నాకు ఎంతో సంతోషంగా ఉంది. ఇన్నేళ్ళు కూడా అదే వాడిని ఆదుకుంది!



పెరిగే పిల్లలకు చాలా మంచిది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం. పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




మంచి పుష్టికరమైనది

HMM-9240 TEL

## రచయిత్రి జవాబులు



**ఎమ్. నర్సిములు, బొంబాయి**

ప్ర మేము మీ నవలలన్నీ చదివాము "ఒడిలో చెలి మోహనరాగం" కూడా అద్భుతంగా రాస్తున్నారు . రాసి, మీకు పంపమంటారా?

జ పత్రిక ఎడిటర్ గార్కి పంపండి నచ్చితే వేసుకుంటారు

**ఎల్. శశిధర్, తెనాలి**

ప్రః మీ శైలి సుపర్బ్‌గా ఉంది చక్కని కొటేషన్స్ వాడారు. మీకీ ఐడియా ఎలా వచ్చింది?

జః చలం మ్యూజింగ్స్.:. విశ్వనాథవారి వేయి పడగలు... ఇలాగే మరికొన్ని చదువుతుంటే వచ్చింది.

**కొవ్వలమూడి చిట్టిబాబు, చిట్యాల**

ప్రః..... ....వీరిపై మీ అభిప్రాయమేమిటి?

జ. రచనల మీదే తప్ప, అవి రాసిన వ్యక్తుల మీద అభిప్రాయా లేర్పరుచుకునే అలవాటు నాకు లేదు.

**పి. విమలాదేవి, ఉయ్యూరు**

ప్ర : సావిత్రిగారూ! అర్ధరాత్రి ఆడది ఒంటరిగా తిరగటం దేనికి? అని ఈ సీరియల్‌లో ఒక పాత్ర ద్వారా చెప్పించారు. అలాతిరిగే పరిస్థితులు లేవంటారా?

జ : ముందు ఆ "తిరిగే" అనే పదాన్ని ఉపసంహరించుకోండి. మరోసారి చదివి అందులో గల భావాన్ని అర్థం చేసుకోటానికి ప్రయత్నించండి.

**ఎమ్. రామారావు, హైదరాబాదు**

ప్ర : మీరు ప్రధాన మంత్రి అయితే ఏం చేస్తారు?

జ : 'చెత్త ప్రశ్నలు' అనే ఓ కొత్త శాఖను క్రియేట్' చేసి, దానికి మిమ్మల్ని మంత్రిగా నియమిస్తాను.

**ఐరేని శ్రీనివాస్‌గౌడ్, రామాయంపేట**

ప్రః ఇప్పుడొస్తున్న సాహిత్యం మాకు విసుగెత్తిస్తోంది. మీ రచయిత్రు(త)లంతా కూడ బలుక్కున్నట్లు ఒకే టైప్ నవలలు రాయటానికి కారణమేమిటి?

జః మీలాంటి పాఠకులంతా కూడబలుక్కున్నట్లు ఒకే 'టైప్' నవలలను ఆదరించటాని కలవాటు పడటం

**ఎన్. అచ్యుతవల్లి, సికింద్రాబాద్**

ప్ర : బాబూరావు ప్రతిజ్ఞ వింటుంటే భయమేస్తోంది. అతను అన్నంతపనీ చేసి తీరతాడు. ఎందుకయినా మంచిది.... ప్రణీత్‌ని కాస్త జాగ్రత్తగా ఉండమని చెప్పరూ?

జ : ప్రణీత్ పిరికి వాడు కాదులెండి.

**కె. శ్రీనివాస్, అమ్మపాలెం**

ప్ర : ఆధునిక తెలుగు సాహిత్యం పై ఆంగ్ల సాహిత్య ప్రభావం ఎక్కువగా ఉంటోంది. దీనిమీద మీ అభిప్రాయం ఏమిటి?

జ : ఏ సాహిత్య ప్రభావమైనా పాఠకుల ఆదరణను బట్టే ఉంటుంది.

**పి. శశికళాదేవి, విశాఖపట్నం**

**డి. అనుపమ, నాగార్జునసాగర్**

ప్ర : ఆంధ్ర సచిత్రవారపత్రికలో మొట్టమొదటి సారిగా "పాఠకులతో ముఖాముఖీ" మీతోనే ప్రారంభించారు. దీనికి మీరెలా ఫీలౌతున్నారు?

జ : చాలా 'హ్యాపీ'గా.

**కాట్రగడ్డ వెంకట్రావు, కంకిపాడు**

ప్ర : వరకట్న సమస్యకు మగవాడే కారకుడని అందరూ ఘోషిస్తారు. కానీ.... కన్యాగా కట్నం ఇవ్వగూడదని ఘోషించిన స్త్రీయే తల్లిగా కట్నాన్ని ఆశిస్తుంది... కామెంట్ ప్లీజ్?

జ : మనదేశంలో మగాడు స్త్రీ కన్నా స్వతంత్రుడు. అందుచేత అలాంటి తల్లి మాటకు విలువ నివ్వకుండా స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకుని ఖచ్చితంగా అమలు జరపాలి

**కె. వి. ఎస్. రామారెడ్డి, పిట్టల వేమవరం**

ప్ర : నూతన సంవత్సర శుభాకాంక్షలందిస్తూ... . మీ నుంచి మరోగొప్ప సీరియల్ రావాలని ఆశిస్తున్నాం.. ..

జ : మీ అభిమానానికి కృతజ్ఞతలు.

## ఒడిలో చెలి మోహన రాగం

వన్ నాట్ వన్

'రాజకుమార్ గారు ప్రయత్నిస్తున్నారు అయినా. చెప్పలేం అవతలి ప్రత్యర్థి మినిస్టర్ గదా '

స్టేషన్‌లో అంతా ప్రణీత్ గురించే మాట్లాడుకుంటున్నారు అతని విడుదల కోసం తహ తహ లాడుతున్నారు.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రాజకుమార్ ఎన్నో ప్రయత్నాలు చేశాడు

అయినా న్యాయ దేవత కళ్ళు తెరవటాని కిష్టపడలేదు

బాబూరావు తనను నడి బజార్లో నిలబెట్టి కొంటుంటే ఇంకా గట్టిగా కళ్ళు మూసుకుంది .

ప్రణీత్ మీద నేరం రుజువయి అతనికి యావజ్జీవ కారాగార శిక్ష పడింది.

వెంకట్రామయ్య ఇల్లు స్మశాన వాటికలా ఉంది

తువ్వాలు మొహానికి అడ్డం వేసుకుని. దొడ్లో తులసి కోట అరుగు మీద కూర్చుని కుళ్ళి కుళ్ళి ఏడిచాడు వెంకట్రామయ్య కామేశ్వరి జబ్బు చేసిన మనిషిలా తయారయింది

'పెళ్ళాన్ని సజీవ దహనం చేసిన పాపారావును నిర్దోషి అన్నది న్యాయస్థానం

ఏ పాపమూ ఎరుగని ప్రణీత్‌కి జీవితానికి సరిపడే శిక్ష విధించింది

ఇహ నేరస్థులకు భయం వెరుపు అనేవి ఎలా ఉంటాయి? నడిబజార్లో మర్డర్ చేసినా.... ఆడదాన్ని చెరిచినా ..... డెకాయిటీ జరిగినా.... ఇవన్నీ చేసిన వాడు నేరస్థుడు కాదని స్వయంగా చెపుతోంది న్యాయస్థానం.

ఇలా మారి పోయిన ఈ వ్యవస్థలో అన్నయ్య లాంటి వాళ్ళు నిజాయితీగా వ్యవహరించి కష్టాలను చేతులారా ఆహ్వానించటం కన్నా ఆ అవినీతినే ప్రోత్సహించి. వాళ్ళ తోనే చేతులు కలపటం ఉత్తమం కదూ? ఆక్రోశంగా అంటోంది హైమ భర్తతో

'సుప్రీం కోర్టుకు అప్పీలు చేద్దాం ప్రణీత్ ఎంత ఖర్చయినా నేను భరిస్తాను ఆ బాధ్యతంతా నేను తీసుకుంటాను నువ్వు నిశ్చింతగా ఉండు

ఒక చోట కాకపోతే ఒక చోటయినా న్యాయానికి గెలుపు లభించి తీరుతుంది

అక్కడ బాబూరావు ఆటలు సాగవు "అన్నాడు రాజ కుమార్ కృతజ్ఞతగా అతని మోచేతిని స్పృశిస్తూ" థాంక్స్ కుమార్'

అమ్మా నాన్న గార్లను కాస్త కనిపెట్టి ఉండి ధైర్యం చెప్పు సాధ్యమైనంత వరకూ వాళ్ళని ఒంటరిగా వదలొద్దని హైమకూ, రాజారావుకూ నా మాటగాచెప్పు వాళ్ళను నాకోసం బెంగపెట్టుకో వద్దను అన్నాడు ప్రణీత్

రాజకుమార్ తన ప్రయత్నాలు ప్రారంభించాడు

ప్రణీత్ మనసు వికలంగా ఉంది జైలు శిక్ష అనుభవిస్తున్నందుకు కాదు తను నేరస్థుడు కాదు. ఎప్పటికైనా ఈ విషయం బయట పడి తీరుతుంది

అదికాదు అతనాలోచించేది

మంజీర! ఏం చేస్తోంది తను? ఒక్క సారి కూడా చూడటానికి రాలేదు

ఆమె కూడా తనను నేరస్థుడిగా భావిస్తోందా?

'మంజూ' నువ్వింత కఠినంగా ఎలా ఉండ గలుగు తున్నావు! నిన్ను చూడకుండా నీ మాటలు వినకుండా నెలల తరబడి ఇలా దూరంగా ఉండటం

**కారంచేడు బుచ్చిపార్థసారధి, పెనుగొండ**

ప్ర : సావిత్రిగారూ! వాస్తవికతకు దగ్గరగా ఉన్న ఏ రచనా జనాదరణ పొందదు. అవాస్తవికంగా ఉన్న రచనలే జనాదరణను పొందుతుంటాయి. కాదంటారా?

జ : మీరంత గట్టిగా చెపుతుంటే నేనెందుకంటాను?

**రావు స్వప్నసుందరి, అశ్వారావుపేట**

ప్ర ఒడిలో చెలిమోహనరాగంలో కుళ్ళు రాజకీయ వ్యవస్థ గురించి చాలా బాగా రాశారు బాబూరావు, పాపారావు లాంటి వాళ్ళు నిజజీవితంలో కూడా ఉన్నారని నేనంటాను మీరేమంటారు?

జ 'సామాజిక స్పృహ అంటే ఇదే

**వై. శశిరేఖ, బొబ్బర్లంక**

ప్ర పిట్టగోడమీద పుంజు గ్రుడ్డు పెట్టింది అది అటువేపు పడుతుందా ఇటువేపు పడుతుందా?

జ బొబ్బర్లంకలో వై శశిరేఖ ఇల్లు ఎటు వేపుంటే అటువేపు పడుతుంది

**బి. విజయలక్ష్మి, కనిగిరి; కె. పద్మమ్మ, కొల్హాపూర్; కె. ఆంజనేయకుమార్, బోగాపురం.**

ప్ర ఈ కలికాలంలో మీ రచనలు డబ్బుకోసమా, పేరు కోసమా, సమాజాభివృద్ధి కోసమా? ప్రేరణ కలిగినప్పుడు మాత్రమే రాసే రచయిత ఉత్తమ రచయిత అని నా ఉద్దేశ్యం మీరేం చదివారో చెప్పరూ!?

జ డబ్బూ, పేరుతో కలిసిన సమాజాభివృద్ధి కోసం (కలికాలంగదా మరి)
మీ ఉద్దేశ్యం సరయినదే
ఎమ్ ఎ చదివాను

## ఉత్తమ ప్రశ్న

**వై. లక్ష్మణ్, నందిగామ**

ప్ర నేను చాలా నవలలు చదివాను కొన్నిటిలో అనవసరమైన వాక్యాలు "అతను కాఫీ తాగి కప్పు కింద పెడుతుండగా చెయిజారి బద్దలయింది ' 'ఆమె కాటుక కళ్ళకు పెట్టుకుంది. ఇలాంటివి నవల సైజు పెంచటానికే తప్ప ఎందుకూ పనికి రావని నే ననుకుంటున్నాను మీ అభిప్రాయం చెపుతారుగదూ?!

జ మీ అభిప్రాయం కొంత వరకే సరయినది మరీ 'మేటరాఫ్ ఫాక్ట్'గా ఉంటే కూడా మెకానికల్‌గా అనిపిస్తుంది కానీ రైటర్ అనవసరమైన వర్ణనలతో జాప్యం చేస్తూ సాగదీస్తే మాత్రం అది తప్పకుండా నవలసైజును పెంచటానికేపనికొస్తుంది

**వృద్ధుల వెంకట సత్యనారాయణ, పార్వతీపురం**

ప్ర సావిత్రిగారూ! హైమ, మంజీర టెంత్‌క్లాస్ పాసయ్యారని చెప్పారు కానీ ఆ వూరికి హైస్కూలు 'రాజకుమార్' హయాంలో వచ్చిందని రాశారు ఇదెలా సాధ్యం?

జ హైమ, మంజీరలకు వాళ్ళ పెద్దలు ఘోషా పద్ధతిని విధించలేదు కాకపోతే వేరే ఊళ్ళల్లో ఉంచి కాలేజీ చదువులు చదివించలేదు ఇందుకు కారణాలు ఏవైనా కావచ్చు వాళ్ళు పైడిపల్లికు కొంతదూరంలో ఉన్న హైస్కూలుకు రోజూ వెళ్ళి చదువుకున్నారు కథకు ముఖ్యంకాని ఇలాంటి చిన్న చిన్న పాయింట్స్‌ని వివరించకుండా వదిలెయ్యటం జరిగింది పోతే రాజకుమార్ హయాంలో ఆ హైస్కూలు పైడిపల్లిలో నే వెలిసింది

**ఎమ్. సాయికిషోర్ చౌదరి, తెనాలి**

ప్ర "ఒడిలో చెలిమోహన రాగం' టైటిల్ చూసి రొమాంటిక్ నవల అనుకున్నాను ప్రస్తుత రాజకీయాల మీద ఈ నవల ద్వారా ఇంత అద్భుతమైన దండయాత్రను నిర్వహిస్తా రనుకోలేదు 'నిజంగా సూపర్బ్'! ప్రణీత్, మంజీరల ప్రణయాన్ని కూడా చాలా సున్నితంగా వివరిస్తున్నారు ఒడిలో చెలి మోహన రాగం" ఎప్పుడు పాడిస్తారు?

జ ఆగండి అంత తొందరయితే ఎలా మరి?!

**ఆర్. దమయంతి, నాగార్జునసాగర్**

ప్ర ప్రణీత్, గూడెపు స్త్రీని మోటార్‌బైక్ వెనకాల ఎక్కించుకుని వెళ్ళాడని రాశారు ఏ పోలీసాఫీసరైనా అలా చేస్తాడా? వాళ్ళలో అంత మంచితనముంటుందా?

జ మంచీ- చెడూ అనేది అన్ని డిపార్ట్‌మెంట్లలోనూ ఉంటాయి అయితే 'చెడు', ప్రచారం పొందినట్లుగా 'మంచి' ప్రచారం పొందదు అలా అణిగి ఉంటుందంతే

**సి. రాకేష్‌శర్మ, విజయవాడ**

ప్ర 'ఒడిలో చెలి మోహనరాగం చక్కని రాజకీయ సెటైర్! శైలి అద్భుతంగా పత్రిక స్థాయికి తగినట్లుగా ఉంది ఇంత 'మంచి నవలకు 'ఇన్‌స్పిరేషన్' ఏమిటి?

జ మీ లాంటి పాఠకుల అభిమానం

**ఎల్. రాజామణి, బందరు**

ప్ర అక్కా! ఈ సీరియల్‌కు ముగింపు సుఖాంతమా దుఃఖాంతమా?

జ ఎలా ఉంటే బావుంటుందంటారు? ☐

---

నా కెంత వేదనను కలిగిస్తుందో నీకు తెలీదా?'

కళ్ళు తడవకుండా బాధను నొక్కి పడుతుంటాడు ప్రణీత్

రాజకుమార్, రాజారావుల పట్టుదల అలాంటి మరి కొందరు శ్రేయోభిలాషుల అండ ప్రణీత్ తరఫున నియమింప బడ్డ లాయర్ల ప్రతిభకు తోడు బాబూరావు చర్యలకు సుప్రీం కోర్టులో రెస్పాన్స్ లేక పోవటంతో న్యాయం న్యాయంగా నిలబడి, ప్రణీత్ నిర్దోషిగా ఋజువయి, అతను విడుదలయ్యాడు

అతన్ని రిసీవ్ చేసుకోటానికి రాజకుమార్, రాజారావు, రాంబాబు వగైరా ఆఫీస్ స్టాఫ్, హైమ, కామేశ్వరీ, వెంకట్రామయ్య వచ్చారు

అందరి మొహాలూ పట్టరాని ఆనందంతో వెలిగి పోతున్నాయి ప్రణీత్ కళ్ళు ఆత్రంగా వాళ్ళందరి మధ్యనా గాలించి తన ప్రాణాధికురాలైన వ్యక్తి కనపడక పోవటంతో నిరాశగా వాలిపోయాయి భరించ లేనంత వేదన నిరాశ అతన్ని కమ్ముకున్నాయి.

మంజూ కనీసం ఇప్పుడు కూడా రాలేదు! తన రాక ఆమెకు సంతోషాన్ని కలిగించటం లేదా?

తన వాళ్ళకోసం . . లేని సంతోషాన్ని నటిస్తున్నాడతను పైడిపల్లి చేరిన ప్రణీత్‌ని చూసి

"మాకెప్పుడో తెలుసు! లేకుంటే .. ఈ బాబేంటి నేరం చెయ్యటమేంటి ఇదంతా బాబూరావు కుట్ర "

"ఆయనెంత మంచోడు! ఎప్పుడో విడిపోయిన గూడేన్ని తిరిగి కలిపి, గ్రామ కక్షల్ని అరికట్టాడు .

మనకు బడీ . గుడీ... మంచినీళ్ళు... ఇవన్నీ ఎస్ ఐ బాబు చలవ వల్లే వచ్చాయి ఆ బాబెళ్ళి పోయాక ఊరికి పీడ చుట్టుకున్నట్టయింది ఈ కొత్తగా వచ్చిన ఎస్ ఐ ఉత్తకర్కోటకుడు మాట్లాడితే మక్కెలిరగ బొడుస్తడు ఎప్పుడూ ఆ బాబూరావు మనుషులతో గుసగుసలాడి పోతూ ఉంటాడు . "

ఈయన లేక పోవటంతో నాగులు గాడి ఆగడాలు మరీ మితిమీరి పోయాయి ఆడకూతుళ్ళు బజార్లో తిరగటానికే భయపడుతున్నారు ."

సూర్యకళను చంపింది నాగులేనట "

అంటూ వ్యాఖ్యానిస్తున్న జనాన్ని చూస్తుంటే రగిలి పోయింది రాంబాబుకు

"ఈ ముండా కొడుకులంతా ఇప్పుడిలా ప్లేటు ఫిరాయిస్తున్నారు సార్ ఆ రోజు, మిమ్మల్ని బేడిలేసి తీసి కెళ్ళిన రోజు వీళ్ళే ఎన్ని కారు కూతలు కూశారని!

ఇందులో ఒక్కడంటే ఒక్కడు కూడా మీ వేపు పలికి, మీ సరసన నిలవ లేక పోయారు

ఇది ఊరు కాదు సార్! వల్ల కాడు పెట్టిన చేతినే కాటేసే కృతఘ్నులు వీళ్ళు . " ఆవేశంగా అన్నాడు రాంబాబు.

"పోన్లే రాంబాబూ! మనం ఇలాంటివి పట్టించు కోటం మానెయ్యాలి ఈ ఊర్లో మంచి వాళ్ళెందుకు లేరు?

మీరు రాజకుమార్, రాజారావు, హైమ . మీరంతా ఈ వూరివాళ్ళే గదా ! మీరు నాకోసం ఎంత చేశారు!

అందరూ ఇలాగే ఉండాలనుకోటం దురాశ.' అన్నాడు ప్రణీత్

ప్రణీత్‌లో మునుపటి ఉత్సాహం లేక పోవటం . అతని మొహంలో నీలి నీడల్ని చూస్తుంటే బాధ . మంజీర మూర్ఖత్వాన్ని తలుచు కుంటుంటే కోపం ఒకేసారి కలుగుతున్నాయి హైమకి

(ఇంకావుంది)

పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## "పెద్దలే కారకులు"

"అమ్మోయ్... బాబోయ్.... అబ్బా చచ్చిపోతున్నానే.... కొట్టొద్దు పిన్నీ... చంపొద్దు పిన్నీ...." పిచ్చిగా అరుస్తూ తుళ్ళి తుళ్ళి పడుతోంది పదేళ్ల నీలిమ. ఆ పిల్ల కేకలకి మాకూ ఏడుపొస్తోంది. పచ్చటి ఒంటిపై ఎఱ్ఱగా తెట్టు తేలిపోయిన వాతలను చూస్తుంటే కడుపు తరుక్కుపోసాగింది. "పెద్దవాళ్ళే అంతంత దెబ్బలను ఓర్చుకోలేరు.... ఈ పసిపిల్లెలా తట్టుకోగలిగిందా?" అనుకొన్నాం బాధగా. "ఆంటీ పిన్ని నన్ను చంపుతుందట.. ఆపేయరూ..." ఏడుస్తూ మా అమ్మను చుట్టుకుపోయింది నీలిమ. "లేదమ్మా... మీ పిన్ని నిన్ను చంపదు... ఆమెగాని ఇక్కడికి వచ్చిందంటే కాళ్ళువిరిచి పొయ్యిలో పెట్టమూ? హాయిగా నిద్రపో... ఆమె రాదులే." అని అమ్మ ఎంత సముదాయించినా ఆ పాప ఏడుపు ఆగడంలేదు. ఆ పాపనామె పిన్నిపెట్టిన బాధలు సామాన్యమైనవి కావుమరి! అందుకే అలా భయంతో గజగజలాడిపోతోంది. తలకి పెద్ద దెబ్బతగిలి, రక్తం వరదలైపోతుంటే మేమంతాకల్సి వాళ్ల పిన్నిని బాగాతిట్టి, హాస్పిటల్‌కి తీసుకువెళ్లాం. రక్తం కావాలన్నారు. ఆ రక్తం దొరకలేదు. లకీగా మా ఎదురింటాయన రక్తం సరిపోవడంతో... ఆ రక్తం ఎక్కించి నీలిమను బ్రతికించారు డాక్టర్లు. ఆ రాత్రి మా కెవ్వరికీ నిద్రల్లేవు. పచ్చగా బొద్దుగా చెంపకు చారెడుకళ్ళతో బొండుమల్లెలా ఉండే నీలిమను బ్రతికించుదేవుడా... తల్లిని కోల్పోయి, పిన తల్లిదగ్గర పడరాని బాధలూ పడుతున్న ఆ చిన్నారిని తీసుకుపోకు.... అని ప్రార్థించనివాళ్ళులేరు.

"ఆ పాపకి శరీరంపై తగిలిన దెబ్బలను మాన్పగలనేమోగానీ.... మనసుకి తగిన దెబ్బను నేను మాన్పలేను. అందుకు ఒకటేమందు.... ఆ పాపను వాళ్ల పిన్నిదగ్గరకు పంపకండి. ఆమె మళ్లా తన హింసను ప్రారంభించవచ్చు. ఒకవేళ ఆమె మనసు మార్చుకొని మంచిగా ప్రవర్తించినా లాభంలేదు. ఆమెలోని దుర్మార్గానికే అలవాటుపడ్డ పాప ఇక ఆ నీడను కూడా తట్టుకోలేదు. శాశ్వతంగా పిచ్చిదైపోతుంది. కాబట్టి వాళ్ల బంధువులదగ్గరికి పంపేయండి...." అని డాక్టర్ చెబుతుంటే మేమందరం అప్రతిభులై పోయాం.

"ఇంతకీ పాప తండ్రి ఏడీ?" అని ప్రశ్నించాడాయన. "వాళ్ల నాన్నకి కూడా నీలిమపై ప్రేమలేదు డాక్టరుగారూ! టెలిగ్రాం ఇచ్చాం... అందేవుంటుంది. అయినా ఆ మహానుభావుడు రాడు. వాళ్ళిద్దరూ రాక్షసులు డాక్టర్‌గారూ...." అన్నాడు మా ఎదురింటాయన.



"పాపిటీ.... ఇంత చిన్న వయస్సులో ఇంతటి నిరాదరణకి గురైన ఈ పాప భవిష్యత్తు ఎలావుంటుందో..." అని జాలిపడ్డారాయన. నీలిమ తండ్రి వెంకటనర్సయ్యకి పెద్ద ఫాన్సీషాపుంది. అతగాడి మొదటిభార్య వసంత కూతురే నీలిమ. వసంత చాలా అందంగా ఉండేదట. వాళ్ళు పేదవాళ్ళు. కట్నాలు ఇచ్చుకోలేక బాగా వయసు పైబడ్డ వెంకటనర్సయ్యకిచ్చి చేశారుట. అతగాడుత్త అనుమానం మనిషి.... ఆమెను వేధించేవాడట. నీలిమ పుట్టడంతో వేధింపు ఇంకా పెరిగిపోయిందట. అందంగా మెరిసిపోతున్న నీలిమను ముద్దాడేబదులు "నేను నల్లగా తుమ్మమొద్దులా ఉంటే ఇది ఇంత చక్కగా ఎలా ఉందే?" అని బాదేవాడట. అది భరించలేక ఆత్మహత్య చేసుకొందని కొందరంటే, అతడే చంపేశాడని కొందరంటారు. అతగాడి రెండో భార్య రత్నమ్మ నీలిమను రాచి రంపానపెట్టడం మేం కళ్లారా చూసేవాళ్లం. పైగా ఆమె పిల్లలూ తారుడబ్బాల్లా ఉండటంతో నీలిమంటే చెప్పలేని ఈర్ష్యతో మండిపోయేది. పదిమందీ గడ్డిపెడతారని విధిలేక నీలిమను స్కూల్‌కి పంపించేవాడు వెంకటనర్సయ్య.

ఒకసారి క్లాస ఫస్టొచ్చిందని చిన్న మెడలిచ్చారు కాన్వెంట్‌వాళ్ళు. దాన్ని ఇవ్వమంది వాళ్లపిన్ని. ఇవ్వనని మంకుపట్టుపట్టింది నీలిమ. కాలేకట్టితో చేతిపై వాతపెట్టేసిందా రాక్షసి. ఇదేమిటని అడిగినందుకు మమ్మల్నందర్నీ చివాట్లేసి తలుపులు వేసేసింది. ఆమె రాక్షసత్వాన్ని వెంకటనర్సయ్య ఆపకపోగా... కొడుతుంటే "కొట్టవే కొట్టు చచ్చేదాకా కొట్టు... పీడా వదుల్తుంది. ఇంటికి శనిలా పట్టింది." అనేవాడు. ప్రేమాదరణలకేకాదు కనీసం మంచి తిండిక్కూడా నోచుకోలేదా నిర్భాగ్యురాలు "నేను పీడనా అక్కా? నేనేం పాపం చేశానని అలా అంటారు?" అని ఆ పాప దీనంగా ప్రశ్నిస్తుంటే "ఇలాంటి పాపాత్ముల ఇంట పుట్టడమే నువ్ చేసిన పాపమమ్మా" అనుకొనేదాన్ని.

నీలిమను పదిరోజులపాటు వాళ్ళింట్లోనే ఉంచేసుకొన్నారు ఎదురింటాయనా... ఆయన భార్యా! వెంకటనర్సయ్య పెద్ద రాద్ధాంతం చేశాడు. "మా పిల్లను మేం కొట్టుకొంటాం మీరంతా ఉద్ధరించేదేమిటి" అంటూ



గంతులేశాడు. తండ్రిని చూసి బెదిరిపోయి ఏడవసాగింది నీలిమ "పాపమీద చెయ్యిపడ్డదంటే పోలీస్ రిపోర్టిస్తాం జాగ్రత్త" అనడంతో కాస్త తగ్గాడా మహానుభావుడు. నీలిమకు కాస్త స్వస్థత చేకూరాక "ఓ రోజు మీ పిన్ని నిన్నెందుకొట్టిందమ్మా?" అని అడగ్గానే ఆ పదేళ్ల పాప చెప్పిన సమాధానానికి హతాశులయ్యాం!

"మా పిన్ని గదిలో మా నాన్నగారుకాక మరింకెవరో వున్నారు. నాన్నారికి చెప్పేస్తానని అనంగానే పిన్ని చెప్పొద్దంది. నాకెందుకో చెప్పాలనిపించింది. అసలెక్కడయినా అలా చేస్తారా? అందుకే చెప్తానన్నాను. అందుకే కొట్టింది. చెప్పు ఆంటీ అది తప్పుకాదూ?" అమ్మ నాపిల్ల అలా ప్రశ్నించడంతో ఏం చెప్పాలో తోచక నాన్నగారివైపు చూసింది. అంత చిన్నపిల్లలో అలాంటి సందేహం ఉదయించడం ఎంత దురదృష్టకరం? పెద్దల దుష్ప్రవర్తన పిల్లల

హృదయాలపై ఎంతటి ప్రభావాన్ని చూపుతుందో కదా' తమ తప్పులను దాచుకోవడం కోసం పసిపిల్లలను బలిచేయాలనుకోడం అమానుషం పెద్దవారిలోని ఇటువంటి నీతిబాహ్య ప్రవర్తన బాగా జీర్ణించుకుపోయిన పిల్లల్లో కొందరు పెద్దల్లాగే నీతిబాహ్యులుగా ప్రవర్తిస్తే, కొందరు సమాజంలోని అందరూ ఇలాంటివారే ననుకొని సమాజాన్ని ద్వేషించడం మొదలుపెడతారు మరికొందరు తమలో తామే కుమిలిపోతూ ఒక విధమయిన పిచ్చిలో పడిపోతారు మొత్తానికి పెద్దల ప్రవర్తన పసిపిల్లల్లో జీవితాన్ని తీర్చిదిద్దేదిగా ఉండాలేతప్ప వారిని సమాజానికి చీడపురుగుల్లా మార్చేదిగా ఉండకూడదు అందుకే పెద్దవారు వీలయినంత సక్రమమైన బాటలో నడిచి పిల్లల్ని అదేదారిలో నడిపించాలి ఇక స్వంతబిడ్డ కాకపోయినంత మాత్రాన హింసించాలన్న పెద్దల (కొందరు) ధోరణిని ఈ రచనలు మార్చలేవు వారి మనస్తత్వాలలో నే మార్పురావాలి అది సాధ్యమేనా? అంతులేని ఈ సమస్యకి పరిష్కారమేది?

కేవలం అందంగా ఉన్నంత మాత్రాన ఆ పిల్ల తన కూతురు కాదేమోనని అనుమానించి, ముక్కుపచ్చలారని ఆ ముద్దుబిడ్డ ఆలనాపాలనా పట్టించుకోకుండా, ఆ పాపను ద్వేషించే కసాయి తండ్రుల మనసునెలా మార్చగలరు? ఆ కఱుకుగుండెల్లో ప్రేమామృతం ఊరడం అబద్ధం 'తలిదండ్రులెవరో తెలీక, అనాధులుగా గడిపే అభాగ్యుల జీవితాలను సంస్కరించడమెలా? వారి బ్రతుకులలో అర్థాన్ని కల్పించడమెలా?" అని ఆలోచించవచ్చు. ఆ సమస్యకి ఎలాగో పరిష్కారం వెతకవచ్చు తలితండ్రుల ఆధ్వర్యంలో నే ఉంటూ, అనురాగానికీ ఆత్మీయతకీ నోచుకోక నీలిమలా గుప్పెట్లో ప్రాణాలు పెట్టుకొని బ్రతికే పసి పిల్లలను ఎలా ఉద్ధరించాలి? వారిలో నిరాశానిస్పృహలు పెరిగి, బ్రతుకుపై విరక్తి పెరిగిపోకుండా ఎలా ఆపాలి? కొందరు పసి పిల్లలు ఆత్మహత్య చేసుకోబోయిన ఉదంతాలు వింటుంటే అభంశుభం తెలీని ఆ వయసులో నే చనిపోవాలన్న నిర్ణయానికి వారు రావడం వెనుక వారి పెద్దల నిరాదరణో, నీతిబాహ్య ప్రవర్తనో కారణాలుగా కనిపిస్తాయి మా దూరపు బంధువొకామె భర్త చనిపోయిన అయిదేళ్ళకి రెండోపెళ్ళి చేసుకొంది ఆవిడకి ఎనిమిదేళ్ళ కొడుకున్నాడు ఆవిడ రెండో భర్తకు బాబుపై ఎంత ద్వేషమో ఏమో ఆవిడ లేనప్పుడు ఆ బాబు చెయ్యి విరగ్గొట్టేశాడు మానవుడిలోని ఈ దానవత్వాన్ని సంహరించడం ఎవరితరం? ఆ బాబు బంగారంలాంటి బవిష్యత్తు బుగ్గిపాలు కావడాని క్కారణం ఆ బాబు తల్లే! ఆమె తన సుఖంకోసం బాబు జీవితాన్ని బలిపెట్టింది ఒకవేళ ఆమె రెండో భర్త బాబు చెయ్యి విరచకుండా ఉండిఉన్నా ఆ బాబుకి ఆమె అన్యాయం చేసిందే అవుతుంది ఎలాగంటే సాటిపిల్లలు "మీ అమ్మ రెండోపెళ్ళి చేసుకొంది అంటూ గేలిచేస్తుంటే ఆదివాడి హృదయానికెంత బాదను కలిగిస్తుందో చెప్పలేం కాబట్టి పసిడి మొగ్గలంటి పసిపిల్లల జీవితాలను వికసింపజేసినా, చిదిమేసినా అది పెద్దల చేతుల్లోనే వుంది

వేములవాణి, అల్లూరు

(నెల్లూరు)

* * *




# భవిష్యత్తు మాటేమిటి?

భవిష్యత్తులో బాధ్యత గల పౌరులుగా తీర్చిదిద్దబడవలసిన నేటి పిల్లల పరిస్థితి ఎందుకిలా దిగజారి పోతోంది? నిరాశ, నిస్పృహలతో ఎందుకింత అంధకారంగా తయారవుతోంది? ఏమాత్రం ఆలోచించగల వాళ్ళకైన స్ఫురించే సమాధానం ఒక్కటే - ఒక వైపు ఈ దేశ ఆర్థిక బలహీనత, వేరొకవైపు పెద్దల అజ్ఞానం, అవివేకం, నిరక్షరాస్యత ఇవే! ఇటు పదేండ్లునిండని పసివాడు తెచ్చే పావలా డబ్బులకోసం ఆశపడే తలిదండ్రుల మానసిక, ఆర్థిక బలహీనత, అటు తక్కువ కూలీ ద్వారా ఎక్కువ శ్రమని రాబట్టుకోవాలని ఆశించే యజమానుల దోపిడీ మనస్తత్వం, వీటికితోడు ప్రభుత్వ నిర్లక్ష్య ధోరణి వీళ్ల భవిష్యత్తుని



నిర్దయగా త్రొక్కివేస్తున్నాయి.

ఈనాడు ఏ రంగంలో చూసినా పసివాళ్ల సంఖ్య ఎక్కువే రిక్షా పుల్లర్స్‌గా, బ్లాక్ టికెట్ సెల్లర్సుగ, సారా దుకాణాలలోను, కారాగారాల లోను, కర్మాగారాలందు, కర్మాగారాలందు ఎక్కడ చూచినా వీళ్ళే! భవిష్యత్తును తమ భుజస్కంధాలపైన నడపవలసిన వీళ్ల శ్రమని, శక్తిని పసితనంలోనే రక్తంతో సహా పిండుకు త్రాగి నిర్వీర్యులుగా, నిరర్థకులుగ, రోగగ్రస్తులుగ తయారు చేస్తున్నాం. ఉత్తమ జాతిని ఈ దేశానికి అందించి ఉత్తమ మాతృమూర్తులుగ తయారు కావలసిన నేటి ముక్కుపచ్చలారని ఎందరో ఆడపిల్లలను పక్కా వ్యభిచారులుగా మారుస్తున్నాం. అందుకే సున్నితంగా పెరగవలసిన వీళ్ల మనస్తత్వాలు మొరటుదేలిపోయి దొంగలుగానో, రౌడీలుగానో, సమాజ విచ్ఛిన్నకర శక్తులుగానో మారుతున్నారు.

నేటి ఈ పసితండుల జీవితాలు యిలా మారితే రేపు ఈ దేశ భవిష్యత్తు మాటేమిటి? ఈ పరిస్థితిని అర్థం చేసుకొని వీళ్లని ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత ఎవరిది? ప్రభుత్వం, చట్టం ముందుకు రావాలి. ఒకరోజు భోజనం పెడితేనో, ఒక గ్లాసు పాలు ఇస్తేనో, ఒక జత బట్టలు యిస్తేనో వీళ్ల జీవితాలు తెల్లవారిపోవు. వీళ్లని తీర్చి దిద్దే శాశ్వత పథకాలు కావాలి. ఉచిత వైద్య విద్యా సౌకర్యాలు. ఉపయోగపడే సంక్షేమ పథకాలు అమలు జరపాలి. వృత్తి విద్యలకు అధిక ప్రాధాన్యత యివ్వాలి. పసి వాళ్ళు కార్మికులు కారాదనే చట్టం అమలులోకి రావాలి. అలా ఉపయోగించుకునే వాళ్లపై కఠిన చర్యలు తీసుకోవాలి. పిల్లలు పుట్టింది కేవలం ధనార్జనకేననే మనస్తత్వం తల్లి తండ్రుల మనస్సులలో నుంచి చెరిగి పోవాలి. వాళ్ల శక్తిని, రక్తాన్ని పిండుకొని అధిక లాభాలు ఆర్జించాలనే కుత్సిత మనస్తత్వం యజమానులలో నుండి తొలగిపోవాలి. ఇలా, అటు ప్రభుత్వం, చట్టం ఇటు తల్లి తండ్రులు సమాజం ఈ పసివాళ్ల బ్రతుకు విలువలు గ్రహించి అందరూ బాధ్యత వహిస్తే కనీసం నూటికి పదిమంది అయినా ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దబడి దేశ భవిష్యత్తుకు ఉపయోగపడతారు.

—తమ్మిన అనంతరామ్,

విజయవాడ □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు . . .

పూర్తి చిరునామా

పిన్ కోడ్




**జి. ఎన్. వి. సికింద్రాబాదు**

★ మతానికి, మూఢనమ్మకానికి తేడా ఏమిటి కె. రా గారూ?

● మూఢనమ్మకాలీ జీవితానికి సంబంధించినవి మతం– పరలోక జీవితేచ్ఛకు సంబంధించినది– మూఢనమ్మకాలు – అంతానికి – మతం సుగుణానికి సోపానాలు. కోరికలనంతమైతే–' మూఢనమ్మకాలు అధికం అవుతాయి కోరికలని జయించితే – మత పరమైన నమ్మకం పెరుగుతుంది. క్లుప్తంగా చెప్పాలంటే– కోరికలు మనిషిని మూఢ నమ్మకాల వైపు తోస్తే – వాటిని త్యజించి మనిషి ఉన్నతుడవు తున్నాడు. ఇది నా భావన.

**కె. క. లక్ష్మీదేవిపల్లి**

★ ఎందుకో ఏమిటో ఈమధ్య చిన్నిల్లు అంటే అందరూ మరీ ఎక్కువ మోజు పడుతున్నారు ఎందుకంటారు?

● ఎందుకేమిటి? కడుపు నిండిన భోజనం అని' చక్కగా చిన్న పెళ్ళాం కాకుండా కానీ కర్చు పెట్టక్కర లేని పెళ్ళాం అంటే మోజేకద?

**కె. ఎన్. గూడూరు**

★ తరం తరం నిరంతరం– నీ అందం– సహజ మని నేను మీ ఉద్దేశ్యం?

● ఏమిటో అయోమయం? వెర్రి కుదిరింది– రోకలి తెచ్చి తలకి చుట్టు అన్నాట్ట వెనకటి కో పెద్దమనిషి. మీకేసొస్తేజికి వచ్చినట్టుంది –నాకు'

**ఎన్. కె, ఆర్. పర్లాకిమిడి**

★ తీర్థ యాత్రలు చేసినంత మాత్రాన, కొన్ని మంత్రాలు వల్లించి నంత మాత్రాన పాపాలు పోతాయంటారు నిజమా?

● కాదని చేసే వారికీ తెలుసు కాని – వ్రత కాలంలో నైనా కాస్త నైతికంగా విలువలు పాటిస్తారని అలా అంటారు. మహాకవికి రష్యాలో స్త్రీలంతా తల్లుల్లాగా తోబుట్టువుల్లాగా. కన్పించారన్నాడు– అక్కడ వ్యభిచారం లేదు కనుకో అది స్వల మహిమ

★ సాహిత్యం సమాజాన్ని మారుస్తుందంటారా?

● మారుస్తోంది' చూడడం లేదా?'

★ స్నేహానికి నిర్వచనం ఏమిటి?

● భిన్న దృక్పథాలలో ఏకత్వాన్ని గౌరవించుకోవడం – స్నేహం.

★ కష్టపడిచేసే ప్రతిపనివల్లా సుఖం వుంటుందా?

● ఉండదు గాని మన తప్పు లేకుండా శ్రమపడ్డామన్న తృప్తి వుంటుంది

**పి. ఎస్. బి. ఆర్. కోటబొమ్మాళి**

★ నేటి సినిమాలపై మీ అభిప్రాయం?

● చూసినా ఫరవాలేదు చూడక పోయినా ఫరవాలేదు'

★ సంతోషంగా కలిసి మెలిసి వుంటూంటే కొంత మంది చదువు సంస్కారం ఉన్న పెద్ద మనుషులే విడదీయాలని ప్రయత్నిస్తారెందుకు?

● ఆ కలిసి మెలసి సంతోషంగా వుంటున్న దెవరితో?' తెలియనిదే ఎలా చెప్పడం?

**ఎన్. వి. ఆర్. హైదరాబాదు.**

★ నిజానికి మాటలు వెతకడం కష్టం అంటారు. అబద్ధం చెప్పడానికిట్టే అవి దొరుకుతాయంటారు నిజమేనా?

● నిజాన్ని సూటిగా క్లియర్‌గా చూసే మనిషికి మాటలకి వెతుక్కోవలసిన అవసరం ఏమిటిసార్– భాషలోని ఏమాటైనా – ప్రతి మాటా ప్రతి సంఘటనా అతని ఎదలో కవితయై ఔన్నత్యాన్ని సాధించు కుంటుంది, అబద్ధానికే తడువుళ్ళాట.

★ కష్టా లెందుకు అనంతం అనిపిస్తాయి? సుఖాలెందుకు క్షణికాలనిపిస్తాయి?

● రెండూ క్షణికాలే. కాని మానవ బలహీనతలు వాటిని కాలపరిమితితో కొలవాలనుకుంటా యంతే. కట్టింగ్ చేయకుండా రత్నం మెరుపు రాదు. మనిషి కష్టాల కొలిమిలో రాటు తేలితే గాని – నిజమైన మనీషి కాలేడు. ఇదంతా వేదాంతంగా అన్పిస్తూందా. నో. మీ చుట్టూ సమాజం చూస్తే మీకే తెలుస్తుంది.

**కె. ఎస్. నెల్లూరు**

★ కన్నెపిల్ల కోనలోన.

● ఆహాఁ మీ పాట! తక్షణం యీ కార్డు ఏ చక్రవర్తిగారికో పోస్టు చేయించాలి సినిమాకి తగినది'

**ఎస్. వి. జువారినగర్, గోవా**

★ పెళ్లి పందిట్లో నూతన వదూవరులను దీవించే పెద్దల దీవింపులు, ' -నదివే మంత్రాలకు ముత్తయిదువుల హారతులకు పటిష్టం లేదనుకుంటా అందుకేనేమో వధూవరులు వేగంగా విడిపోతున్నారు

● ఇది మరీ బాగుంది' మంత్రాలు, దీవెనలు – మనుషులని కట్టి పడేస్తాయనుకుంటున్నారా? పెళ్లి జరిగేది – శరీరాలకి కాదు – మనస్సులకి కూడా 'ఇన్‌కం పాట బిలిటీ' యీ రోజు – విడాకులకి చాలా ముఖ్య కారణంగా కన్పిస్తూంది

**జి. వి. ఆర్. సికిందరాబాదు**

★ మెతుకు పడేయండ అంటారే – ఓ మెతుకు ఆకలితీరుస్తుందా?

● తీర్చదు – కాని మిగిలిన మెతుకులకి జత అవుతుంది ఒక్క చుక్కనీరు సముద్రం కాక పోవచ్చుగాని – సముద్రపు నీటిలో ఆ చుక్క కలుస్తూంది కదా? ఇదీ అంతే

**ఎం. ఆర్. డి. బళ్లారి**

★ ప్రతి పురుషుని వెనుకా ఒక స్త్రీశక్తి వుంటుందంటారు. మీరు ఏకీభవిస్తారా!

● తప్పకుండాను ఎంతో రక్షణ కవచంగా ఆడది వుంటేనే – ప్రముఖ వ్యక్తులలా ప్రముఖంగా నిలబడకల్గేది.

★ మీరు ఏదేవుడ్ని కొలుస్తారు?

● ఎలా చెప్పను? మనకి ముక్కోటి దేవతలు! అంచేత ఎప్పుడే దేవుడో దేవతో ఫాషన్ అయితే – అప్పుడా దేవత సైడుంటాను నేను – ఎందుకేనా మంచిదని'

**ఎమ్. వి. కె. ఆర్. రాజమండ్రి**

★ మనకి గుర్తింపు రావాలంటే?

● తక్కువ మాట్లాడ్డమే కాదు తగినట్టు కూడా మాట్లాడడం ప్రారంభిస్తే – గుర్తింపు అదే వస్తుంది! □



# పందెం

### దేవినేని ఉష



మూర్తి చాలా పురాతనమైన పల్లెటూరిలో పుట్టి పెరిగాడు. అతని తండ్రి కాశీనాథ్‌కు పొలం, పుట్రా, ఇల్లు, వాకిలీ ఉన్నాయి. మూర్తి ఆయనకు ఏకైక సంతానం. మూర్తి తల్లి వర్ధనమ్మది నిండుకుండలాటి మంచి మనసు.

కాశీనాథ్ తండ్రి రామారావు భార్య చనిపోగా కూతుళ్ళకుపెళ్ళిచేసి పంపి పెద్ద కొడుకు కాశీనాథ్ దగ్గరే ఉండిపోయాడు. ఆయనకు ఇద్దరు కూతుళ్ళు. ఇద్దరు కొడుకులు. చిన్న కొడుకు చంద్ర పట్నంలో మంచి పలుకుబడి ఉన్న ఉద్యోగమే చేస్తున్నాడు. మూర్తి చురుకుగా ఉంటాడు. స్కూల్ ఫైనల్ వరకూ ఊళ్ళోనే చదివాడు. అతనికి చదువుమీద అంతగా ఇంట్రస్టులేదు. అందుకు కారణం మితిమీరిన గారాబమే. అతని జీవితాన్ని వక్రమార్గంలో పెట్టింది. ఒక్కడే కొడుకు అని గారాబం చేసారు. దాంతో అతనికి తాను పట్టిన కుందేటికి మూడేకాళ్ళు అని వాదించే స్వభావం అతని వయసు, శరీరంతో పాటుగాపెరిగింది.

మూర్తి స్కూల్ ఫైనల్ పాసయ్యాకా అతని తండ్రి కొడుకును ఆ వూళ్ళో ఉంచితే సావాసాలతో చెడిపోతాడని ఆలోచించాడు.

మూర్తి మాత్రం ముక్కున పట్టిన పాఠాలతో స్కూల్ ఫైనల్ అయిందనిపించాడు.

మూర్తి బాబాయి చంద్రం వచ్చి అన్న కొడుకును తనతో తీసుకువెళ్ళి అతడిని కాలేజీలో జేర్పించాడు.

మూర్తికి బస్తీ అనగానే అందరిలా సంతోషం కలుగలేదు. బస్తీలో చదువుకోవాలంటే అతనికి ప్రాణసంకటంగా ఉంది. అందుకు కారణం ఉంది.

మూర్తి తాత రామారావుకు కోళ్ళ పెంపకం ఎక్కువగా ఉండేది. కొడుకు విశ్వనాథ్ పొలం వ్యవహారాలు చూసుకుంటే ఆయన కోళ్ళ పరిశ్రమ చేపట్టాడు. కోళ్ళకు మంచి బలమైన మేత పెట్టించేవాడు. కొన్ని గుడ్లు పెట్టేవి. అవి అమ్మగా వచ్చిన సొమ్ము ఆయన తన స్వంత ఖర్చుల కోసం దాచుకునేవాడు. ఆ సొమ్ముతోనే మనవళ్ళ, మనవరాళ్ళ ముద్దు, ముచ్చట్లు, కూతుళ్ళ అవసరాలు తీర్చేవాడు.

విశ్వనాథ్ ఆ సొమ్ము మాత్రం తండ్రిని అడిగేవాడుకాదు. ఎప్పుడైనా పైకం అవసరం అయితే తండ్రి నుంచి సొమ్ము అప్పుగా తీసుకుని తన చేతిలోకి డబ్బు అందగానే తిరిగి తండ్రికి ఇచ్చేసేవాడు. కొన్ని కోళ్ల జనం ఆకలికి

హరాయింపు అయ్యేవి బలంగా మాంసం పట్టిన ఆ కోళ్ళను బేరం ఆడకుండా కొని తీసుకు వెళ్ళేవారు బస్తీ నుండి వచ్చే బేరగాళ్ళు ఆయన దగ్గర పుంజులు కూడా ఎక్కువగానే ఉండేవి

తాతగారి అడుగు జాడల్లో నడిచే మూర్తికి కూడా పసితనం నుండే కోళ్ళు అంటే ఆసక్తి ఏర్పడిపోయింది వయసు పెరుగుతున్న కొద్దీ అతడు తాతగారి కోళ్ళ పెంపకంలో మెలకువలు గమనించసాగాడు అతడు సరదాగా పుంజులను ఒక చోట జేర్చి కాళ్ళకు బంధాలు వేసి కయ్యం నేర్పించేవాడు ప్రతి సంవత్సరం ఆ గ్రామంలో కోళ్ళ పందాలు జరిగేవి

ఆ సంవత్సరం మూర్తికి ఏడో ఏడు వచ్చింది కోడి పుంజుల పందెం గురించి విన్నాడు

'తాతా! నేను పందానికి వెళ్ళనా!" తాతగార్ని అడిగాడు

"వెళ్ళరా! మంచి పుంజును ఏరి తీసుకు వెళ్ళు" ఆయన ఆర్డర్ ఇచ్చేసాడు

మంచి పొగరుకల పుంజును చంకన పెట్టుకుని మూర్తి వెళ్ళి అంకమ్మ గుడివద్ద జరిగే కోళ్ళ పందెంలో పాల్గొన్నాడు

అదృష్టవశాత్తు ఆ పందెంలో మూర్తి పుంజ గెలిచింది అదీ దర్మయుద్ధంలో గెలిచింది పందాలలో సహజంగా కోడిపుంజుల కాళ్ళకు పదునైన కత్తులు కడతారు అది ధర్మయుద్ధం కాదు పుంజులు ఆ కత్తులతో ఎదుటి ప్రత్యర్థిని చీల్చి చెండాడుతాయి

కానీ ఈ సారి ఇక్కడ ధర్మయుద్ధం పెట్టారు. ఇప్పుడు పుంజుల కాళ్ళకు కత్తులు కట్టరు అవి సహజ బలాబలాలు తేల్చుకోవాల్సిందే కొంతమంది కుత్సితపు బుద్ధి ఉన్నవారు కోడిపుంజుల కాళ్ళకు కట్టే కత్తులకు విషం పూసి ప్రత్యర్థుల కోళ్ళపై వదులుతారు ఆ విష ఫలితంగా అవతలి పుంజ త్వరగా విగతజీవి అవుతుంది

అన్ని రంగాల్లోలానే ఈ రంగంలో నూ కుట్రలూ, ద్వేషాలూ విపరీతంగా ఉన్నాయి

ఈ సారి ధర్మయుద్ధంలో పది సంవత్సరాల మూర్తి పుంజ గెలుపు సాధించింది అది తన ప్రత్యర్థి పుంజును తన కత్తుల్లాంటి సన్నని గోళ్ళతో గిరించి పదునైన ముక్కుతో కసిగా పొడిచింది ఆ పుంజు శరీరం రక్తసిక్తమయింది పోరాటం తుది ఘట్టంలో ఆ పుంజు ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసాయి

పదేళ్ళ మూర్తి ఆ గెలుపుతో అలెగ్జాండర్ అంతటి గర్వంతో విర్రవీగి పోయాడు ఆ గెలుపు తనకు జీవితంలో భయంకరమైన ఓటమిని తెచ్చి పెడుతుందని అప్పుడు తెలుసుకోలేకపోయాడు

మూర్తి తండ్రి కాశీనాథ్ శాంత స్వభావుడు ఏ ప్రాణి అయినా హింసింపబడుతుంటే ఆయన చూడలేడు. కొడుకు ఇలా మూగజీవాలతో చెలగాటం ఆడటం ఆయన సహించలేక కొడుకును మందలించాడు

తాతయ్య సమర్థింపు ఎక్కువగా ఉన్న మూర్తి తండ్రి మాటలు లెక్కచేయలేదు

అలా అలవాటు అయిన మూర్తికి రానురాను కోళ్ళ పందాలంటే ఆసక్తి అధికం అయింది

తాతయ్య రామారావు గుండెఆగి చచ్చిపోయాడు. కొంతకాలం రెక్కలు తెగిన పక్షిలా అయింది మూర్తి పని ఎలాగ కాలం గడుస్తున్నకొద్దీ ఆ దెబ్బనుండి తట్టుకున్నాడు

పూళ్లో స్నేహితుల బృందాన్ని ఏర్పాటు చేసుకున్నాడు పుంజులను తెచ్చి పెంచసాగాడు తండ్రి వద్దనివారించినా వినేవాడుకాడు వయసు పెరుగుతున్న కొడుకును వయసు తరుగుతున్న తండ్రి అదుపులో పెట్టలేక పోయేవాడు

ఆ గ్రామ పరిసర ప్రాంతాలలో ఎక్కడ పందాలు జరిగినా అక్కడ పుంజులతో మూర్తి హాజరు అయ్యేవాడు అతనికి 'పందాల మూర్తి'గా పేరు పడిపోయింది

తండ్రి పట్టుదలతో మూర్తి ఎలాగో స్కూల్ ఫైనల్ పాసయ్యాడు కాశీనాథ్ తమ్ముడు చంద్రం వస్తే అతనితో కొడుకు గురించి చెప్పాడు

ఆ గ్రామంలో ఎటూ కాలేజీలేదు కాబట్టి మూర్తిని తాను కాలేజీలో చేర్పిస్తానని చెప్పి చంద్రం అన్న కొడుకును పట్నం తీసుకువెళ్ళి కాలేజీలో చేర్పించాడు

పట్నంలో కాలేజీలో చేరినా మూర్తికి పుంజుల ధ్యాసే ఎక్కువగా ఉండేది. రెండు రోజులు కాలేజీ సెలవు వచ్చినా మూర్తి వెంటనే తమ వూరు వచ్చేసి మిత్రుల పర్యవేక్షణలో ఉన్న పుంజులను చూసుకుని వెళ్ళేవాడు. ఎక్కడ పందెం జరిగినా అతని స్నేహితులు అతనికి ముందు గానే తెలిపేవారు దాంతో బాబాయి వద్దన్నా లెక్క చేయక అతను రెక్కలు కట్టుకుని వచ్చి వాలేవాడు

పి యు సి ఫైనల్ ఎగ్జామ్స్ అప్పుడు బాబాయి చంద్రం మూర్తితో పందెం కట్టాడు

"నువ్వు కనుక ఎగ్జామ్స్‌లో పాసయితే ఐదు పుంజులను కొనిస్తానని" అన్నాడు

పుంజులను కొనిస్తే పందానికి సవాల్!" అంటూ మూర్తి ఒప్పుకున్నాడు పట్టుపట్టి చదివి పి.యు.సి ప్రథమశ్రేణిలో పాసయ్యాడు చంద్రం మూర్తిని తన పలుకుబడితో మెడిసన్‌లో చేర్పించాడు కానీ మూర్తి మనసు కోళ్ళ పందాల మీదే ఉంది. అతనికి చదువు నచ్చలేదు చీటికీ, మాటికీ వూళ్ళ వెంట వెళ్ళటానికీ, పుంజుల పందాలలో పాల్గొనటానికి వీలు కావటంలేదు.

రెండేళ్ళు గడిచేసరికి ఆ మెడిసన్ చదువు బోర్ కొట్టేసింది. దానికితోడు కాశీనాథ్ ఆకస్మికంగా మరణించాడు.

చదువు స్వస్తి పలికి మూర్తి పల్లెటూరు వచ్చేసాడు. ఒక్కడే కొడుకు వెనుక ఆస్తి ఉండటంతో అతనికి ఉద్యోగం చేసే అవసరం ఎంత మాత్రం లేదు తల్లి కూడా భర్త మరణంతో కృంగిపోయి పెత్తనం అంతా కొడుకు చేతిలో పెట్టేసింది.

ఆ వూళ్లో మోతుబరి కామందు వెంకన్నగారికి చక్కని అమ్మాయి ఉంది ఆమెపేరు రాధ. వెంకన్నగారికీ కోళ్ళ పందాల పిచ్చి ఉంది ప్రతిచోటా మూర్తి కోడి పుంజుల చేతిలో ఆయన పుంజులు ఓటమి పొందాల్సిందే.

మూర్తికి ఈ పందాలు తప్ప మరొక వ్యసనంలేదు కనీసం సిగరెట్, వక్కపొడి కూడా అలవాటులేదు

పందాల సమయంలో అతనిలో ఏదో అంతుతెలీని పట్టుదలా, ఆవేశం పొంగుకు వస్తాయి అటువంటి సమయంలో పందానికి ఎంత డబ్బు కాయాలన్నా అతను ఆలోచించడు మూర్తి ఉత్సాహవంతుడైన యువకుడు వెంకన్నగారు మూర్తిని తన అల్లుడిగా చేసుకుని తన ప్రతిష్ఠ పెంచుకోవాలనుకున్నారు అయితే మూర్తిని అల్లుడిగా గొప్పతనంతో తెచ్చుకోవాలనుకున్నారు.

బాగా చురుకైన తన కోడిపుంజును మూర్తి పందెంలో గెలిస్తే తన కూతుర్ని ఇస్తానని పెద్ద మనుషులతో కబురు చేసారు

మూర్తి అందాల రాధను భార్యగా పొందాలనుకున్నాడు పందానికి అంగీకరించాడు ప్రత్యేకంగా తర్ఫీదుఇచ్చిన బలమైన కోడిపుంజుతో పందానికి దిగాడు

మూర్తి పుంజు వెంకన్నగారి పుంజును అవలీలగా



ఓడించింది దాంతో మూర్తి అందరిలో ఘనంగా కీర్తింపబడి వెంకన్నగారి అల్లుడు అయ్యాడు

రాధ చక్కని సంస్కారం కల అమ్మాయి భర్త పెద్ద తరహాగా ఉండకుండా పుంజులను వేసుకుని తిరగడం నచ్చలేదు. పైగా అందరూ భర్తను "పందాల మూర్తి" అని నిక్‌నేమ్ పెట్టి పిలవడం అసలు నచ్చలేదు భర్తతో పందేల అలవాటు మాన్పించాలని ఎంతో ప్రయత్నం చేసింది మూర్తి భార్య మాట లక్ష్యపెట్టలేదు ఆ విషయం మినహా ఆమె మరేది చెప్పినా వినేవాడు భార్యను అపురూపంగా చూసుకునేవాడు

ఆ ఏడు పందాలలో మూర్తికి అఖండ విజయం లభించింది రాధ గర్భవతి అని ఆ రోజే విన్నాడు సంతోషంతో పొంగిపోయాడు ఈ పందాలవల్ల తనకు మంచేకానీ చెడు జరగదని విశ్వసించేవాడు

నమ్మితే దేవుడు రాయిలో కూడా ఉంటాడు అనుకునేవాడు

రాధకు నెలలు గడవసాగాయి సంక్రాంతి పండుగ దగ్గరకు వస్తోంది అటు రాదకు ప్రసవం రోజులు దగ్గరకు రాసాగాయి

ఇనుమడించిన నూతన ఉత్సాహంతో మూర్తి రాబోయే సంక్రాంతి నాటికి పందాలకు పుంజులను సిద్ధం చేయసాగాడు

ఈ అలవాటు మానుకోమని, లేకపోతే పుట్టబోయే బిడ్డకూడా మీలా తయారు అవుతాడని రాధ భర్తను వేధించేది

అదంతా రాధ బయమేననీ తేలికగా తీసిపారేసేవాడు

పందెం నాటికి రాధ ప్రసవం అయి కచ్చితంగా గుమ్మడి పండంటి కొడుకును కంటుంది అని మూర్తి రాదతో పందెం కట్టాడు

భర్త ధోరణికి విసుగేసి రాద మౌనం వహించింది

* * * * * *

సంక్రాంతి రానే వచ్చింది. పక్క గ్రామంలో జరిగే పందాలకు తన స్నేహితులను, పుంజులను వేసుకుని మూర్తి బయలుదేరాడు

తనకు ఒంట్లో బాగుండలేదనీ, మనసు ఏదో కీడును శంకిస్తోంది అని ఆ రోజు భర్తను ఇల్లు వదిలి వెళ్ళొద్దని రాధ వేడుకొంది పందాల విషయంలో తాను ఎవరి మాటా లెక్క చేయనంటూ భార్య మాటలు త్రోసిపుచ్చి మూర్తి వెళ్ళిపోయాడు

మూర్తి వెళ్ళిపోయాక రాధకు నొప్పులు ప్రారంభం అయ్యాయి. ఆ సమయంలో రాధ తండ్రి వెంకన్నగారు ముఖ్యమైన పనిమీద రాజమండ్రి వెళ్లారు.

ఆ గ్రామం చాలా పురాతనమైన గ్రామం కాబట్టి అక్కడ గవర్నమెంట్ డాక్టర్ ఉన్నా అతని దగ్గరకు వెళ్ళరు. మంత్రసాని ఇళ్ళకు వచ్చి కాన్పులు చేస్తుంది.

అలాగే రాధ దగ్గరకు మంత్రసాని వచ్చింది. రాధకు సుఖప్రసవం జరగలేదు. కడుపులో బిడ్డ అడ్డం తిరిగింది. మంత్రసానికేం చేయాలో పాలు పోలేదు. ఎవరో డాక్టర్ కోసం పరిగెత్తారు అక్కడ డాక్టర్‌గారు సెలవుపెట్టి స్వంత వూరు వెళ్ళారని తెలిసింది

రాధను అర్జంట్‌గా పట్నం తీసుకు వెళ్లాలి.

మూర్తి కోసం కబురు వెళ్ళింది. అతడు మంచి రసపట్టులో ఉన్నాడు ఆట వుధృతం అవుతున్న కొద్దీ అతనిలో పట్టుదల పెరగసాగింది. అటువంటి ఆవేశంలో తన ఆస్తి సర్వం పందెంలో పణంగా పెట్టాడు

అవతలి పార్టీవాళ్ళు కూడా అందుకు సమానంగా పందెం కట్టారు కన్నూ, మిన్నూ కానని అహంకారంతో తన పుంజు గెలుస్తుంది అన్న నమ్మకంతో మూర్తి ఆ పని చేసాడు పుంజుకాళ్ళకు సన్నని కత్తులుకట్టి రెడీ చేసాడు

అవతలి వ్యక్తులు కుట్రతో తమ పుంజు కాళ్ళకు కట్టిన పదునైన చాకులకు రహస్యంగా విషం పూసారు. పుంజులు రెండు రంగంలోకి దిగాయి హోరా హోరీ పోరాడుకుంటున్నాయి కొండంత ఉత్సుకతతో మూర్తి వెయ్యి కళ్ళతో గమనింసాగాడు

అటువంటి సమయంలో భార్యను బస్తీకి తీసుకు వెళ్లాలంటూ కబురువచ్చింది. నరనరానా పందెం ఆసక్తితో నిండిపోయిన మూర్తిని ఆ మాట ఎంత మాత్రం కదిలించలేక పోయింది ఆట మధ్యలో తాను రావటానికి వీలులేదని, ఎవరినైనా భార్యను పట్నం తీసుకు వెళ్ళమని చెప్పి పంపేసాడు మూర్తి

బంధువులే ఎలాగో రాధను పట్నం హాస్పిటల్‌లో చేర్చారు రాధకు వాతం కమ్మింది నరకయాతన పడి చివరకు రాధ ప్రసవించకుండానే ప్రాణాలు కోల్పోయింది ఆమె కడుపులో శిశువుకూడా మరణించింది. మూర్తి తల్లి, రాధ తల్లి ఎంతో ఏడ్చారు.

* * * * * *

ఘోర పరాజయం పొందాడు మూర్తి అతని పందెం కోడి విగతజీవి అయి నేలమీద పడిఉంది ప్రత్యర్థి పుంజు కాళ్ళకు కట్టిన బాకులు నుండి విషం మూర్తి కోడిపుంజులోకి ప్రవేశించి దాని ప్రాణం తీసింది

ప్రత్యర్థి కోడిపుంజు గర్వంగా, రెక్కలు విప్పుతూ మదమెత్తిన దానిలా తిరగసాగింది మూర్తికి అది కనీ వినీ ఎరుగని ఓటమి జరిగిన మోసం గ్రహించే ఓపిక కూడా అతనికి లేకపోయింది. ఆ పందెంలో తన సర్వస్వం కోల్పోయిన మూర్తి అచేతనుడయ్యాడు అటువంటి దురదృష్ట సమయంలో భార్య మరణవార్త తెచ్చారు ఎవరో. అది విన్నాడు. అంతే అతని గుండె పట్టేసినట్టయింది. మెదడులో పెను తుఫాన్ చెలరేగింది.

అప్పటి నుండి పందాలమూర్తి "పిచ్చిమూర్తి" అయ్యాడు తాగుడు, జూదం, వ్యభిచారం వీటికి ఎంత మాత్రం తీసిపోని ఈ కోడి పందాల పిచ్చిలో మూర్తి తన భవిష్యత్‌నే పందెంగా పెట్టి చిత్తుగా ఓడిపోయాడు.

కోడిపందాల పిచ్చితో పతనమయ్యే మూర్తిలాటివారు ఎందరో! □


**Statement about Ownership and other Particulars about Newspaper**

## ANDHRA SACHITRA VARA PATRIKA

Form IV (See Rule - 8)

1 Place of Publication VIJAYAWADA.

2 Periodicity of Publication WEEKLY

3 Printer's Name . S Nageswara Rao
Whether citizen of India Yes
Address 1 Luz Avenue, Mylapur, Madras-600004

4 Publisher's Name Sri S Nageswara Rao
Whether Citizen of India Yes
Address · 1, Luz Avenue, Mylapur, Madras-600004

5 Editor's Name S Radhakrishna
Whether citizen of India Yes
Address 14-14-21, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3

6 Name and addresses of Individuals who own the News paper and partners of share holders holding more than one percent of the total capital
(1) Name S Kamakshmma, 1 Luz Avenue Mylapur Madras 600004 (2) S Radhakrishna Address 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3 (3) Name : S Nageswara Rao Address 1, Luz Avenue, Mylapur, Madras-600004 (4) Name S Rajeswari Address 14-14-21, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3 (5) Name S Seshamma Address 1, Luz Avenue, Mylapur, Madras 600004 (6) Name S Sreeram Murthy, Trustee, Kasinadhuni Nageswara Rao, Sivalenka Sambu Prasad Dharma Nidhi Address 42-45 Luz Church Road, Madras 600004 (7) Name : S Ramayamma, Address 1, Luz Avenue, Mylapur Madras-600004 (8) Name P Satyanarayana Address H No 8—2—322 Road No 3, Banjara Hills, Hyderabad — 500 034. (9) M/s Sambu Prasad & Sons P Ltd 63, Rayapettah High Road, Madras 4 (10) Mr M S Kini, 1 9-1122/3/1 Dayananda Nagar, Hyderabad-4 (11) Sri Venkata Rao Kordale, 1 1-593/2, Gandhi nagar, Hyderabad-38 (12) Sri V Sundaram, No 20, First Main Road, Thiruvanmiyar, Madras-41 (13) Sri R Gopalakrishna, 79, Venkateswara Nagar, Kottivakkam, Madras-41. (14) Sri S Sreeramamurthy, 62, Rayapettah High Road, Madras-4 (15) Master S V S Arvind, 1, Luz Avenue, Madras-4 (16) Sri M S, Ramesh, 16 11 19/5/2/A, Saleemnagar Colony, Malakpet, Hyderabad 36 (17) Smt P Nageswaramma, 1, Luz Avenue, Madras-4

I, S Nageswara Rao hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief

**S NAGESWARA RAO,**
1-3-1987. Signature of Publisher.

## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలా బిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనా వివారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు – బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

– సం॥

# వారఫలం

6-3-1987 శుక్రవారం మొదలు
12-3-1987 గురువారం వరకు

★ **మేషం:** మీరు చేసే వ్యాపారంలో చక్కని మార్పులు చేయగలుగుతారు. అవి. ఎలాంటివైనా లాభదాయకమే. వ్యాపారం చక్కగాసాగి, అధిక లాభదాయక మవుతుందని గ్రహించండి. సాహితీ రంగాన మేలున్నది. స్త్రీలకు: వస్తు సేకరణకు, ఉద్యోగ పెంపునకు నెలవైన వారం.

★ **వృషభం:** ఆరోగ్య భాగ్యం, ఆదాయం. అభిమానుల ఆదరణ, వృత్తియందు పెంపు, కొందరకు కళారంగాన సదవకాశాలు చేకూరుట నిశ్చయం. గ్రహబలం వారమంతా బాగున్నది. స్త్రీలకు: కృషి చేయాలి గాని అన్నింటా అనుకూలమే.

★ **మిథునం:** ఇంట శుభం జరిగే సమయం, ఆరోగ్య భాగ్యం చేకూరు సమయం. ఉత్తముల స్నేహం లభ్య మవుతుంది. అనుకోకుండా బంధువులు యింటికి రావచ్చు. ఆదాయం సమకూరుతుంది.మీరు వ్యాపారం చేసేలాగైతే లాభదాయకమే. బంధు వర్గీయులతో తగాదాలు రాకుండా చూడండి. స్త్రీలకు: ఆదాయమున్నది, సాహితీ రంగాన మేలున్నది.

★ **కర్కాటకం:** నూతన వ్యాపారం సాగే అవకాశమున్నది. వృత్తియందు అంతో యింతో పెంపు చేకూరుతుంది. చాలమంది దూర ప్రాంతాలకు పోగల సూచనయున్నది. అధిక ప్రయాణాలు చేయటం శ్రేయస్కరంగాదు. ఇంట వస్తువులు పోతాయేమో గమనించాలి. స్త్రీలకు: ఉద్యోగరీత్యా కొంత మేలున్నది.

★ **సింహం:** మాటకు విలువ పెరగటం, సభాగౌరవం చేకూరటం, అనుకోకుండా ఆదాయం కలిసిరావటం చెప్పదగిన అంశాలు. ఉద్యోగరీత్యా శుభ వర్తమానం అందుతుంది. సంతోషదాయకమేగా! స్త్రీలకు: వస్తు సేకరణకు, కొందరకు వాహన సేకరణకు అనుకూలం.

★ **కన్య:** ఎంతో కాలంగా జరుగని వ్యవహారం ఈ వారం ఆనందంగా, హాయిగా జరిగిపోవటం గమనించదగిన అంశం. మీ బంధు వర్గం నుండి ఏదో శుభ వార్త అందనున్నది. ఉత్తరాల మూలంగా మేలు చేకూరుతుంది. వ్యాపారాన లాభదాయకం. స్త్రీలకు: వృత్తియందు పెంపు, రాజకీయంగా మేలైన దినములే.

★ **తుల:** పది మందిలో పేరు ప్రతిష్ఠలుంటాయి. ఆబాల గోపాలం మిమ్ము హర్షిస్తారు. అయినా ఒకానొక విషయంలో అపనిందల పాలవుతారు. ఇవ్వవలసిన డబ్బును గూర్చిన వత్తిడి ఏర్పడుతుంది. స్త్రీలకు: నూతన మిత్ర సంపర్కం, ధనాదాయమందభివృద్ధి.

★ **వృశ్చికం:** ధనాధాయమున్నది. అయినా అంతకు అంత ఖర్చున్నది. రాశియందలి శనిబాధ తప్పదు. లేనిపోని బాధలు తటస్తపడుతాయి. రాజకీయంగా మీ మాటకు విలువ యిప్పట్లో పెరుగదు. జరుగనైన పనులు కూడ సక్రమంగా జరుగవు, గ్రహిస్తారుగా! స్త్రీలకు: ఉద్యోగరీత్యా యిబ్బందులుతప్పవు.

★ **ధనుస్సు:** పోయిన వస్తువులు సేకరించుకో-గలరు. వ్యాపారరీత్యా ఒక్క అడుగు ముందుకు పోగలరు. సాహిత్య మార్గాన మీకు మేలు జరుగుట, సదవకాశాలు లభ్య మగుట నిశ్చయం. ఇటీవల అప్పు తీసికొనుటకై యత్నాలు చేసారుగా; ఫలించాయా? ఇప్పట్లో అలాంటి వ్యవహారం కలసిరాదు. స్త్రీలకు: అద్భుతమైన వారం. ఆశించిన విధంగా ధనాదాయముంటుంది.

★ **మకరం:** అధికారం వృద్ధి నందనున్నది. ఆదాయం అభివృద్ధి చెందనున్నది. వృత్తి పెంపొందనున్నది. 'శని' సహాయమున్నది. నల్ల వస్తువుల వ్యాపారం బాగా సాగనున్నది. కళా ప్రావీణ్యత భాసింపనున్నది. స్త్రీలకు: విద్యా వైజ్ఞానికంగా, ఒకవేళ రాజకీయపరంగా మేలున్నది.

★ **కుంభం:** గ్రహించండి, 'గురు' ప్రభావాన వృత్తియందు, ఉద్యోగ మందు చెప్పదగిన మేలు చేకూరనున్నది. అధికార రీత్యా మేలున్నది. ఇష్ట బంధువులు యింటికి రానున్నారు. అయినదానికి కానిదానికి ఆవేదన పడకండి. స్త్రీలకు: సాహితీ మార్గాన మేలున్నది.

★ **మీనం:** స్థితి అంతో యింతో పెరగనున్నది. నాలుగువిధాల మేలున్నది. వెనక రావలసిన మీ బాకీలు వసూలవుతాయి. ప్రత్యర్థుల గొడవ ఉంటుందేమో గ్రహించండి. అధికారుల వలన మేలు జరుగుతుంది. అలాయిలా తిరుగుతూ వస్తువులు పోగొట్టుకోకండి. స్త్రీలకు: పనుల తొందర, శుభ కార్యాలోచనలు.

–విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి



చౌకరకంవి కొనడానికీ, మంచి నాణ్యమైనవి కొనడానికీ మధ్య బోలెడు తేడా ఉంది...అందుకే కొనాలి నాణ్యమైన సర్ఫ్.
"తూచి చూస్తే మీకే తెలుస్తుంది—సర్ఫ్ యొక్క పవర్ ప్యాక్డ్ ఫార్ములా మీ డబ్బుకి మించిన విలువ ఇస్తుందని".
డబ్బుకి మించిన విలువా? అసలే సర్ఫ్ ఖరీదైనది కూడా కదా?
"చూడండి. దీనివల్ల ఎంత ఎక్కువ లాభమో గ్రహించారా మీరు. కేవలం సర్ఫ్ మాత్రమే నా బట్టల్ని అతి తెల్లగా ఉతుకుతుంది. పైగా వాటిని సంరక్షిస్తుంది కూడా. అంచేత అవి కొత్తవాటిలా కనిపిస్తూనే వుంటాయి. అంటే ఇంక ఆదాయే అదా. అందుకే డబ్బుకి మించిన విలువ ఇస్తుందని అన్నాను నేను".
సరేగానీ, లలితగారూ, ఆ మాత్రమే చాలంటారా మీరు?
"అబ్బే. ఇంకా ఎంతో వుంది! ఒక కిలో చౌక రకం పౌడర్ ఎంత వుంటుందో అంత ½ కిలో సర్ఫ్ ప్యాక్‌లో ఉంటుంది. అంటే ఒక కిలో చౌక రకం పౌడర్ ఉతికేటన్ని బట్టల్ని అర కిలో సర్ఫ్ ఉతుకుతుందన్నమాట. అంటే సర్ఫ్ నుంచి మీరు మరింత లాభం పొందుతున్నట్టేగా మరి?"
1 కిలో చౌక రకం పౌడర్
½ కిలో సర్ఫ్
అంటే, కొనేందుకు సర్ఫ్‌ని మించినది లేదన్నమాట!
"అందులో సందేహం ఏముంది? సర్ఫ్ మరెంతో తెల్లగా ఉతుకుతుంది. మరే మామూలు పౌడర్లకన్నా రెట్టింపు బట్టల్ని. చౌక రకంవి కొనడానికీ, మంచి నాణ్యమైనవి కొనడానికీ మధ్య బోలెడు తేడా ఉంది. అందుకే సర్ఫ్ కొనడంలో మరింత వివేకం ఉంది".
POWER PACKED
Surf
washes whitest. keeps clothes like new!



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**ఎం. ఎస్. బాలసుబ్రహ్మణ్యం, విజయవాడ-3**

మీరు నటించిన అన్ని చిత్రాలూ చూశాను. కాని, నాకు అన్నింటిలోకీ 'మంచి మనసులు' చిత్రంలో మీ యాక్షన్ సుపర్బ్‌గా ఉంది ఆ చిత్రంలో నటించేటప్పుడు మీ అనుభూతిని తెలియ జేయండి

**ఆ పాత్రలో లీనమై నటించాను!**

**అరిగెల రేవతి, సూళ్ళూరుపేట**

పద్మిని, ఎల్ విజయలక్ష్మి తరువాత సినీ ఫీల్డులో నాట్యానికి విలువ తగ్గిందన్న అభిప్రాయంతో ఏకీభవిస్తారా?

**ఏకీభవించను!**

**కె. సావిత్రి, పొన్నెకల్లు**

అక్కా! సృష్టిలో తీయనిది ప్రేమ కాని, ప్రేమ వివాహం చేసుకున్న వారిని అంటరాని వారిలా చూస్తారేం ఈ అనాగరికులు?

**అనాగరికులు కాబట్టి.**

**టి. రామకుమారి, చిలకలూరిపేట**

పవిత్ర సినిమాలో మీరు రాజేంద్రప్రసాద్ గారిని మరీ అంతగా తిట్టడం బాగా లేదండి ఆ తర్వాత ఆయన మీతో ఏమన్నారు!

**ఇంకా ఎక్కువ తిట్టమన్నారు.**

**దగ్గుపాటి అలివేలుమంగ, శోభనాపురం**

ఓ గొప్పనటికి వారసురాలు అన్పించుకోడం గొప్పా? లేక తనకు తానే సాటి అన్పించు కోవడం గొప్పా?

**రెండూ గొప్పవే!**

**కొల్లి శ్రీదేవి, భీమునిపట్నం**

ఆడది అబల మాత్రమే కాదు, ఆదిశక్తిగా కూడా మారగలదని నిరూపించిన 'అనాదిగా ఆడది' చిత్రంలో మీ పాత్ర లాగా ప్రతి మహిళా సాహసిస్తే ?

**కోడళ్లని హింసించే వాళ్ళు భయపడతారు.**

**మిట్టపెల్లి సంజీవరావు, వరంగల్ -2**

జీవితంలో ఏ ప్రేరణ మిమ్మల్ని నటిగా మార్చింది?

**'నటి' కావాలన్న ప్రేరణే!**

**ఎన్. తిరుపాల్, ధర్మవరం**

భార్యా భర్తలను చిలుకా గోరింకలతో పోలుస్తారెందుకండీ?

**అలా బతకమని**

## ఉత్తమ ప్రశ్న

**ఏ. ఐ. గీతారాణి, ఉడిత్యాల్**

వరకట్నము అనే రక్కసి, నిరుద్యోగము అనే పిశాచి ఎప్పుడు నామరూపం లేకుండా పోతాయి?

**స్వార్థంలేని రాజకీయాలు వొచ్చినప్పుడు.**
**మరో మహాత్మాగాంధీ వొచ్చినప్పుడు**
**బుద్ధుడు పుట్టినప్పుడు**
**అబ్రహం లింకన్**
**లెనిన్ పుట్టినప్పుడు.**

**బొందిలి బాలాజీ సింగ్, నరసరావుపేట**

నిజ జీవితంలో తల్లికి, సినిమా లోని తల్లికి గల తేడా ఏమిటో చెప్ప గలరా భానుప్రియగారూ!

**నిజ జీవితంలో తల్లి ఏ ప్రతిఫలం ఆశించకుండా బిడ్డల్ని సాకుతుంది. సినిమాలో తల్లి అదే పని కొంచెం ప్రతిఫలం తీసుకు చేస్తుంది!**

**బి. శ్రీనివాసులు నాయుడు, చేతంచర్ల**

భార్య చనిపోతే భర్త మరల పెళ్ళి చేసుకుంటాడు కాని, భర్త పోతే భార్య మరల పెళ్ళి చేసుకోదు ఎందుకని?

**అదే! ఎందుకని?**

**జమ్ముల విశ్వేశ్వరరావు, బరంపురం**

సినీ సింగారంలో మీరొక అలంకారం మీరు అందంగా ఉన్నారని అంటూ మీ పట్ల ఉన్న ఆరాధనను వ్యక్తపరుస్తున్నాను మరి మీ రెట్లా వ్యక్తపరుస్తారో!

**ధన్యవాదాలుగా!**

**మంజువాణి శివరాం, అనకాపల్లి**

ప్రభుత్వమే ఒక వైపు వందల సంఖ్యలో కులాలను గుర్తిస్తూ గెజెట్‌లో నమోదు చేసి, ఇంకొకవైపు కుల వర్గరహిత సెక్యులర్ రాజ్యాంగా మనదేశం ఉండాలనడం ఎంత వరకు సబబు?

**ఈ దేశంలో కులం మతం జాతి ఏ రోజున పోతాయో– ఆ రోజే మనకు నిజంగా స్వతంత్ర మొచ్చిన రోజు.**

**సి. పద్మశ్రీ, విశాఖపట్నం-3**

సినిమాలలో కథలలో అన్యాయానికి, అధర్మానికి సరి అయిన శిక్షపడినా– నేటి సమాజంలో అది సాధ్యమవుతుందా?

**సాధ్యంకాదు– నిజ జీవితం వేరు– సినిమావేరు.**

**కాశీనాధుని రవిశంకర్, పాలకొల్లు**

మీరు ఏ చిత్రం చూసుకున్నాక మొట్టమొదటి సారిగా"నేనుకూడా నటినే అన్పించింది

**సితార** □

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ________________________

________________________

________________________

పంపిన వారి పేరు ________________________

పూర్తి చిరునామా ________________________

________________________

# అభిమాన నటుడిపై అభిప్రాయం

నా అభిమాన నటుడు సుప్రీంహీరో చిరంజీవి. ఫైట్స్‌లో చిరంజీవి చాకచక్యం, ఫాస్ట్ మూమెంట్ – అందరినీ ఆకర్షిస్తాయి చిరంజీవి గారి నటనా చాకచక్యమును అభిమానులు అపురూపమని ప్రశంసిస్తారు.

డేరింగ్, డాషింగ్ రోల్స్ పోషించడంలో చిరంజీవిగారు చతురులు. సమర్థులు




"చంటబ్బాయ్" చిత్రంలో పూర్తి హాస్యరస భరితమయిన పాత్రను, అపురూపంగా పోషించారు కేవలం కృషి, దీక్షాదక్షత తో పైకొచ్చి, అచిరకాలంలోనే, చిత్ర సీమలో ఎన్నో సంచలనాలు సృష్టించి, ధనంకంటే ఎక్కువగా అభిమాన ధనంను సంపాదించి, అగ్రస్థానంలో వున్న – ఏకైక నటుడు చిరంజీవి.

పాత్ర స్వభావం తెలుసుకొని, నటనలో వైవిధ్యం గల పాత్రలు అధికంగా పోషించాలని చిరంజీవికి నా సలహా అద్భుత రసం వుట్టిపడే విధంగా, ఫైట్స్ చాలా అద్భుతంగా చేస్తారు ఇటీవల విడుదలయిన రాక్షసుడు"లో చిరంజీవి విజృంభణ సూపర్బ్ చిరంజీవి మంచి చిత్రాలలో నటించి అగ్రశ్రేణిలో వుండాలని ఆశిస్తున్నాను

**–జి. నటరాజు, యస్. కే. డి. నగర్, ఆదోని**

★ ★ ★

**ఆం**ధ్రమాత గర్వించ దగ్గ ముద్దు బిడ్డ, నా అభిమాన అందాల నటుడు శోభన్‌బాబు. మా




అందాల నటుడ్ని మొట్ట మొదట సారిగా సిసింద్రీ చిట్టిబాబు షూటింగ్ కై అమరావతి" వచ్చినప్పుడు చూసాను నాటి నుంచి నేటి వరకు ఆయన నటించిన ప్రతి చిత్రం చూస్తున్నాను భక్త శబరి నుంచి నేటి జైలుపక్షి వరకు దగ్గర దగ్గర అన్నీ చూసాను మా హీరో గారివి చూడని చిత్రాలు (నేను) వ్రేళ్ళ మీద లెక్క పెట్టవచ్చు అంత అభిమానం ఆయనంటే నాకు మా హీరో గారి చిత్రాలు హీరోయిన్స్ వల్ల ఆడతాయి అన్న అభిప్రాయం చాలా వరకు తప్పు ఉదాహరణకు నాటి "వీరాభి మన్యు', "సంపూర్ణ రామాయణం", "కాంభోజరాజు కథ', "మానవుడు –దానవుడు", "చెల్లెలి కాపురం", డాక్టర్ బాబు', సోగ్గాడు', "బాబు", "రాజా", "మొనగాడు", 'మల్లెపూవు', 'జేబు దొంగ', జూదగాడు", "ధర్మపీఠం దద్దరిల్లింది","మహరాజు" మొ. నవి.

మా హీరోగారి అభిమానిగా నేను ప్రజాసంక్షేమ కార్యక్రమాలలో పాల్గొనడం, రక్త దానం చేయడం జరిగింది

ఎప్పటి లాగానే మా హీరోగారు అన్ని రకాల చిత్రాలలో నటిస్తూ, ఆంధ్రుల అభిమానాన్ని చూరగొంటూ ఉన్నత శిఖరాలను అధిరోహించాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నాను

**–పి. భాస్కరరావు నాయుడు, కందుకూరు**

★ ★ ★

**అ**లనాటి మహానటి సావిత్రి, మొన్నటి కళా అభినేత్రి వాణిశ్రీ స్థానాన్ని ఆక్రమించుకున్న అందాలనటి "సుహాసిని" అని ప్రత్యేకముగా చెప్పనక్కరలేదు కొత్త జీవితాలతో ప్రారంభమైన నటజీవితం అనతి కాలంలో సిరివెన్నెల వరకు ప్రతి చిత్రంలో తన




పాత్రలకు జీవం పోసి ప్రజల హృదయాలలో ఒక తిరుగులేని స్థానాన్ని సంపాదించుకున్న నటి సుహాసిని నటించిన చిత్రాలు తక్కువైనా ప్రతి చిత్రంలో ఆమె నటన మరపు రానిది హావ, భావ ప్రకటనలో తనదంటు ఒక ప్రత్యేక శైలిని ఏర్పరుచుకున్న చక్కని నటి. ఆమె నటజీవితంలో శిక్ష, స్వాతి, మహారాజు, సింధుభైరవి, సిరివెన్నెల చిత్రాలు ఒక్కొక్క మైలు రాయివంటివి ఆమెకు నటనలో సరియైన జోడి శోభన్‌బాబు

నవలా నాయికగా ఆమె నటిస్తే ఆ చిత్రం విజయం సాధించటం తథ్యం జాతీయ అవార్డు గ్రహీత సుహాసినిగార్కి అభిమానిగా నేనిచ్చే సూచన ఏమనగా ఇకనుంచి ఆమె సొంత వాయిస్‌తో మాట్లాడాలని నా అభిలాష

**–గుడ్ల సంజీవరావు, కళ్యాణ సింగుపురం (ఒరిస్సా)**

★ ★ ★

**నా అభిమాన నటుడు ఆంధ్రుల అందాల చందమామ, యువరత్న, యువకిశోర్, నందమూరి బాలకృష్ణ నేటి యువతరం నటులలో ఎన్నో విజయాలను సాధించి ప్రేక్షకుల చేత 'పట్టాభిషేకం' చేయించుకున్న 'ముద్దులకృష్ణయ్య'. 1986లో విడుదలైన చిత్రాలలో అత్యధిక విజయ హారతులు అందుకున్న 'కలియుగ కృష్ణుడు'. 'అన్న దమ్ముల అనుబంధం' చిత్రం చూసిన తరువాత ఆయన నా అభిమాన నటుడైనారు. 'బాలు' నటించిన చిత్రాలలో నాకు ఎక్కువగా నచ్చినది, ప్రేక్షకులు మెచ్చదగినవి- 'పట్టాభిషేకం, ముద్దులక్రిష్ణయ్య,**




**సీతారామ కళ్యాణం, అనసూయమ్మగారి అల్లుడు, దేశోద్ధారకుడు'. ఆయన అభిమానిగా బాలకృష్ణ గారికి నా సలహా ఏమిటంటే కేవలం మసాలా చిత్రాలలోనే కాక వివిధ రకాల పాత్రలు ధరించి అత్యున్నత స్థాయిలో నిలుస్తారని ఆశిస్తున్నాను.**

**–చొక్కర వెంకట రమణ, కె.ఆర్. పురం, సంతకవిటి (శ్రీకాకుళం)**

★ ★ ★

నా అభిమాన అందాల నటుడు, యువ కథా నాయకుడు, డేరింగ్–డాషింగ్ హీరో 'కపిల్ దేవ్'. మొదటి చిత్రం "మాయలాడి"లో అద్భుత మైన నటనను ప్రదర్శించి, తన కంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని, కొత్త బాణీని ఏర్పరచుకొని, ఏ పాత్ర నైన అవలీలగా పోషించే సత్తా కల వాడని నిరూపించు కున్నాడు. 'మంచి మనసులు' మరియు 'లవ్–మాస్టర్' లో అద్భుతమైన నటనను ప్రదర్శించి ప్రేక్షక




హృదయాలలో చెరగని ముద్ర వేయించుకున్నాడు. రానున్న చిత్రాలలో కూడా విజయదంకా మ్రోగించాలనీ కోరుచున్నాను కేవలం మాస్ చిత్రాలకే పరిమితం కాకుండా, కథాబలం గల, సెంటి మెంట్ చిత్రాలలో నటించి సూపర్ స్టార్ కావాలని ఆకాంక్ష

–యస్. బషీర్ అహ్మద్, వెయ్యి దీపాలు, మద్రాస్. □

# అందరు వనితలు మంచి చాయతో వుండగలరా ?




భారతదేశంలో ప్రప్రథమంగా, ఇమామి మీకోసం సమర్థవంతంగా, పనిచేసే మంచి చాయనిచ్చే క్రీమ్ తీసుకువస్తోంది. ఇది సూర్యరశ్మి వలన చర్మం నల్లబడకుండా కాపాడుటే కాకుండా చర్మము నల్లబడుటకై కారణమైన యితర చర్మ పరిస్థితులను చక్క పరుస్తుంది.

ఇమామి నేచురల్లీ ఫెయిర్.

సహజమైన సూర్యరశ్మిని నిరోధించే తెర వున్న ఒకేఒక మంచిచాయనిచ్చే క్రీమ్. యిది వెలుపలనుంచి పనిచేస్తుంది. లోపల బాగా పని చేసే సహజమైన మూలపదార్థాలు కూడా వున్నాయి. ఇది మీకు నిజంగా, నిరపాయంగా, తప్పకుండా మంచి చాయ తెస్తుంది.

**సూర్యరశ్మి ఏ విధంగా మీ చర్మాన్ని నల్లబరుస్తుంది ?**

సూర్యరశ్మిలో అపాయకరమైన అల్ట్రా-వైలెట్ కిరణాలు వున్నాయి. వీటికి గురయితే మీ చర్మపు పైభాగం నల్లబడడానికి అవకాశం వుంది.

**నేచురల్లీ ఫెయిర్ వెలుపలనుంచి నల్లబడకుండా ఏ విధంగా నిరోధిస్తుంది ?**

సాటిలేని సహజమైన సన్‌ఫిల్టర్ గొడుగులాగ పనిచేస్తుంది. సూర్యుని అల్ట్రా-వైలెట్ కిరణాల చెడు ప్రభావం నుంచి చర్మాన్ని కాపాడుతుంది. చర్మపు పైభాగం మరింత నల్లబడకుండా నిరోధించి మిమ్మల్ని మంచి చాయతో వుంచుతుంది.

**ఏ ఇతర కారణాల వలన లోపలనుంచి నల్లబడటం జరుగుతుంది ?**

సూర్యుడు ఒక్కడే చర్మానికి శత్రువు కాదు. ఎప్పుడూ ఇంటిలోపలే వున్నా మీరు నల్లగా వుండవచ్చు లేక యింకా నల్లబడవచ్చు. అది ఎందుకనగా నల్లబడటానికి మరెన్నో చర్మసంబంధమైన కారణాలు వున్నాయి.

నీరు పోవుట మరియు ఆహారలోపము, చారలు మరియు ముడతలు.

ప్రతిదినం పనులు మరియు అలసట మూలంగా మృదుత్వము మరియు శరీరకాంతి తగ్గుతాయి.

మొటిమలు, దద్దుర్లు, పగుళ్లు, చర్మము ముడతలు పడటం వంటి పలురకాల చర్మ వ్యాధులు.

**నేచురల్లీ ఫెయిర్ లోపల ఏవిధంగా పని చేస్తుంది ?**

మరియే ఇతర మంచిచాయనిచ్చే క్రీమ్ మీచర్మం లోపల నుంచే నల్లబడటానికి కారణమైన చర్మ పరిస్థితులను చక్కబరచలేదు. ఒక్క నేచురల్లీ ఫెయిర్ మటుకే స్వచ్ఛమైన, సహజమైన మూలపదార్థముల సాటిలేని కలయికతో వుంది. చర్మపు లోపలి

# ప్రకృతి సిద్ధమైన సాటిలేని శ్రద్ధతోనే సాధ్యము.




# నేచురల్లీ ఫెయిర్

## మంచి చాయనిచ్చే క్రీమ్

పారలను అభివృద్ధి వరుస్తుంది. లోపలినుంచే సహజమైన, ఆరోగ్యవంతమైన ప్రకాశాన్ని తిరిగి తీసుకు వస్తుంది.

**చర్మసంపద పెంచడానికి పాలు :** ఆహార లోపము నిరోధిస్తుంది. నున్నని, మీగడవంటి శరీరపు చాయను తెస్తుంది.

**సహజంగా అదుపులో వుంచే దోసకాయ :** చర్మాన్ని బిగుతుగా వుంచుతుంది. ఎండిపోయిన గీతలు, ముడతలు పడకుండా నివారిస్తుంది. చర్మాన్ని యవ్వనపు చాయలు పోకుండానూ, నిత్య నూతనంగానూ వుంచుతుంది.

**సహజంగా శుభ్రపరచే కొబ్బరినీరు :** ఎండ వలన ఏర్పడిన మట్టి రంగును, మచ్చలను కడిగి వేస్తుంది. తేమపోకుండా కాపాడుతుంది. చర్మం మృదుత్వాన్ని, మెరుపుని తిరిగి తెస్తుంది.

**తీవ్రసంరక్షణకై ఆయుర్వేద మూలికలు :** ప్రముఖ ఆయుర్వేద నిపుణులు సిఫార్సుచేసినవి. ఈ మూలికలు శరీరపు చాయని సహజంగా మెరుగు పరుస్తాయి. అవి నల్లని, అనారోగ్యకరమైన చాయని యిచ్చే మొటిమలు, దద్దుర్లు మొదలైన వాటిని పోగొట్టే వైద్య లక్షణాలు కలిగివున్నాయి.

**నేచురల్లీ ఫెయిర్ మిక్కిలి శక్తివంతమైన నేటి మంచిచాయనిచ్చే క్రీమ్**

నేచురల్లీఫెయిర్ మిక్కిలి శక్తివంతమైన నేటి మంచిచాయనిచ్చేక్రీమ్.ఇది శరీరపు చాయ బయట నుంచి, లోపల నుంచి నల్లబడకుండా ఆపదమేకాకుండా చర్మానికి సహజమైన మూల పదార్థములతో పోషణ కలిగిస్తుంది.

**నేచురల్లీ ఫెయిర్ అన్నివిధాలా సురక్షితమైనది**

సహజమైన మూలపదార్థములు చేరివుండడంతో నేచురల్లీ ఫెయిర్ సున్నితంగా పనిచేసి, మీ చర్మానికి హాని కలిగించదు. అయితే, మీ చర్మానికి పడక పోతే లేక మీ చర్మం మరీ సున్నితమైనదయితే మీకు మొదట కొద్దిగా దురద పెట్టినట్లు అనిపించ వచ్చు అయితే అది వెంటనే తగ్గిపోతుంది. అలా తగ్గకపోతే దయచేసి దానిని వాడటం మానివేయండి.

**ఇందులో చేరినవి :**

| సన్ ఫిల్టర్లు | | |
|---|---|---|
| పాలు | : | 3.0% |
| దోససారం | : | 3.0% |
| చిరంజీ సారం | : | 0.2% |
| సౌస్సురియాలప్పా సారం | : | 0.5% |
| కొబ్బరి నీరు | : | 1.0% |
| ఆల్కహాలు | : | 0.5% |

**నేచురల్లీ ఫెయిర్ ఎలా, ఎప్పుడు వాడాలి**

ప్రారంభంలో 'తీవ్రసంరక్షణ క్రీమ్'గా వాడాలి అ తర్వాత మీ మంచి చాయని కాపాడే చికిత్సాక్రీమ్‌గా ఉపయోగించాలి.

నేచురల్లీ ఫెయిర్ రోజుకి రెండుసార్లు ఉపయో గించండి. రాత్రి మరియు బయటకు వెళ్ళడానికి ముందు లేక ఉదయమూ. మీ ముఖము, మెడ, చేతులు నీటితో కడుక్కోండి. అంతటా నేచురల్లీ ఫెయిర్ మెల్లగా, గుండ్రంగా రాయండి. అతితక్కువ వ్యవధిలో, కొద్దివారాలలోనే మీ చర్మం మంచి చాయని పొందుతుంది. ఆరోగ్యంగానూ, ఎంతో మృదువుగానూ వుంటుంది. యవ్వనాన్ని పొందినట్లు కనిపిస్తుంది.



# మీకు మంచి చాయ నిస్తుంది. సురక్షితంగా. తప్పకుండా. సహజంగా.



[illegible] మహాసిని, బాలకృష్ణ

## బాలకృష్ణ, నవదర్శకునితో సురేష్ ప్రొడక్షన్స్ 24వ చిత్రం

ఆద్యంతం వినోదభరిత చిత్రం. ఫిబ్రవరి 1 నుండి 10 వరకు ఊటీలో మొదటి షెడ్యూల్ జరిగింది అక్కడ ఒక రాక్షస గడియారం సెట్‌ను నిర్మించాం కూడా మార్చి 1 నుండి 10 మళ్ళీ 25 నుండి ఏప్రిల్ 10 వరకు హైదరాబాద్‌లో షెడ్యూల్స్ ఈ చిత్రం ద్వారా వై నాగేశ్వరరావును డైరెక్టర్‌గా పరిచయం చేస్తున్నాం, అన్నారు సురేష్ ప్రొడక్షన్స్ అధినేత డి రామానాయుడు ఈయన నిర్మిస్తున్న 24వ చిత్రంలో బాలకృష్ణ రజని సత్యనారాయణ గొల్లపూడి మారుతీరావు, నూతన్‌ప్రసాద్ రాళ్ళపల్లి శ్రీవిద్య పాల్గొంటున్నారు పరుచూరి సోదరుల రచన, ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సంగీతం ఎస్ గోపాలరెడ్డి ఛాయ రఘు నృత్యాలు, మార్తాండం కూర్పు నిర్వహిస్తున్నారు

# సినిమా విశేషాలు

-శ్రీ.వి.శ్రీ

## ప్రభాకరరెడ్డి దర్శకత్వంలో "మండలాధీశుడు"

పదవీధరుల నిరంకుశత్వం సమాజంలో ఎలా కొనసాగుతూందో, దానికి అంతమెప్పుడో తెలియజేస్తూ అంతర్లీనంగా విమర్శలు వ్యాఖ్యలు ఉంటాయి ఒక పాత్రికేయుడు ఉద్యోగి, విద్యార్థి సమాజంలో ఎన్నెన్ని సమస్యలను ఎదుర్కొంటారో వారికి తల్లి ఎలా దారి చూపిస్తుందో మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని విధంగా చిత్రీకరించాం తల్లిగా డాక్టర్ భానుమతీ రామకృష్ణ విజృంభించారు అలాగే మండలాధీశుడుగా కోట శ్రీనివాసరావు మహోన్నత శిఖరాలను అందుకున్నారు," అన్నారు డాక్టర్ ఎం ప్రభాకర రెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో డాక్టర్ డి ఎ ఎన్ రాజు నిర్మించిన వర్మా ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో జమున విజయచందర్ ఈశ్వరరావు కిశోర్ త్యాగరాజు సాక్షి రంగారావు, సారథి, సంగీత, అరుణ, రాజ్యలక్ష్మి ప్రత్యేక పాత్రలలో గుమ్మడి ప్రభాకరరెడ్డి ఉప్పుగంటి లక్ష్మణరావు నటించారు జాలాది గీతాలు రాజ్-కోటి సంగీతం సత్తిబాబు ఛాయ భాస్కరరాజు శిల్పం జ్యోతి ప్రసాద్ – విజయకృష్ణ ప్రొడక్షన్ సత్యనారాయణ – నాగేశ్వరరావు వెంకటరత్నం సంకలనం సాంబశివరావు– శ్రీనివాసరావు సహకార దర్శకత్వం నిర్వహించారు

## కృష్ణ, కోదండరామిరెడ్డి కాంబినేషన్‌లో రమా ఫిలిమ్స్ చిత్రం

మార్చి నుండి షూటింగ్ అన్నారు ఏ కోదండ రామిరెడ్డి ఈయన దర్శకత్వంలో కైకాల సత్యనారాయణ సమర్పణలో కృష్ణ నటించే మూడవ చిత్రంలో రాధ సత్యనారాయణ గిరిబాబు గొల్లపూడి నూతన్‌ప్రసాద్ వేలు వీరభద్రరావు, రాళ్ళపల్లి శ్రీలక్ష్మి ఆదిగా గల వారు పాల్గొంటారు సత్యానంద్ సంభాషణలు చక్రవర్తి సంగీతం, ఎస్ సుధాకరరెడ్డి ఛాయ భాస్కరరాజు శిల్పం సాహుల్ సాహసాలు నాగేశ్వరరావు – సత్యం కూర్పుతో కె నాగేశ్వరరావు నిర్మాత

## సత్యానంద్ దర్శకత్వంలో "ఝాన్సీరాణి" రెండో షెడ్యూల్

ఫిబ్రవరి 23 నుండి 28 వరకు రెండో షెడ్యూల్ జరిగింది మార్చిలో పది రోజుల పాటు మూడవ షెడ్యూల్ ఉంటుంది సత్యానంద్ స్క్రిప్టు రాస్తున్నప్పుడే ప్రతి షాట్‌నూ ముందే ఊహించుకుంటారు గనుక ఎంతో త్వరితంగా, సంతృప్తికరంగా తీస్తున్నారు ఈ చిత్రం విడుదలయాక ఈయన డైరెక్టర్‌గా కూడా బిజీ అయిపోవచ్చునేమో!" అన్నారు శ్రీ రాజ్యలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ అధినేత మిద్దె రామారావు ఈయన నిర్మిస్తున్న ఈ చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, భానుప్రియ కోట శ్రీనివాసరావు వేలు వీరభద్రరావు శ్రీలక్ష్మి వగైరా నటవర్గం మల్లాది వెంకటకృష్ణమూర్తి మిస్టర్ వి' నవల ఆధారంగా తెరకెక్కే ఈ చిత్రానికి చక్రవర్తి సంగీతం, డి డి ప్రసాద్ ఛాయ, సాయి కుమార్ శిల్పం సలీం నృత్యాలు, ఎన్ వెంకటేశ్వరరావు-ఉదయ్ ప్రొడక్షన్, డి వెంకటరత్నం కూర్పు తెర వెనుక హంగులు

## ఈరంకి శర్మ దర్శకత్వంలో హరి రామ జోగయ్య చిత్రం "అగ్ని పుష్పం"

"నిజామాబాద్ జిల్లా చౌటుపల్లి గ్రామంలో ఫిబ్రవరి 2వ వారంలో ప్రారంభించిన షూటింగ్ మే మొదటి వారంలో పూర్తవుతుంది." అన్నారు శాసన సభ్యులు మాజీ మంత్రి చేగొండి హరిరామజోగయ్య ఈయన సమర్పించే జూపిటర్ ఫిలిమ్స్ వారి ఈ చిత్రంలో శుభాకర్ రాజీవ్ పి ఎల్ నారాయణ రాళ్ళపల్లి సీత, లక్ష్మి, మహిజ దేవి పాత్రధారులు డి ప్రభాకర్ మాటలు ఆత్రేయ పాటలు ఎం ఎస్ విశ్వనాథం సంగీతం బి ఎస్ లోకనాథ్ ఛాయతో సి హెచ్ నర్సింహారావు డి బుద్ధావతారం రాజు నిర్మాతలు జి ఎస్ రాజు ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ ఈరంకి శర్మ దర్శకుడు

చక్రవర్తి లో చిరంజీవి భానుప్రియ



# సినిమా

## క్రాంతికుమార్ దర్శకత్వంలో సుహాసిని నటించే "గౌతమి"

వినూత్నమైన కథాంశం పాత్రలకు తగ్గ కళాకారులు టైటిల్ వగైరాలన్నీ ఎన్నుకోవడంలో విజ్ఞత ప్రదర్శించి మహిళాభ్యుదయకరమైన చిత్రాలను నైపుణ్యంతో రూపొందిస్తారు గనుకే క్రాంతికుమార్ చిత్రాలంటే ప్రేక్షకులు ఎంతో ఆత్రుతతో ఎదురు చూస్తుంటారు ఆ కోవకు చెందిన మరో చిత్రాన్ని ఆయన దర్శకత్వంలో 'వేమన చరిత్ర' అందించిన రాధా మాధవ ఫిలిమ్స్ అధినేత మండవ గోపాలకృష్ణ నిర్మిస్తున్నారు ఫిబ్రవరి 16 నుంచి 22 వరకు రాజమండ్రిలో మొదటి షెడ్యూల్ జరిగింది సుహాసిని శరత్‌బాబు వై విజయ విజయరంజని పి ఎల్ నారాయణ తనికెళ్ళ భరణి నవ నటుడు రవి జె వి సోమయాజులు పి జె శర్మ శుభలేఖ సుధాకర్ గౌరవ పాత్రలో షావుకారు జానకి పాల్గొంటున్నారు గణేష్ పాత్రో మాటలు సీతారామ శాస్త్రి పాటలు ఎస్ పి బాలసుబ్రహ్మణ్యం సంగీతం రామచంద్రసింగ్ శిల్పం హరి అనుమోలు ఛాయ శివశంకర్ నృత్యాలు మునిలాల్ ప్రొడక్షన్ తమ్ముడు సత్యం నిర్వహణ కృష్ణంరాజు కూర్పు నాగేంద్ర సంయుక్త దర్శకత్వంతో వేటూరి సత్యనారాయణ ప్రొడక్షన్ డిజైనర్ గౌతమి పాత్రను విశిష్టమైన రీతిలో తీర్చి దిద్దడానికి ఉత్తర భారతంలో నిష్ణాతుడైన రూపశిల్పి సరోష్ మోడీని ప్రత్యేకంగా నియమించాం తదుపరి షెడ్యూల్స్ మార్చి 16–25 ఏప్రిల్ 11–20 అని తెలిపారు డైరెక్టర్ క్రాంతికుమార్

## ఆకాశ దీపాలు

శ్రీసత్య అన్నపూర్ణా మూవీస్ వారు "ఆకాశ దీపాలు అనే వర్ణచిత్రాన్ని తీయసంకల్పించారు మార్చిలో ఉగాది పర్వదినాన రికార్డింగ్‌తో ప్రారంభమయ్యే ఈ చిత్రంలో ప్రముఖ నటీనటులతో పాటు క్రొత్త నటీనటులు నటిస్తారు

పూర్తి కుటుంబ కథాచిత్రము గల ఈ చిత్రానికి స్వర్గీయ దర్శకుడు శ్రీ ఆదుర్తి సుబ్బారావు వద్ద అనేక చిత్రాలకు అసోసియేట్ దర్శకుడుగా పని చేసిన నందూరి సూరిబాబు కథ, మాటలు, స్క్రీన్‌ప్లే దర్శకత్వం నిర్వహిస్తున్నారు సంగీతం శ్రీ యస్ యస్ ప్రకాష్ నిర్మాత జి వెంకట్రావ్ ఈయన దర్శకత్వంలోనే "ప్రేమవిజయం" అనే చిత్రం విడుదలకు సిద్ధంగా వుంది



"మువ్వ గోపాలుడు"లో విజయశాంతి, శోభన



ఫిబ్రవరి 15న మంగళగిరిలో "ఇదా ప్రపంచం" షూటింగ్ ప్రారంభంలో ముత్యాల సుబ్బయ్య ఆర్. రామారావు యోగి కెమెరా స్విచ్చాన్ చేస్తున్న కె జగదీష్ ప్రసాద్ వై అనిల్‌బాబు వై హరికృష్ణగార్లని చిత్రంలో చూడవచ్చు

## వై హరికృష్ణ సారథ్యంలో "ఇదా ప్రపంచం"

అప్పటికీ ఇప్పటికీ మా అందరిలో ఒకరయిన టి కృష్ణ ఏ లక్ష్యంతో చిత్రాలు రూపొందించారో అదే పద్ధతిలో మా కృష్ణ చిత్ర సంస్థ ప్రయోజనాత్మకమైన చిత్రాలు తీస్తూనే ఉంటుంది ఈ చిత్ర కథ ముప్పావు భాగం రైల్వే ప్లాట్‌ఫాం పైనే నడుస్తుంది అందుకు మంగళగిరి స్టేషన్‌ను ఎన్నుకున్నాం ఫిబ్రవరి 15న షూటింగ్ ప్రారంభించాం. అక్కడే మార్చి 20 వరకు షూటింగ్ జరుగుతుంది కొన్ని సన్నివేశాలు విజయవాడ చుట్టు పక్కల కూడా చిత్రీకరింప బడతాయి అన్నారు ప్రముఖ పంపిణీ దారులు వై హరికృష్ణ ఈయన సారథ్యంలో వై. అనిల్‌బాబు నిర్మిస్తున్న ఫై చిత్రంలో రాజశేఖర్, శరత్‌బాబు వేలు కన్నడ నటుడు చంద్రు, సాక్షిరంగారావు శ్రీహరిమూర్తి వెంకట్రావ్, సాయికుమార్ రమణారెడ్డి నర్రా చిట్టి ప్రసాద్, గరగ, పొట్టి ప్రసాద్, జీవిత, అన్నపూర్ణ, రెండు

## సినిమా

"అడవిలో అర్ధరాత్రి"లో నూతన నాయిక స్వాతి



విశిష్టమైన పాత్రలను సరిత శివకృష్ణ నిర్వహిస్తున్నారు ఎం వి ఎస్ హరనాథరావు కథ మాటలు రాశారు సి నారాయణరెడ్డి జాలాది వంగపండు వెన్నెలకంటి గీతాలకు చక్రవర్తి స్వరకర్త ఆర్ రామారావు ఛాయ సోమనాథ్ శిల్పం ప్రకాష్ - సురేఖ నృత్యాలు యోగి సంయుక్త దర్శకత్వం కె వెంకటేశ్వరరావు- బి శ్రీనివాస్ సహకార దర్శకత్వం గంగాధరరావు - వై మోహన్ - ప్రసాద్ ప్రొడక్షన్ యలమంచిలి చిన్నబ్బాయి నిర్మాణ నిర్వహణతో ముత్యాల సుబ్బయ్య దర్శకుడు

## కృష్ణ దర్శకత్వంలో ఆయన కుమారులతో రెండు చిత్రాలు

కృష్ణ దర్శకత్వంలో మహేష్‌తో పద్మావతి ఫిలిమ్స్



సెక్రటరీ! నా కాల్‌షీట్సు ఎప్పుడు ఖాళీగా వున్నాయో చెప్పు పెళ్లి చేసుకోవాలి'

సూర్య నారాయణబాబు మే 21 నుంచి నిర్మించే చిత్రం అనంతరం కృష్ణ రమేష్‌ల కాంబినేషన్‌లో పద్మాలయా స్టూడియోస్ పతాకంలో జి హనుమంతరావు నిర్మించే చిత్రం అక్టోబర్‌లో ప్రారంభమై డిసెంబర్‌కు పూర్తవుతుంది ఇది 1988 జనవరి 14న సంక్రాంతి కానుకగా విడుదలవుతుందని నిర్వహణ బాధ్యతలు వహించే జి ఆదిశేషగిరిరావు తెలిపారు

## శోభన్‌బాబు, కోడి రామకృష్ణలతో రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ చిత్రం

జైలుపక్షి - అనంతరం కోడి రామకృష్ణ దర్శకత్వంలో శోభన్‌బాబు నటించే మరో వెరైటీ చిత్రాన్ని రాఘవేంద్ర సినీ క్రియేషన్స్ అధినేత కందేపి సత్యనారాయణ నిర్మిస్తారు ఆగస్టులో చిత్రీకరణ మొదలవుతుంది

(74 వ పేజీ చూడండి)

# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**ఎ. సుధాకర్ (24 సం. లు), హైదరాబాద్**

ప్ర : సుగర్ ఉన్నది. రోజు ఇంజక్షన్ తీసుకొంటాను.

జ : బైద్యనాథ్ మధుమేహారి యోంగ్ మరియు బైద్యనాథ్ బసంతకుసుమాకరరస ఉదయం సాయంత్రం వాడండి. మూత్రము ఎక్కువగా అవుతున్నచో బైద్యనాథ్ బహు మూత్రాంతకరసతో వాడవచ్చును

**ఆర్. కృష్ణ, ఖాజీపేట**

ప్ర : నేను సన్నగా ఉన్నాను ఉబ్బసము ఉన్నది లావుకావాలి?

జ : బైద్యనాథ్ శ్వాస చింతామణి బృహత్ 1.50 గ్రా బైద్యనాథ్ శ్వాసకు తారరసతో 12 గ్రా కలిపి నూరి 20 మోతాదులు చేసి ఉదయం సాయంత్రం తేనె తులసీరసంతో వాడండి బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ రోజు రెండుసార్లు వాడండి

**ఆర్. రవి, రేణిగుంట**

ప్ర : మూత్రము గంజివలె తెల్లగా గడ్డలుగా పోవును

జ : బైద్యనాథ్ గోక్షురాది గుగ్గులు 1 మాత్ర. బైద్యనాథ్ చంద్రప్రభావటి 1 మాత్ర. బైద్యనాథ్ ఫథరీనా 1 మాత్ర. రోజుకు రెండు సార్లు బైద్యనాథ్ శారిబాద్యాసవతో వాడండి

**బి. అనిల్‌కుమార్, పాలకొల్లు; పి. నిర్మలకుమార్, హైదరాబాద్**

ప్ర : హస్తప్రయోగం. నరముల బలహీనత

జ : బైద్యనాథ్ విటాఎక్స్ రెండు టాబ్లెట్లు చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్‌తోను, భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట రోజు రెండు సార్లు వాడండి చెడు అలవాట్లు నిషేధము

**పి. పద్మజ, ఫిరంగిపురం**

ప్ర : నోటి పూత, అన్నంకూడా తినలేరు

జ : మలబద్ధకము లేకుండా చూసుకోవాలి. రాత్రి పరుండ పోవునపుడు బైద్యనాథ్ త్రిఫలా చూర్ణం 2 చెంచాలు గోరు వెచ్చని నీటితో తీసుకోవాలి ఉదయం సాయంత్రం బైద్యనాథ్ లఘు సూత శేఖరరస, బైద్యనాథ్ సూతశేఖరరస బైద్యనాథ్ సురక్తాస్ప్రాంగ్‌తో వాడాలి ప్రతిరోజు ఉదయం సాయంత్రం బైద్యనాథ్ ఇరిమేదాది తేల్ నోటిలో పూతగా రాయాలి

**క్రిష్ణమూర్తి, మదనపల్లి**

ప్ర. ఫిస్టులాకు, మొలలకు ఔషధం

జ : బైద్యనాథ్ సప్తవింశతి గుగ్గులు 2 మాత్రలు చొప్పున ఉదయం సాయంత్రం బైద్యనాథ్ సురక్తాస్ప్రాంగుతో వాడవలెను. తేలిక సాత్వికాహారము మంచిది

**టి. జయంతి, గుంటూరు**

ప్ర : ఎలర్జీ, వెంట్రుకలు నల్లబడుటకు.

జ : బైద్యనాథ్ లఘుసూత శేఖరరస 2 మాత్రలు బైద్యనాథ్ రక్తదోషాంతక టాబ్లెట్ 1 మాత్ర బైద్యనాథ్ సురక్తాస్ప్రాంగ్‌తో వాడండి తలనూనెగా బైద్యనాథ్ మహాభృంగరాజ తేల్ ఉపయోగించండి

**బి. చంగల్వరాయన్, మద్రాసు**

ప్ర. కేటరాక్టుకు ఔషధము?

జ : ప్రతి రోజు రాత్రి నిదురించుటకు ముందు బైద్యనాథ్ చంద్రోదయ వర్తి తేనెతో అరగదీసి కండ్లకు పెట్టండి గుణము కలుగును

**జి. రాజేశ్వరమ్మ, సి. హెచ్. మాధవరం**

ప్ర : విపరీతమైన శ్లేష్మముతో కూడిన దగ్గు

జ : బైద్యనాథ్ శ్వాస చింతామణి 1 50 గ్రా బైద్యనాథ్ తాలీసాది చూర్ణం 30 గ్రా 20 మోతాదులు ప్రతిరోజు ఉదయం సాయంత్రం తేనె తమల పాకు లేక తులసీ రసంతో సేవించాలి. బైద్యనాథ్ కాసామృత రోజు 2 లేక 3 సార్లు తేలిక ఆహారము మంచిది

**వి. వి. చౌదరి, వల్లూరు; పి. శ్రీలత, మచిలీపట్నం**

ప్ర : కంటి చూపురావటానికి

జ : కళ్ళ డాక్టరుగారిని సంప్రదించితే మంచిది బైద్యనాథ్ మహాత్రిఫలఘృతం వాడితే మంచిది

**కె. యు. బి. రావు, అనకాపల్లి**

ప్ర : నరముల బలహీనత, గుండె దడ, ఆయాసము

జ : బైద్యనాథ్ విటా ఎక్స్ బైద్యనాథ్ చ్యవనప్రాశతో ఉదయం సాయంత్రం పాలతో మరియు భోజనం తరువాత బైద్యనాథ్ అశ్వగంధారిష్ట 2 నెలలు వాడండి తేలిక గా జీర్ణమయే బలమైన ఆహారం తీసుకోవాలి

**ఎం. ప్రభావతి, హనుమకొండ**

ప్ర : నా పళ్ళ చిగుళ్ళు ఒదులుగా, మెత్తగా దూరమైనట్లు ఉండును. మరియు ఉబ్బుట, నెత్తురు కారుట

జ : మీరు బైద్యనాథ్ వారి ఎర్ర పండ్ల పొడి, దంత వేష్టారి ఉపయోగించవలెను పండ్లపొడిలో 5 చుక్కలు దంత వేష్టారి వేసి తోముకోవలెను, మరియు బైద్యనాథ్ చ్యవన్‌ప్రాశ్ స్పెషల్ ఉదయం 2 చెంచాలు పాలతో తీసుకోవలెను బైద్యనాధ్ చంద్రకాంత్ రసం రోజుకు ఒక మాత్ర చొప్పున 40 రోజులు వాడవలెను బైద్యనాథ్ మహా భృంగరాజ్ కేశతైలం (మెడికేటెడ్) శిరోజములు ఊడిపోకుండా ఉండటానికి వాడవలెను

**మహమ్మద్ జాకీర్, మెట్ల చిత్తాపూర్, కరీంనగర్**

ప్ర : నాకు మెడలోని కండరములు, లేక నరములు గుంజటం, నెప్పిగా ఉండును. ఈ బాధకు తల త్రిప్పినచో, లేక నోరు తెరచినచో కొంచెం బాధ తగ్గును దీనికి మందు చెప్పగలరు

జ : మీరు తలకింద దిండు వేసుకొని పరుండవలెను బైద్యనాధ్ బృహత్‌వాత చింతామణి, వాతారీన, కాంచనార గుగ్గులు రోజుకు 3 మాత్రలు చొప్పున 40 రోజులు వాడవలెను నొప్పి ఉన్నచోట బైద్యనాథ్ రుమా ఆయిల్ మర్దన చేయవలెను

**ఎం. అప్పారావు, కొత్తపేట, విజయవాడ**

ప్ర : మా అబ్బాయికి పోలియో వచ్చినది సరిగ్గా నడవటంలేదు మందు తెలుపగలరు

జ : మీ అబ్బాయికి బైద్యనాథ్ మహా మాషతైలం, బైద్యనాథ్ మహానారాయణ తైలం, బైద్యనాథ్ నేర్గుండ తైలం ఈ మూడు నూనెలో కలిపి మాలిష్ చేయవలెను

బైద్యనాధ్ బృహత్‌వాత చింతామణి 3 గ్రా బైద్యనాథ్ అభ్రక భస్మ సహస్రపుటి 3 గ్రా బైద్యనాథ్ వాతాగ్నికుమార్ రస 3 గ్రా ఈ మందులు నూరి 40 పొట్లములు చేసి తేనెతో ఉదయం 40 రోజులు సేవించవలెను ☐

---

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

ప్రశ్న : ..................

..................

..................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

సీరియల్

# అన్యాయం



యం. యస్. ఆర్. చౌదరి

(గత సంచిక తరువాయి)

ఇంతలో

జీప్ వచ్చి ఆ ఇంటి ముందాగిన శబ్దమయింది

"హంతకుడు ఇంకా ఇంట్లోనే ఉన్నాడు సర్ ఎవరో చెప్పున్నారు వచ్చిన పోలీసులతో

"లోపలికి వెళ్ళి వార్ని అతడు హత్య చేయటం నేను కళ్ళారా చూశాను. అతడిని లోపలే ఉంచి తలుపు గొళ్ళెం వేసి మీకు ఫోన్ చేశాను" అంటున్నాడు అతను

తలుపులు తెరిచారు.

పోలీసులు, ఎస్ పి నందనరావు ఆ బిల్డింగ్‌లోనికి ప్రవేశించారు

ఎదురుగా విజయ్ కనిపించాడు వారికి

"విజయ్ నువ్వు . ఇక్కడ"

"సర్! ఇక్కడేదో హత్య జరుగుతుందని ఫోనొచ్చింది నేనొచ్చేసరికే ఇక్కడ ఘోరం జరిగిపోయింది. ఎవరో తలుపులు బిగించారు" చెప్పాడు విజయ్

"లేదు సర్ అతడే వార్ని చంపటం నేను కళ్ళారా చూశాను" అన్నాడు వాళ్ళతో ఉన్న వ్యక్తి

"కానిస్టేబుల్స్ విజయ్‌ను అరెస్ట్ చేయండి"

"సర్ . నేను "

"నో! ఇంకేమి చెప్పదలుచుకొన్నా కోర్టులో చెప్పుకో" అంటూ బేడీలు తగిలించారు విజయ్ చేతికి

ఎస్ పి నందనరావు ముందు నడుస్తున్నాడు విజయ్‌ను కానిస్టేబిల్స్ తీసుకొస్తున్నారు

అటూ ఇటూ చూసి ప్రక్కకు పరుగు లంకించుకొన్నాడు విజయ్

"విజయ్ ఆగు ఆగు"

ఆగే ఉద్దేశ్యం లేనట్లు పరుగెత్తుతున్నాడు విజయ్

"విజయ్ ఆగు లేకుంటే కాల్చి పారేస్తాను" అన్నాడు నందనరావు

"సర్. ఎవరో నన్ను అన్యాయంగా ఈ నేరంలో ఇరికించారు వారి అంతు చూసి, నేను నిర్దోషిగా ఋజువయ్యేవరకు మీకు దొరకను" అన్నాడు విజయ్

విజయ్? అంటూ రివాల్వర్ తీశాడు నందనరావు

కాని వెంటనే అతనికి నర్మద గుర్తుకొచ్చింది ఇంకా వారం రోజులలో జరుగబోవు వారి పెండ్లి గుర్తుకొచ్చింది

"కానిస్టేబుల్స్- పరుగెత్తండి విజయ్‌ను పట్టుకోండి" అంటూ విజయ్ వెంట పరుగెత్తాడు నందనరావు

కానిస్టేబుల్స్ కూడా పరుగెత్తారు విజయ్‌ను పట్టుకోవటానికి

విజయ్ పరుగెత్తుతూ ఒక బిల్డింగ్ కాంపౌండ్ గోడ దూకి బిల్డింగ్‌లోనికి ప్రవేశించాడు

డోర్ దగ్గరకు వెళ్ళి డోర్‌ను దబదబా బాదాడు

డోర్ తెరచుకొంది

ఎదురుగా ఆనంద్

"విజయ్ ఏమిటిది?" ప్రశ్నించాడు కంగారుగా ఆనంద్

"ముందు లోపలికి పద పోలీసులు తరుముతున్నారు" అన్నాడు విజయ్ కంగారుగా

విజయ్‌ని లోపలికి తీసుకెళ్ళి తలుపులు బంధించాడు ఆనంద్

విజయ్ లోపలికెళ్ళటం నందనరావు చూడనే చూశాడు

"విజయ్ ఏం జరిగింది. పోలీసులు నిన్ను వెంటాడటం ఏమిటి"?

జరిగిందంతా చెప్పాడు విజయ్

ఆలోచనలో పడ్డాడు ఆనంద్

"ఇదంతా చూస్తుంటే చిదానందం పన్నిన పన్నాగం లాగుంది" అన్నాడు

"చిదానందమా?'

యస్

* * * * *

ఇంతలో బయట నుంచి నందనరావు గారి గొంతు వినపడింది

'విజయ్ సరెండర్ సరెండర్ యువర్‌సెల్ఫ్"

లోపలి నుంచి ఎటువంటి సమాధానం రాలేదు

విజయ్ ఈ బిల్డింగ్ చుట్టూ పోలీసులు కాపలా ఉన్నారు నువ్వు తప్పించుకొని పోలేవు సరెండర్ యువర్‌సెల్ఫ్'

ఇంతలో

తలుపులు తెరుచుకొన్నాయి

విజయ్ బయటకు వచ్చాడు

నందనరావుకి లొంగిపోయాడు విజయ్.

విజయ్‌ని తీసుకొని స్టేషన్‌కి బయలుదేరాడు నందనరావు

తెల్లవారేసరికి ఈ వార్త కార్చిచ్చులా నగరమంతా పాకి పోయింది దిన పత్రికహెడ్ లైన్స్‌లో చోటు చేసుకుందీ వార్త

**హంతకుడిగా మారిన ఇనస్పెక్టర్ విజయ్‌కుమార్, కాబోయే మామగారైన ఎస్. పి. నందనరావుచే అరెస్ట్!**

**హంతకుడిగా మారిన ఇనస్పెక్టర్ విజయ్‌కుమార్ అరెస్ట్!**

డిసెంబర్ 12 ఇంకొక వారం రోజుల లోపల పెండ్లి కాబోతున్న ఇనస్పెక్టర్ విజయ్‌కుమార్, హంతకుడిగా మారి పాత కక్ష్యలతో ఒక నూతన దంపతుల జంటను ఘోరంగా హత్య చేసినందుకు గాను కాబోయే మామగారయిన ఎస్ పి నందనరావుచే అరెస్ట్ చేయబడ్డాడు ఈ కేసు రేపు (13వ తేది) హియరింగ్‌కు వస్తుంది.

ఈ వార్త అన్ని ప్రముఖ దిన పత్రికలలోను ప్రకటించ బడింది

* * * * *

ఆ రోజు.....

విజయ్ కేసు హియరింగ్‌కొచ్చింది.

హియరింగ్ వినటానికి వచ్చిన వారితో కోర్టు కిటకిటలాడి పోతోంది.

**జరిగిన కథ –7 :** సలీం, జావేద్‌లు గణేశ్‌ను చంపేస్తారు విజయ్ ఎస్ ఐ అవుతాడు. వజ్రాల స్మగ్లింగ్ సమాచారం అంది విజయ్ అక్కడికి వెళ్ళేసరికి అక్కడ స్నేహితుడు ఆనంద్ ఉంటాడు. విజయ్ తమ్ముడు రాజేష్‌ను చిదానందం కొడుకు రంగా హత్య చేసి దొంగ సాక్ష్యాలతో నిర్దోషిగా విడుదలవుతాడు ఆనంద్ ఇచ్చిన సమాచారం మీద విజయ్ చిదానందానికి చెందిన గంజాయి లారీ పట్టుకుంటాడు గంజాయి స్థావరాన్ని కనుక్కొనేందుకు విజయ్ అడవిలోకి వెళ్ళి అక్కడ ఒక గిరిజన యువతి సాయంతో స్థావరాన్ని కనిపెడతాడు. పోలీసులు ఆ స్థావరంపై దాడి చేసి అందరినీ అరెస్టు చేస్తారు విజయ్‌కి రక్షించమంటూ ఒక ఫోన్ పిలుపు రావడంతో వెళ్ళి ఒక పాడుబడిన భవనంలో రెండు శవాలతో పాటు ఓ గదిలో చిక్కుబడతాడు

సుందరమ్మ, సుమతి, సుమిత్రమ్మ, నర్మద అందరూ కోర్టుకు వచ్చారు ఎవ్వరి మొఖంలోను మచ్చుకైనా ఆనందం కనపడటం లేదు సుందరమ్మ అయితే మరీ దెబ్బతిన్న మనిషిలా తయారయింది ఉన్న ఇద్దరు కొడుకుల్లో ఒకడు ఎప్పుడో పోయాడు ఇంకొకడు హంతకుడిలా, ముద్దాయిలా నిలబడ్డాడు

తట్టుకోలేక పోతుంది సుందరమ్మ తల్లి హృదయం

సుమతి అయితే మరీ పసిపిల్లలా విలపిస్తుంది

జడ్జిగారు వచ్చారు

విజయ్‌ను బోనులోనికి ప్రవేశపెట్టారు

"మిస్టర్ విజయ్! మీరు ఆ ఇంటిలోనికి వెళ్ళి ఆ నూతన దంపతులను చంపారని మీపై అభియోగం మోపబడింది అందుకు మీరేమంటారు?"

మౌనంగా ఉన్నాడు విజయ్

"సమాధానం చెప్పండి?"

'. . .

మిస్టర్ విజయ్! మీరు మౌనంగా ఉంటే మీ మౌనం అంగీకారం అనుకోవాల్సి వస్తుంది. మీరు ఆ హత్యలు చేశారని ఒప్పుకొంటున్నారని అనుకోవాల్సి వస్తుంది నోరు విప్పండి అన్నాడు జడ్జి

'మీరు ఏవిధంగానైనా అనుకోండి" అన్నాడు విజయ్

అతడి గొంతు గద్గదంగా, విషాదంగా జీరబోయి నట్లుంది

"యువర్ ఆనర్ ఈ కేసులో శవాలను పోస్టుమార్టమ్ చేసిన డాక్టర్ వేణుగోపాలరావు గార్ని, ఫింగర్ ప్రింటర్ శంకరరావు గార్ని సాక్ష్యం చెప్పటానికి పర్మిషన్ ఇవ్వవలసిందిగా కోరుతున్నాను" అభ్యర్థించాడు పబ్లిక్ ప్రాసిక్యూటర్

యస్ పర్మిషన్ గ్రాంటెడ్ పర్మిష నిచ్చాడు జడ్జిగారు

డాక్టర్ వేణుగోపాలరావు బోనులోనికి వచ్చాడు

"హత్యకు ముందు ఆ యువతి రేప్ చేయబడింది రేప్ జరిగినందుకు సాక్ష్యంగా ఆ యువతి శరీరంపై గాయా లున్నాయి తరువాత పొత్తి కడుపులో బలంగా కత్తితో నాలుగుసార్లు పొడవటం వల్ల ఆ యువతి మరణించింది. అలాగే ఆ యువకుని పొత్తి కడుపులోను నాలుగు గాయాలున్నాయి' అని చెప్పాడు డాక్టర్

తర్వాత ఫింగర్ ప్రింటర్ శంకరరావు బోనులోనికి వచ్చాడు.

"ఆ యువతి శరీరంపైనున్న వ్రేలి ముద్రలు, కత్తి పిడిపై నున్న వ్రేలి ముద్రలు, విజయ్‌గారి వ్రేలి ముద్రలు మొత్తం ఒకటే" అంటూ హత్యాయుధాన్ని, రిపోర్ట్‌ను జడ్జిగారికి అందజేశాడు శంకరరావు.

విజయ్ గొంతుదాకా ఇరుక్కుపోయాడు ఆ కేసులో.




"యువర్ ఆనర్, అధికారం తన చేతిలో ఉంది కదాని, తను ఏం చేసినా ఎవ్వరూ అడిగేవారు లేరని పాతకక్షలవల్లో లేక మరే కారణం చేతనో విజయ్ వార్ని చంపాడు. ఇప్పుడు సాక్ష్యాధారాలతో పట్టుబడేసరికి ఏమీ మాట్లాడలేక, తప్పించుకొనే మార్గంలేక, నోరు విప్పకుండా, మౌనంగా ఉన్నాడు. కాబట్టి ఈ కేసులో పూర్వాపరాలు ఆలోచించి ముద్దాయిని తగు రీతిలో శిక్షించవలసిందిగా కోర్టువారిని కోరుతున్నాను" అంటూ పబ్లిక్ ప్రాసిక్యూటర్ కూర్చున్నాడు.

అందరూ జడ్జిగారి వైపు తిరిగారు. తీర్పు ఏమి చెబుతాడో ని అందరూ ఎదురు చూస్తున్నారు.

జడ్జిగారు గొంతు సవరించు కొన్నారు.

"ఈ హత్య కేసులో ముద్దాయి మౌనాన్ని బట్టి, వ్రేలిముద్రల ఆధారంగా ఈ హత్యలు చేసినాడని ఋజువైంది. ఏ కారణంగానో, ఈ హత్యలు చేసిన ముద్దాయి మౌనముద్ర వహించాడు. బాధ్యతాయుతమైన పదవిలో ఉండి, ఇటువంటి ఘోరమైన హత్యలు తలపెట్టినందుకు గాను ముద్దాయికి ఐపిసి 302 సెక్షన్ క్రింద

# ఆశయం

ఉరిశిక్ష విదించడ మైనది"

ఉరిశిక్ష    కోర్టంతా నిశ్శబ్దమైంది ఆ తీర్పుతో

ఇంతలో గాలరీలో హా' అంటూ సుందరమ్మ పడిపోయింది

మరుక్షణమే సుందరమ్మ ప్రాణాలు అనంతవాయువుల్లో కలిసి పోయాయి

సుమతి బావురుమని ఏడవసాగింది ఇటు తల్లి మరణం, అటు అన్నయ్యకు ఉరిశిక్ష– వీటన్నింటి మధ్య ఆమెకు పిచ్చి పట్టేటట్లు ఉన్నది

ఇంత జరుగుతున్నా రాయిమాదిరిగా ఉన్నది నర్మద ఒక్కతే

ఆమెకు జరుగుతున్నదంతా కలమాదిరిగా అనిపిస్తుంది

విజయ్‌ను పోలీసులు పట్టు కెళ్ళారు, సుందరమ్మ శవాన్ని చూసిన తరువాత

పోలీసులు దగ్గరుండి మరీ విజయ్ చేత దహన సంస్కారాలు జరిపించారు

* * * * *

"విజయ్ నీ కోసం ఎవ్వరో వచ్చారు?" జైలు సెంట్రీవచ్చి చెప్పాడు విజయ్‌కు

"ఇప్పుడు నా కెవ్వరినీ చూడటానికి ఇష్టం లేదు అన్నాడు విజయ్

"నీ చెల్లెలంట బాబూ ఎంత చెప్పినా వినటం లేదు

' అయితే రమ్మను

సెంట్రీ వెళ్ళి సుమతిని, నర్మదను వెంటబెట్టు కొచ్చాడు

"అన్నయ్యా' అంటూ బావురుమంది సుమతి విజయ్‌ను చూడగానే

"విజయ్    ఎందుకిలా చేశావు?" ప్రశ్నించింది నర్మద

నర్మద మొఖం ఎన్నో లంఖణాలు చేసిందాని మాదిరిగా పీక్కుపోయి ఉంది మొఖంలో ప్రేతకళ తాండవిస్తోంది ఎక్కడో నూతిలోంచి మాట్లాడినట్లుగా వినిపిస్తోంది ఆమె గొంతు

విజయ్ ఏం సమాధానం చెప్పలేదు

"విజయ్ మౌనంగా ఉండటానికి ఇది కోర్టు కాదు నోరు విప్పు

"ఏం చెప్పను?'

"జరిగింది చెప్పు

"చెప్పటానికి ఏముంది? నేను నిర్దోషిని. నన్ను అన్యాయంగా ఈ హత్యలో ఇరికించారు." విజయ్‌కి దుఃఖంతో నోట మాట రావటం లేదు. గొంతు పూడుక పోయింది. గొంతు అదో రకంగా జీరబోయింది.

"ఈ విషయం కోర్టులో ఎందుకు చెప్పలేదు."

లాభం లేదు చెప్పినా నమ్మరు ఎందుకంటే సాక్ష్యం లేదు కనుక

అంటే నీ తోడబుట్టినందుకు సుమతికి, నిన్ను ప్రేమించినందుకు చివరకు మాకు మిగిలేది ఈ కన్నీరేనా?

"అలా ఎందుకనుకోవాలి నా జీవితం ఎలాగూ నాశనమయింది మీరైనా సుఖంగా ఉండండి వేరే వ్యక్తిని పెళ్ళాడు' అన్నాడు విజయ్

'ఎంత సులభంగా అన్నావు? విజయ్' నువ్వు చనిపోయిన తరువాత ఈ నర్మద బ్రతికే ఉంటుందనుకొన్నావా?'

'నర్మదా' అంత పని మాత్రం చేయకు?

'నువ్వు లేని ఈ లోకంలో నేను జీవించలేను విజయ్ అంది నర్మద ఏడుపు గొంతుతో

నర్మదా' నేను ఒక్క కోరిక కోరతాను తీరుస్తావా?

ఏమిటో చెప్పు విజయ్

"నా ఉరి అనంతరం నువ్వు ఏం చేయదలుచుకొన్నా ఆనంద్‌తో సంప్రదించి చెయ్యి లేకపోతే నా ఆత్మ శాంతించదు" అన్నాడు విజయ్

అంతలో సెంట్రీ వచ్చి"అమ్మా టైమయింది"అన్నాడు

"వస్తాం విజయ్    పద సుమతి వెళదాం" అంది నర్మద

* * * * *

నర్మద బెడ్‌పై పడుకొని ఉంది

ఈ రెండు రోజులలో నే నర్మద చిక్కి సగం అయ్యింది

ఎంత కాలంగానో ప్రేమించి, ఎదురు చూసి ఎదురు చూసి ఆఖరి క్షణంలో    వివాహం ఇంకా వారం రోజులుందనగా ఇలా జరగటంతో అయోమయంగా ఉంది నర్మదకు

దాదాపు అన్నం, నీళ్ళు ముట్టటం మాని వేసింది

నర్మదే కాదు సుమిత్రమ్మ, సుమతిల పరిస్థితి కూడా అలానే ఉంది.

సుమతి తల్లి చనిపోయినప్పటి నుంచి వీళ్ళ దగ్గరే ఉంది

ఆ ఇంట్లో అటూ, ఇటూ తిరుగుతూ గుండె రాయి చేసుకొని మామూలుగా ఒక్క నందనరావుగారే కనిపిస్తున్నారు

నర్మదా' రామ్మా భోం చేద్దాం' అప్పటికి గంట నుంచి బ్రతిమిలాడుతునే ఉన్నాడు నందనరావు.

"నాన్నా! ఈ పరిస్థితులలో నాకు ఆకలి వేయటం లేదు". అంది నర్మద.

"అలా అంటే ఎలా అమ్మా. ఆ విజయ్ రాత అలా రాసి ఉంది. మన మేం



# రు. 1000 బహుమతులు

# ఆంధ్రపత్రిక దినపత్రిక

# ఫొటోగ్రఫీ పోటీ !

ఆంధ్రపత్రిక దిన పత్రిక మొదటి పేజీలో వేసేందుకు ఫొటోగ్రఫీ పోటీ ఒకటి నిర్వహిస్తున్నాము. ఛాయా చిత్రకారులు ఉత్సాహంతో ఈ పోటీలో పాల్గొని ఆంధ్రపత్రిక తెలుగు వారి నిత్య జీవితాన్ని ప్రతిబింబించటానికి చేసే ప్రయత్నాలని మరింత విజయవంతం చేయగలరని ఆశిస్తున్నాము.

మొదటి బహుమతి రు. 250

రెండవ బహుమతి రు. 200

మూడవ బహుమతి రు. 150

నాలుగవ బహుమతి రు. 100

ఇవే కాకుండా రు. 50 చొప్పున 6 ప్రత్యేక బహుమతులు!

## గడువు తేదీ : 15-4-1987

## నిబంధనలు

1. పోటీకి నలుపు– తెలుపు చిత్రాలనే పంపాలి. రంగుల చిత్రాలు పంపరాదు.
2. ఛాయా చిత్రాలు తెలుగు వారి సంస్కృతిని ప్రతిబింబింప చేసేవిగా ఉండాలి. ఏ ప్రాంతం వారైనా ఛాయా చిత్రాలు పంపవచ్చు. ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు మాత్రం ఈ పోటీలో పాల్గొనరాదు.
3. ఛాయా చిత్రాలు దిన పత్రికలో అడ్డంగా వేయడానికి వీలుగా ఉండే సైజులో పంపితే మంచిది. పోటీకి ఒక్కొక్కరు 3 చిత్రాలకన్నా ఎక్కువ పంపరాదు.
4. బహుమతి పొందిన ఛాయా చిత్రాలనే కాక యోగ్యమైన వాటిని మరి కొన్నింటిని కూడా వీలునిబట్టి ప్రచురించగలము.
5. ప్రచురణార్హం కాని ఛాయా చిత్రాలను తిప్పి పంపగోరేవారు తగిన తిరుగు టపా ఖర్చు జత చేయవలసి ఉంటుంది. ఈ ఛాయా చిత్రాలను తిప్పి పంపే విషయంలో తగిన జాగ్రత్తలు తీసుకోవడం జరుగుతుంది కాని పోస్టులో ఒక వేళ అవి తప్పి పోయినా లేక దెబ్బ తిన్నా మా బాధ్యతలేదు.
6. పోటీకి పంపే ఛాయా చిత్రాలు మా కార్యాలయానికి ఏప్రిల్, 15 నాటికి అందాలి. ఆ తరువాత వచ్చే వాటిని స్వీకరించడం జరగదు.
7. పోటీకి పంపే ఛాయా చిత్రాలను సంపాదకుడు, ఆంధ్రపత్రిక దినపత్రిక, గాంధీనగరం, విజయవాడ – 520 003 అన్న చిరునామాకి పంపాలి. వ్యక్తుల పేర పంపరాదు. కవరు పై భాగంలో "ఆంధ్రపత్రిక దినపత్రిక ఫొటోగ్రఫీ పోటీకి" అని స్పష్టంగా రాయాలి.
8. పోటీకి పంపే ఛాయా చిత్రాల వెనుక వైపు అది తాము స్వయంగా తీసినదే అని హామీ రాస్తూ దానికి సంబంధించిన సాంకేతిక వివరాలని కూడా పేర్కొనడం అవసరం.
9. పోటీ విషయంలో తుది నిర్ణయం సంపాదకునిదే. పోటీలో పాల్గొనే వారందరూ దీనికి బద్ధులై ఉండాలి. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకి తావు లేదు.

–సంపాదకుడు

# ఆశయం

చేస్తాం చెప్పు"

"నాన్నా అదే నా పెళ్ళి అయిపోయిం తర్వాత ఇలా జరిగితే ఏం చేసే వాళ్ళు?"

"నీతో పాటే మేమూ బాధపడుతూ కూర్చొనే వాళ్ళం. నీ అదృష్టం బాగుంది కాబట్టి, గండం గడచి పోయింది"

"నాన్నా ఇప్పుడు శారీరకంగా విజయ్‌తో నా పెళ్ళి కాకపోయినా మానసికంగా విజయ్‌తో నాకు ఏనాడో పెళ్ళి జరిగి పోయింది పెద్ద అదికారంలో ఉన్నారు విజయ్‌ను కాపాడలేరా?"

"అతను అసలు నోరు విప్పి జరిగిన విషయం చెబితే గదా నాకు అసలు విషయం తెలిసేది అతను మౌనంగా ఉన్నంత వరకు నేను ఏమీ చేయలేను" అన్నాడు నందనరావు.

'అంతేనంటారా?' ఆమెకు ఏడుపొస్తున్నట్టుంది

"అంతేనమ్మా మనం చేయగల్గింది ఏమీ లేదు' అన్నాడు నందనరావు

* * * * *

'విజయ్' పిలిచాడు జైలు సూపరింటెండెంట్ రంగారావు

వాట్ సార్?" అంటూ వచ్చాడు విజయ్

విజయ్ మొహం వైపు చూసి తలదించుకొన్నాడు రంగారావు

"సందేహిస్తారేం! చెప్పండి సార్?' అన్నాడు విజయ్

"సారీ! నేను చెప్పటానికి చాలా బాధపడు తున్నాను కానీ చెప్పక తప్పదు మీ ఉరి విషయంలో ఫైనల్ ఆర్డర్స్ వచ్చాయి. ఎల్లుండి తెల్లవారు ఝామున 4 గంటల 19 నిముషాలకు మిమ్మల్ని ఉరి తీస్తారు" చెప్పాడు రంగారావు ఆ వార్త చెబుతుంటే జైలర్ గొంతు వణుకుతూ ఉంది

రంగారావు తన సర్వీసులో ఎంతో మందికి ఈ వార్త చెప్పాడు కాని ఇప్పుడు ఈ వార్త చెబుతున్నాడంటే దానికో ప్రత్యేకత ఉంది

ఇదివరకు చాలామంది ఉరికంబం ఎక్కారంటే వారు హంతకులు, గూండాలు కాని ఇప్పుడు ఉరికంబం ఎక్కుతున్నది నిజాయితీ గల ఆఫీసర్‌గా పేరు పొందిన ఒక పోలీస్ ఇనస్పెక్టర్

'చావు తప్పదు అని తెలిసిన తరువాత అది ఎప్పుడైతేనేం' అన్నాడు నిర్లిప్తతగా విజయ్

అంతకన్నా నరకం ఇంకొకటి లేదు

తనకు గ్యారంటీగా ఇంకొక రోజులో చావు మూడిందని ఖచ్చితంగా తెలిసిన తరువాత ఆ వ్యక్తి మానసికంగానే కృంగి కృశించి అనుకొన్న టైంకన్నా ముందే చనిపోతాడు

రంగారావు బాధగా విజయ్ వైపు చూసి నిట్టూరుస్తూ వెళ్ళిపోయాడు

"సార్! మీకు చావంటే బయం లేదా? ప్రశ్నించాడు సెంట్రీ విజయ్ వంక ఆశ్చర్యంగా చూస్తూ

బయపడితే ఆగిపోదు అని తెలిసిన తరువాత ధైర్యంగా ఆహ్వానించాలి గాని బయపడటం దేనికి?' అన్నాడు విజయ్

మనిషిని మనిషి చంపితే అది నేరం ఆ మనిషిని ప్రభుత్వం చంపితే అది శిక్ష

చావు ఒకటే అయినా పరిణామాలు వేరు, మనిషిని నేరం చేస్తే జైల్లో వేసేది వాడు చేసిన నేరం ఎంత బయంకరమైనదో తెలుసుకొని ప్రాయశ్చిత్తం చేసుకోవాలని గాని, ఒక్కసారే మరణించాలని గాదు

అందుకనే ప్రపంచంలోని చాలా దేశాలు ఎప్పుడో ఉరి శిక్షను రద్దు చేశాయి

నుదుట కళ్యాణ తిలకం దిద్దుకోవాల్సిన వాడు ఉరికంబం ఎక్కాల్సి వస్తోంది

నలుగురితో కళకళ్ళాడుతూ ఉండాల్సిన రోజు స్మశాన నిశ్శబ్దం ఆవరించుకొని ప్రేతాత్మలా ఒంటరిగా ఉరికంబం వైపుకు

వాట్ ఎ పిటీ ఇటీస్

(ఇంకా ఉంది)

# రాతిముక్క

గన్ను కృష్ణమూర్తి




ఆదొక క్వారీ. ఒకవైపు మరలు, మరొక వైపు మనుష్యులు. చెవులు చిల్లులు పడేలా రొద! మరలు మనుష్యులౌతోంటే, మనుష్యులు మరలౌతున్నారు. పర్వతాలని పిండి చేస్తున్నారు.

పర్వతాలు బండలుగా, బండలు రాతి ముక్కలుగా, రాతిముక్కలు రేణువులుగా మారి, మంటగలిసిపోతున్నాయి. భూమట్టమై పోతున్నాయి.

పర్వతాలు విరిగి పడుతోంటే భూమ్యాకాశాలు వద్దరిల్లుతున్నాయి. దిక్కులు పిక్కటిల్లుతున్నాయి. కానీ మనిషి చలించడం లేదు. అతని కన్ను చెమర్చడంలేదు. చేయి చివురు తొడగడం లేదు.

ఈ మారణకాండలో సమ్మెట దెబ్బకి విరిగిపడ్డ ఓ రాతి ముక్క బాధతో విలవిలా తన్నుకుంది. వలవలా ఏడ్చింది.

దాని బాధని ఎవరూ పట్టించుకోలేదు. దాని ఏడుపుని ఎవరూ వినిపించుకోలేదు. దాని రోదన అరణ్య రోదనైపోయింది.

ఐనా అది ఏడుపు మానలేదు. గుక్కపెట్టి ఏడ్చింది. వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ మృగప్రాయపు మనుష్యుల మధ్య!

ఇంతలో ఓ కర్కశపాదం దానిపై బడింది. దాన్ని తొక్కిపెట్టింది. గొంతుని నొక్కిపెట్టింది.

ఏమైతేనేం? ఎలాగైతేనేమి, అది ఏడుపు మానింది.

ఎవరిదో కాలి బొటన వ్రేలు తగిలి, కొండ అంచునుండి గలగలా దొర్లి, కళ్ళుతిరిగి, రోడ్డు మీద వెల్లకిలా పడిపోయింది. స్పృహ తప్పి పడిపోయింది.

దాన్ని ఎవరూ చూడ్డంలేదు! ఎవరూ పట్టించుకోడం లేదు.

అందరూ దాన్ని త్రొక్కుకుంటూ వెళ్తున్నారు! దాటుకుంటూ వెళ్తున్నారు!

ఒకనాడు భూమిని తన తలపై మోసిన పర్వతం నేడు మనుష్యుల కాళ్ళ కిందబడి నలుగుతోంది. ఒనాడు నక్షత్రాలతో ముచ్చటించిన ఆ కొండ నేడు రాతి ముక్కై మట్టిలో దొర్లుతోంది. ఒకనాడు కొండలా నిల్చిన ఆ కొండ, నేడు గాలికి సైతం కంపించి పోతోంది.

క్షణాలు నిముషాలయ్యాయి. నిముషాలు గంటలయ్యాయి. ఆ రాతిముక్క తేరుకుంది. ప్రక్కనే ఉన్న ఓ గుంటలోంచి గుక్కెడు నీళ్ళు త్రాగింది. తెప్పరిల్లింది.

ఎంత ఆపుదామనుకున్నా దుఃఖం ఆగడం లేదు.

ఒంటినిండా దెబ్బలే! నొప్పులే! పోల్చుకోలేకుండా ఉంది దాని ఆకారం.

దానికి గత వైభవం లీలగా గుర్తుకు రాసాగింది. దుఃఖం మరింత పొర్లుకు రాసాగింది.

ఎవరితో చెప్పుకోవాలి?

ఏమని చెప్పుకోవాలి?

ఇలా తన జాతి అస్తమించి పోవాల్సిందేనా? మంట గలిసి పోవాల్సిందేనా? దాని గుండెల్లో ప్రశ్నలు సముద్ర కెరటాల్లా లేవసాగాయి. అవమానం కార్చిచ్చులా దహించి వేయసాగింది.

వీల్లేదు. అలా ఎన్నటికీ వీల్లేదు. నేనంతమైనా

# ఒక్క క్షణము

ఊహల నావలో ఎక్కి
ఆశల సముద్రం దాటి
ఆనందాల పర్వతం ఎక్కాను

ఆవల తీరంలో –
సాహిత్యపు స్వర్గం కనిపించింది
మెల్లగా కాలం లాంటి దొంగలా
అక్కడికి వెళ్ళాను

చేతిలో కర్ర,
ఊగుతున్న తల –
ఎవరు నువ్వు", అంటూ పలుకరించాడు
నిన్న మొన్న పుట్టిన వాడ్ని
చిరునామా లేని వాడ్ని
ఎలా చెప్పుకోను? ఏమని చెప్పుకోను?"

ఓహో ( .సరస్వతీ మానస పుత్రుడవా?
అవును సరస్వతి చాలా గొప్పది
అసలు సరస్వతీ – అంటే – ప్రవాహం
ప్రవాహం అనగా. " అంటున్న
కవి సామ్రాట్టును గుర్తించి
కదిలిపోయాను – క్షణం కూడ నిలువకుండా

తెల్లపాంటు –
గళ్ళచొక్కా – కళ్ళజోడు
'ఎవరు నువ్వు అన్నాడు
"సామాన్యుడ్ని – కవిని, రవిని –
భారవిని"

"ఓహో – తెలిసింది
మా కులం వాడివే –
రా, కదలిరా –

పెరుగుతున్న ధరల్ని
భూ మార్గం పట్టించు
భూకంపం పుట్టించు' – అంటున్న
మహా కవి మాటలు వింటూనే
మరింత ముందుకు కదిలిపోయాను

చక్రాల బండిలో – లుంగి –
చుట్ట కాలుస్తున్నాడు
నన్ను చూసి చూడగానే

'రావోయి – నీలాంటి వాళ్ళే
స్త్రీల సమస్యలు పరిష్కరించాలి
స్త్రీ వొక మహాశక్తి – అంటున్న
అరుణా చలం – చలం గారేనని బావించి
మౌనంగా – నే కదిలిపోయాను

తెల్ల పంచె – తెల్ల చొక్కా
అదే రంగు జుట్టు
నన్ను చూడగానే లేచి వచ్చి,
కౌగలించుకొని,
ముక్క కూడ చెప్పకుండా
కన్నీటిని కారుస్తున్న
భావ కవి భావన అర్థమైంది

ఆయన గారి ఊర్వశిని పట్టుకొద్దామని
ఆయన చిరకాల వాంఛ తీరుద్దామని
అనుకుంటుండగానే

రెక్కలు మొలుచుకొచ్చి
చిత్రంగా – సినిమాలో లా
ఆకాశంలో తేలి పోతున్నా

ఏమండి? మిమ్మల్నే' అన్న
శ్రీమతి పిలుపుతో
రంగు రంగుల కల చెదిరిపోయింది
ఆ ఒక్క క్షణం కరిగిపోయింది

–'యమ్మెస్సార్'

# రాతి ముక్క

ఫరవాలేదు కాని నా జాతి అంతం కాకూడదు నామరూపాల్లేకుండా పోకూడదు దేవునికే నివేదించుకుంటాను నిలదీసి అడుగుతాను– అనుకుంది ప్రయాణానికి నడుంకట్టింది

అడవుల్లోంచి ఎడారుల్లోంచి, పల్లెలు, పట్నాల లోంచి వెళ్తోంది దొర్లుతూ వెళ్తోంది వగర్చుతూ వెళ్తోంది

దానిపైనుంచి సైకిళ్ళు, రిక్షాలు, కార్లు, బస్సులు వెళ్తున్నాయి వేగంగా దూసుకు పోతున్నాయి

కానీ, దానివంక ఎవరూ చూడ్డం లేదు పలకరించడం లేదు తమ చేతి నందించడంలేదు దానికి ఒళ్ళంతా చెమట పట్టింది కాళ్ళు పీక్కు పోతున్నాయి కళ్ళు తిరుగుతున్నాయి ఒక మేడ నీడలో కాసేపు విశ్రాంతికై నిల్చింది

ఎక్కడిదో మట్టిపెల్ల! తటాలున తలపై రాలింది' ప్రేలిపోయింది' తల బొప్పికట్టింది' బాధగా తలపైకెత్తి చూసింది

ఆ యింటి పై కప్పు నించి మరో పెల్ల నేల రాలిపడింది కాసై తే మళ్ళీ తలపై బడేదే' తృటిలో ప్రమాదం తప్పింది

ఇంతలో ఏవో మూలుగులు' లీలగా వినిపించాయి' చెవులు రిక్కరించింది నలువైపులా పరిశీలించి చూసింది

తన జాతివాళ్ళే' తన జాతి రాళ్ళే' గోడల క్రింద పునాదుల్లో యిరుక్కుని నలిగిపోతున్నాయి ఆ అంతస్థుల బరువుని మోయలేక మోస్తున్నాయి' బాధగా మూల్గుతున్నాయి'

మనరాతి ముక్క కళ్ళు చెమర్చాయి' గుండెలు కరిగిపోయాయి'

బాధతో అడిగింది–

"ఎంత కాలం నుంచి మీకీ బాధ? ఎందుకు సహిస్తున్నారు మీరిలా?

ఏం చేయమంటావు? మా తలరాతలిలా మిడిశాయి' యిటుకల క్రింద నలిగిపోతున్నాం' సిమెంటు చేతుల్లో బందీ అయి పోయాం! తప్పించుకోలేకుండా ఉన్నాం' పారిపోలేక పోతున్నాం' అన్నాయి

ఇంతకూ మీరు చేసిన నేరం?"

"రాళ్ళుగా జన్మించడమే' అన్నిటినీ సహించడమే!"

"విచారించకండి' నేను దేముడి దగ్గరికే వెళ్తున్నాను మనగోడు వినిపిస్తాను మనజాతి అంతరించకుండా చూడమని నివేదించుకుంటాను.' అంది ఆ రాతి ముక్క

"త్వరగా వెళ్ళిరామ్మా!" అంటూ దీవించి పంపాయవి

ఆ రాతిముక్క మళ్ళీ పడుతూ, లేస్తూ ప్రయాణం సాగించింది

కొంత దూరం వెళ్ళాక–

సిగ్గులేదూ? మాపైనుంచి నడుస్తావు?" అన్న మాటలు వినపడ్డాయి కళ్ళు చిట్లించుకుని చూసింది రాతి ముక్క

అది కంకర రోడ్డు, రోడ్డుమీద పరచబడ్డ రాతి ముక్కలు పలికిన పలుకులవి' గుండెల్లో దిగే ములుకులవి'

మన రాతి ముక్క కించిత్తు బాధపడ్డ మాట వాస్తవమే' కాని తన సాహస యాత్రని గూర్చి వివరించిన మీదట ఆ రాళ్ళు సంతోషించాయి తమ బాధని సైతం దేముడికి విన్నవించమని వేడుకున్నాయి

మరి కొంత దూరం పయనించిన తరువాత దోవలో రోడ్డు ప్రక్కన రంగుల్లో మునిగి భూమిలోకి పాతుకుపోయి నిల్చున్న మైలురాళ్ళు, వంతెనల్ని మోస్తున్న రాతి స్తంభాలు కనిపించాయి కంట తడిపెట్టుకున్నాయి. విషయమంతా విన్నాక–

"మేం కదల్లేం' మెదల్లేం!.... మా బాధని సైతం నువ్వే నివేదించు!" అన్నాయి. అక్కడ నుండి మళ్ళీ కదిలింది రాతిముక్క. మరి కొంత దూరం వెళ్ళాక, భూమిదద్దరిల్లేలా ధ్వనులు, ఏడ్పులు విన్పించాయి'

కళ్ళు చిట్లించుకు చూస్తే ఏముంది' తనలాంటి రాతి ముక్కలే' రోడ్డు రోలరు క్రిందపడి నలిగిపోతున్నాయి' "రక్షించండి' ... రక్షించండి!" అంటూ దీనాతి దీనంగా అరుస్తున్నాయి'

ఒక్కడూ వాటిగోడు విన్నవాడులేడు' చేతినందించిన వాడులేడు'

ఒక్క క్షణమైతే తానుకూడా ఆ రోలరు క్రిందపడి నలిగి నశించి పోయేదే' కాని త్వరగా విషయాన్ని అర్థం చేసుకుని ప్రక్కకి గెంతింది తన జాతికి పట్టిన గతికి కన్నీరు మున్నీరుగా విలపిస్తూ, మళ్ళీ తన ప్రయాణం సాగించింది

ఎంత దూరం వెళ్ళిందో తెలీదు ఎంత దూరం వెళ్ళాలో తెలీదు

కంకరగా, మట్టిగా, రోడ్డు, వంతెనలుగా మారిన రాళ్ళపైనుంచి వెళ్తోంది! పర్వతాలపైన్నించి వెళ్తోంది

తన బ్రతుకుపై తానే నడుస్తూ, తన చరిత్రపై


విజయ్ మిక్సీ
55 నిమిషాలు నిర్విరామంగా
పనిచేయుగలదు.
ఉచితం!
"ప్రతీ విజయ్ మిక్సితో ఒక విజయ్ స్విచ్ ఐరన్ ఉచితం."
ఈ అవకాశం
కొద్ది రోజులు మాత్రమే
Vijay Mixie
Vijay - a friend of your family
JAISONS AMA 687

తానే దొర్లుతూ వెళ్తోంది! రోదిస్తూ వెళ్తోంది!

కాళ్ళు అరిగిపోయాయి! చేతులు విరిగిపోయాయి! తల మొండెంలా, మొండెం తలలా, శరీరం బంతిలా తయారయింది

భూమిపై భూమిలా దొర్లుతూ వెళ్తోంది! పరుగిడుతూ వెళ్తోంది!

దోవలో ఒక గుడిసె ముందు ఒక రోలు, ఒక విసుర్రాయి కనిపించాయి మనరాతిముక్క విషయమంతా వివరించింది

'మాక్కూడా సుఖంలేదు రోజు రోజుకూ చిక్కి శల్యమై పోతున్నాం! కాకపోతే మనుష్యుల కడుపులు నింపుతున్నామన్న సంతృప్తి మాత్రం మిగుల్తోంది" అన్నాయవి

పరిస్థితులతో రాజీపడ్డ జీవితాలు! అంతకన్నా ఏమంటాయి!

వీటితో లాభం లేదనుకుని మళ్ళీ ప్రయాణం కట్టింది రాతిముక్క

మరి కొంతదూరం వెళ్ళాక, దోవలో ఎదురైన ఏట్లో, ఇన్ని నీళ్ళు త్రాగి, సేదదీరి, ఆ ఏటి నీట్లో నలిగిపోతున్న రాళ్ళని అడిగింది–

"నాతో వస్తావా?"

"ఎక్కడికి?" అని ప్రశ్నించాయవి

రాతి ముక్క మళ్ళీ విషయమంతా వివరించింది

"నిజమే! ఈ ఆలోచన మాకురానేలేదు సుమా! ఈ ఏటి నీటి సంగీతములో మునిగి అరిగి పోతున్నాం తప్ప! కరిగి పోతున్నాం తప్ప! నువ్వే వెళ్ళిరా! తిరుగు ప్రయాణంలో ఏమయిందో మాతో చెప్పు' అన్నాయి

పతనాన్నే ప్రగతిగా భావించే జీవితాలు! మృత్యువునే జీవితంగా భావించే జీవితాలు! కష్టాల కొలిమిలో అందంగా మాడిపోయే శలభాలు! అంతకన్నా ఏమంటాయి!

మన రాతి ముక్క మళ్ళీ ప్రయాణం కట్టింది.

మొత్తానికి అతి కష్టం మీద ఒక విష్ణాలయాన్ని చేరుకుంది

ఆ గుడి ఓ చిన్న గుట్టపై ఉంది గుడిపైకి

## ముద్ద

అందమైన ప్రపంచం
రంగు రంగుల ప్రపంచం
వెండి పళ్ళెంలో ఆపిల్
  పండులాంటి ప్రపంచం
మట్టి మూకుడులో సంగటి
  ముద్దలాంటి ప్రపంచం
ఆకలికి చెమర్చిన పేదకుర్రాడి
  కనుగుడ్డులాంటి నున్నటి ప్రపంచం
పంతులుగారి బల్లమీద
  ఇరుసు కమ్మీలో
కుక్కనోట్లో కడిలా చిక్కుకున్న
  గుండ్రని ప్రపంచం
మిఠాయి వుండలా తిరుగుతోంది–
  గిరగిర గిరగిర గిరగిర గిరగిర!

–కలువకొలను సదానంద

## రాతి ముక్క

వెళ్ళడానికి మెట్లున్నాయి మనరాతి ముక్క గుట్టపైకి వెళ్తుంటే మెట్లు పలకరించాయి

'ఎక్కడికీ ప్రయాణం?" అంటూ

తన కథంతా చెప్పుకొచ్చింది రాతిముక్క

అంతా విన్నాక–

"సర్లే వెళ్ళు ఎవరికని చెప్పుకుంటావు? అక్కడుందీ ఓ రాతి ముక్కే! కాకపోతే మనకన్నా కాస్త పెద్ద సైజు!' అంటూ పగలబడి నవ్వాయి

అయినా మన రాతిముక్క ధైర్యం చెడలేదు గుట్టపైదాకా వెళ్ళింద

అక్కడక ఓ రాతిపైన భక్తులంతా కొబ్బరి కాయలు కొడుతున్నారు.

"అందరి విషయం ఏమోకాని నేనుమాత్రం సుఖంగా ఉన్నాను రోజంతా కొబ్బరినీళ్ళు త్రాగుతూ, కొబ్బరి నీళ్ళతో స్నానం చేస్తున్నాను దోసిలి పట్టు! నీకూ ఇన్ని పోస్తాను" అంటూ తీర్థం వడ్డించింది

తీర్థం పుచ్చుకొని, గుడి ద్వారాన్ని సమీపించింది

దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడన్నట్లు గుడి ద్వారానికి ఇరువైపులా కాపలా కాస్తున్న జయ, విజయుల రాతి విగ్రహాలు మన రాతి ముక్కని అడ్డుకున్నాయి. లోనికెళ్ళడానికి వీల్లేదంటూ!

'ఎందుకు?' ప్రశ్నించింది రాతిముక్క.

ఇది మనుష్యులు కట్టించిన గుడి! మనుష్యులకే ప్రవేశం! రాళ్ళకాహక్కులేదు. అన్నాయవి

"ఎవరిచ్చారు మనుష్యులకీ హక్కు? మన జాతిని ముక్కలు చెక్కలుగా చేసే హక్కు? పాతర వేసే హక్కు? నాశనం చేసే హక్కు?" అంటూ గొంతు చించుకుంది

"అదంతా మా కనవసరం! నీవు మాత్రం లోనికెళ్ళడానికి వీల్లేదు!' అన్నాయవి నిష్కర్షగా

చాలాసేపు వాగ్యుద్ధం చేసింది మన రాతిముక్క.

అప్పటికి వచ్చిన భక్త జనులంతా వెళ్ళిపోయారు

విష్ణుమూర్తులవారు తీరిగ్గా ఉన్నారు మనరాతి ముక్క పడుతున్న గొడవని చూసి విషయమేమిటో అర్థంగాక, దాన్ని లోనికి వదలమన్నారు

ఆ రాతికి మనరాతిముక్క పొర్లుడు దండాలు పెడుతూ, లోనికి ప్రవేశించింది. తన గోడునంతా విన్నవించుకుని

"స్వామీ! అన్యధా శరణం నాస్తి! నీవే మా జాతిని రక్షించాలి! అంటూ వేడుకొంది

స్వామివారు మందహాసం చేస్తూ–

"వత్సా! భయపడకు! రాళ్ళన్నీ మాయమైనా, పర్వతాలు, నుగ్గు నుగ్గయినా నీవు చింతించాల్సిన అవసరంలేదు మానవత్వాన్ని కోల్పోతున్న ఈ మనుష్యుల గుండెలన్నీ బండలౌతున్నాయి రాళ్ళుగా మారిపోతున్నాయి. నీ జాతి ఎన్నటికీ అంతరించే ప్రసక్తిలేదు. నిశ్చింతగా వెళ్ళు!" అన్నాడు

అప్పుడు మనరాతిముక్క పరమానందంతో వెనక్కి మళ్ళింది. □






# కోహినూర్



దాటి పోతాను ఈ బాట
రాళ్లమయమైనా సరే కంటకావృతమైనా సరే
నీ చేతిలో నా చేయుంచి వంత చింతలు మఱచి
సాగిపోగలను నిశ్చింతగా ప్రశాంత పవనంలో పయనించే
విహంగంలా
అనురాగం చిందే నీ హృదయం నాకు వేయి విధాల విదితం

**KOHINOOR®**

గులాబీరంగు
సుఖదాయకమైన ల్యూబ్రికేటెడ్
కాండోమ్ ఎలెక్ట్రానిక్
ఉపకరణాలతో పరీక్ష
చేయబడినది




ఇప్పుడు
ఖర్చు ఆదా చేసే
విధంగా ఒకే
ప్యాక్‌లో పది

**ttk** తయారీ

MAA (S) LRC 5 A TEL 86

సీరియల్



# ఆరోహణ

## శైలకుమార్

(గతసంచిక తరువాయి)

**హో**టలుకు చేరుకోగానే మరునాడు తీయబోయే సీన్సు ముందేసుకున్నాడు చక్రవర్తి ఓ చిన్న అనుమానం కలిగింది అతనికి

"కిరీటీ.

'సార్"

"ప్రతి షాట్‌కు క్లాప్ కొడతారు గదా ఎందుకు"

ఎడిటింగ్‌లో ఉపయోగపడేది ఈ క్లాప్ బోర్డే సార్. మనం షాట్సు గాని సీన్‌లు గాని ఒక ఆర్డరులో తీయం కదా ఏ షాటు తరువాత ఏది అని తెలుసుకోవటానికి ఈ క్లాప్ బోర్డే ఆధారం.

అర్థం కానట్టు చూశాడు చక్రవర్తి

"క్లాప్ బోర్డులో మూడు కాలమ్స్ వుంటాయి సార్ మొదటిది సీన్ నెంబరు రెండవది షాట్ నెంబరు మూడవది టేక్ నంబరు"

"ఔను కిరీటీ ఎందుకు మనం షాట్సన్నీ ఒక ఆర్డరులో తియ్యకూడదు"

"సాధ్యం కాదు సార్. అలా తీస్తే ఒక సినిమా పూర్తవటానికి సంవత్సరాలు పడుతుంది. మాటి మాటికి కెమెరాను లైటింగ్‌ను మార్చాలి కదా."

'ఎందుకు" ఇంకా అర్థం కానట్టు అడిగాడు చక్రవర్తి

"ఉదాహరణకి హీరో మోటార్ సైకిల్ మీద వచ్చి హీరోయిన్ ఇంటి ముందు నిలబడి హారను కొడతాడు. ఇంట్లో వున్న హీరోయిన్ హారను విని బయటికి వచ్చి మోటార్ సైకిల్ ఎక్కుతుంది. ఇదే తీయాల్సిన సీన్ అనుకోండి, దీన్ని మూడు షాట్సుగా తీస్తాం అనుకోండి"

బుద్ధిమంతుడైన విద్యార్థిలా తల ఊపాడు చక్రవర్తి.

"హీరోయిన్ ఇంటి ముందు మోటార్ సైకిల్ నిలబడటం మొదటి షాటు. ఇంట్లోంచి హీరోయిన్ రావటం రెండవ షాటు. మోటర్‌సైకిల్ ఎక్కి కూర్చోవటం మూడవ షాటు

"ఊఁ."

"మీరు చెప్పినట్టు తీస్తే మొదట కెమెరా రోడ్డు మీద వుండాలి తరువాత ఇంట్లోకి వెళ్ళి మళ్ళీ బయటికి రావాలి కెమెరా కదలాలి అంటే లైటింగ్ అంతా కదలాలి. లైటింగ్ అరేంజ్‌మెంటుకు గంట పడుతుంది అందుకని ఒకటి, మూడు షాట్సు మొదట రోడ్డు మీద తీస్తారు తరువాత రెండవ షాట్ తీస్తారు ఎడిటింగ్‌లో ఈ ఆర్డరు తెలుసుకోవటానికే క్లాప్ బోర్డు"

"అర్థమైందయ్యా" అన్నాడు అయాసంగా చక్రవర్తి

"కొద్దిగా పుచ్చుకుంటారా" విస్కీ సీసా తీస్తూ అడిగాడు కిరీటి

"వద్దు నువ్వు కానీ"

ఆ కార్యక్రమంలో పడ్డాడు కిరీటి.

"నీకు మానస తెలుసా కిరీటీ' అడిగాడు చక్రవర్తి.

'ఏదీ హీరోయిన్ ఫ్రెండ్ వేషం వేసింది" నవ్వుతూ అడిగాడు

"ఏం సార్."

"ఏం లేదు ఊరికినే."

"హీరోయిన్ కావాల్సింది సార్ పాపం ఎక్స్ట్రాగా మిగిలిపోయింది.'

"బాగా చదువుకుందనుకుంటా"

"ఏమో సార్ డబ్బింగులు కూడా చెబుతుంది. ఎందుకు సార్ అడుగుతున్నారు' కుతూహలంగా అడిగాడు కిరీటి.

"ఏం లేదు."

నవ్వి బాటిల్ పూర్తి చేయటంలో మునిగిపోయాడు కిరీటి.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

రెండవ రోజు షూటింగ్ జరుగుతోంది. మధ్యాహ్నం దాకా హీరో ప్రతాప్ ఒక్కడి మీదే ఎనిమిది షాట్సు తీశాడు త్రిమూర్తి. మధ్యాహ్నం కీర్తన, ప్రతాప్‌ల కాంబినేషన్ షాట్సు తీస్తున్నారు

షాట్స్ మధ్య బ్రేక్‌లో ఫ్లోర్ బయట కూర్చున్నారు త్రిమూర్తి, పార్థసారథి, కీర్తన, ప్రతాప్, చక్రవర్తి. వాళ్ళు కాక ఒక డిస్ట్రిబ్యూటరు, కీర్తనతో వేరే సినిమా తీస్తున్న మరో నిర్మాత, ఎక్స్ట్రాలు అంతా వున్నారు

తరువాతి షాట్ కీర్తన, ప్రతాప్‌లు అనుకోకుండా కలసి మాట్లాడుకోవటం

తీయబోతున్న సన్నివేశాన్ని కీర్తన చెప్పవలసిన డైలాగులను వివరించాడు కిరీటి. డైలాగుల కాగితం ఆమెకు ఇచ్చాడు

"మా నాన్న చేసిందానికి నన్ను తప్పు పడతావా రఘూ. నేను నిన్ను కాదనుకోలేదే. ఆయన చేసిన నేరానికి నన్ను శిక్షిస్తావా. ఆయన చేసిందానికి నీ శరీరమే గాయపడింది. కాని కాని నీ మాటల వల్ల నా మనసెంత గాయపడిందో ఆలోచించావా" అదీ కీర్తన చెప్పవలసిన డైలాగు

ఎవ్వరూ ఊహించని సంఘటన జరిగింది అప్పుడు.

"ఎవరండీ డైలాగులు రాసింది" అడిగింది కీర్తన. చాలా కఠినంగా వుంది ఆమె కంఠం. దూరంగా వున్న వాళ్ళకు కూడా వినిపించింది ఆ మాట. మేకప్ రూము వైపు వెళ్ళబోతున్న మానస ఆగింది ఆ మాట విని.

"చక్రవర్తి అని కొత్త రైటరు. ఈ సినిమాతోనే పరిచయం అవుతున్నాడు ఫీల్డుకు" తాపీగా చెప్పాడు పార్థసారథి.

"ఎందుకండీ మీలాంటి పెద్ద కంపెనీ వాళ్ళు కూడా ఇలా కక్కుర్తి పడతారు" విసురుగా అంది కీర్తన.

అక్కడ వున్న అందరూ వులిక్కి పడ్డారు ఆ మాటలకు. 'కక్కుర్తి' అన్న మాట ముల్లులా గుచ్చుకుంది పార్థసారథి మనసులో.

జరిగిన కథ–13 : నీలిమ ఎడబాటువల్ల కలిగిన నిరాశతో తిరుపతి వదలి మద్రాసు చేరుతాడు చక్రవర్తి కొంత కాలం పాటు చక్రవర్తికి మద్రాసులోనూ నిరాశ, అవమానం. మోసం ఎదురవుతాయి ఆత్మహత్య చేసుకోవాలన్నంత నిస్పృహ లోకి వెళుతున్న చక్రవర్తికి రవి కలుస్తాడు రవి సాయంతో చక్రవర్తికి నిర్మాత పార్థసారథి దగ్గర మంచి అవకాశం దొరుకుతుంది పార్థసారథి తన సినిమాకు కథతో పాటు మాటలు, పాటలు రాయడానికి కూడ చక్రవర్తికే అవకాశం ఇస్తాడు చక్రవర్తి రాసిన సినిమా షూటింగ్ మొదలవుతుంది షూటింగ్ సందర్భంగా చక్రవర్తికి మానస పరిచయమవుతుంది



"ఏమిటి కీర్తనా" అడిగాడు పార్థసారథి కోపాన్ని దిగమింగుకుంటూ.

"డైలాగులు కొత్త రైటర్‌తో వ్రాయిస్తున్నట్లు నాకు ముందే ఎందుకు చెప్పలేదు."

ఆమె డేట్సు తీసుకునేటప్పుడే ఏ శాఖకు ఏ సాంకేతిక నిపుణుడు పని చేస్తున్నాడో ఆమెకు చెప్పటం జరిగింది. కాని తనకేమి తెలీనట్లు ప్రశ్నిస్తోంది కీర్తన.

"ప్రతి విషయం మీకు చెప్పాలా" సీరియస్‌గా అడిగాడు పార్థసారథి. ఆమె అలా మాట్లాడటం ఆయనకు నచ్చలేదు. ఆయనలోని సీరియస్‌నెస్‌కు కలవరపడ్డారు త్రిమూర్తి, చక్రవర్తి, ప్రతాప్.

"అవునండీ కొత్త రైటర్ అని తెలిస్తే నేనీ సినిమా ఒప్పుకునేదాన్ని కాదు. ఇప్పటికైనా రైటర్ని మార్చండి."

ఉలిక్కి పడ్డాడు చక్రవర్తి.

"కీర్తనా" చాలా కఠినంగా వుంది పార్థసారథి కంఠం.

"లక్షలు పెట్టి సినిమా తీస్తున్న వాళ్ళం. మాకు తెలీదా ఏ రైటర్ని తీసుకోవాలో."

"ఏం డైలాగులండీ ఇవి. అర్థం తెలిసే రాశాడా ఆయన. ఇది సినిమా అనుకున్నాడా ఇంకేమైనా అనుకున్నాడా? ఇలాంటి డైలాగులు మాతో చెప్పించటం. తీరా సినిమా ఏదైనా అయితే అదేదో మా తప్పు అన్నట్లు చూట్టం. రీరైట్ చేయించండి డైలాగులు" కాగితాలు చేత్తో నిర్లక్ష్యంగా ఊపుతూ అంది. మహానటిగా తనకు పేరుండటం వల్ల తన మాట కాదనరు అన్న నమ్మకం కీర్తనలో.

ఆ సంఘటన ఏ మాత్రం ఊహించని డైరక్టర్ త్రిమూర్తికి ఏం చెప్పాలో



## ఆరోహణ

తెలియటం లేదు. అవాక్కయి చూస్తూ కూర్చున్నాడు ప్రతాప్. ఇప్పుడిప్పుడే, హీరోగా స్థిరపడుతున్నాడు అతను.. అటు చూస్తే సీనియర్ నటి, ఇటు చూస్తే పెద్ద ప్రొడ్యూసర్ ఎవరి వైపు మాట్లాడాలో అర్థంకాక మౌనంగా వుండిపోయాడు

'కీర్తనా నీ వర్కు నువ్వు చూసుకుంటే బావుంటుంది" తీవ్రంగా అన్నాడు పార్థసారథి

ఆయన అందరి ముందు అలా అనటంతో కీర్తన అహం దెబ్బతింది

సారథి గారూ నేను నటించే ప్రతి సినిమా నా సొంత సినిమాగా భావిస్తాను. నా నిర్మాత నష్ట పోకూడదని, సినిమా బాగా ఆడాలని కోరుకుంటాను రాయటం చాతగాని వాళ్ళతో రిస్కు చేయటం నాకెరీర్‌కే దెబ్బ' అంటూ కుర్చీలోంచి లేచింది కీర్తన.

'మీకీ చెత్త డైలాగులే, ఈ రైటరే కావాలనుకుంటే నన్ను వదులు కోండి" చేతిలో వున్న కాగితాలను విసరికొట్టి విసవిసా నడిచి కారెక్కింది కీర్తన

లైటు బాయ్స్, మేకప్‌వాళ్ళు, ఎక్స్‌ట్రాలు, అసిస్టెంటు డైరక్టర్లు, నిర్మాతలు, డ్రైవర్లు, షూటింగు చూడటానికి వచ్చిన వాళ్ళు అందరూ అవాక్కయి చూశారు ఆ దృశ్యాన్ని

కీర్తన విసరికొట్టిన కాగితాలు సరిగ్గా చక్రవర్తి కాళ్ళదగ్గర పడ్డాయి తల కొట్టేసి నంత అవమానం కలిగింది అతనికి ఆ కాగితాలు చేతిలోకి తీసుకుని ఫ్లోరుకు చాలా దూరంగా వెళ్ళి ఓ చెట్టును ఆనుకుని నిలబడ్డాడు చక్రవర్తి

రణగొణ ధ్వనులతో హడావుడిగా వుండే ఆ ఫ్లోరులో శ్మశాన నిశ్శబ్దం ఆవరించింది

అక్కడున్న వాళ్ళలో ముందుగా తేరుకున్నది పార్థసారథి "ప్యాకప్ చెప్పండి' త్రిమూర్తి వైపు తిరిగి సీరియస్‌గా అన్నాడాయన

ప్యాకప్ చెప్పాడు త్రిమూర్తి అందరూ మౌనంగా వున్నారు ఏం మాట్లాడితే ఏమౌతుందో అన్న భయం వాళ్ళలో.

సామానులు సర్దుకుని ఒక్కొక్క కారే వెళ్ళిపోసాగింది అక్కడ నుంచి ఆ వెళ్ళి పోవటంలో ఎవ్వరూ దూరంగా వున్న చక్రవర్తిని గమనించలేదు

చక్రవర్తి కళ్ళ నిండా నీళ్ళు తిరిగాయి సరిగ్గా శిఖరంమీద అడుగు పెట్ట బోయే క్షణంలో కాలు జారి పాతాళంలో పడిపోయిన పరిస్థితి కడుపులో సుళ్ళు తిరుగుతున్న బాధకు ప్రతిరూపంగా రాలుతున్న కన్నీరు అందరిముందు అంత అవమానం జరిగాక ఇక బ్రతికి ప్రయోజనం ఏమిటి? అలము కోవటానికి సిద్ధంగా వున్న చీకటి ఇక తన జీవితంలో శాశ్వతం అవుతుంది



అయి పోయింది. ఇక తనకు మిగిలిందేమీ లేదు. యుద్ధంలో గెలువ బోతున్న సమయంలో అనుకోకుండా తగిలిన చావుదెబ్బ. ఇన్నాళ్ళూ పెంచుకున్న నమ్మకం ఒక్క క్షణంలో నీటి బుడగలా పగిలి పోయింది.

తనలాంటి కొత్త రచయితకోసం కీర్తన లాంటి మహానటిని ఏ నిర్మాతా వదులుకోడు. ఈ సినిమా కూడా పోయినట్టే. పార్థసారథి కాదన్న తర్వాత ఇక తనని ఏ నిర్మాతా పిలవడు రచయితగా నూకలు చెల్లిపోయినట్టే తనకు. ఇంత కాలంగా రాత్రింబవళ్ళు చేసిన శ్రమ, ఆశగా కన్న కలలు, ఆలోచనల్ని అక్షరాలుగా మార్చటానికి ఆవిరి చేసుకున్న రక్తం, భావ వ్యక్తీకరణకు మస్తిష్కం పడ్డ ప్రసవ వేదన అంతా వృధా.

బాధ, దుఃఖం, కసి, కోపం తన మీద తనకే. ఎందుకిలా జరిగింది అంత తక్కువ స్థాయిలో వుందా తన రచన. ఏం తెలుసని కీర్తన ఆమాట అంది. ఆమె మహానటి కావచ్చు. కాని తన రచనను అంత హీనంగా మాట్లాడే హక్కు ఆమెకు ఎవరిచ్చారు?

కీర్తనపై కోపం, తన అసహాయత పట్ల దుఃఖం శూన్యంలో ఏకాకిగా మిగిలి పోయిన వాడిలా అస్తమించ బోతున్న సూర్యుడిని చూస్తూ అలా ఎంత సేపు నిలుచున్నాడో చక్రవర్తి.

చల్లనిస్పర్శ, మెత్తని స్పర్శ ఆత్మీయత నంతా ఆ చేతిలో నింపుకున్నట్టు అతని భుజాన్ని స్పృశించిన సుకుమార హస్తం

వెనక్కి తిరిగాడు చక్రవర్తి ఎదురుగా మానస

"బాధపడుతున్నారా కవిగారూ" అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ అడిగింది మానస ఎదుటి మనిషిని ఓదార్చే చూపుల తాకిడి

ఆ బాధలో ఆమాత్రం ఆత్మీయంగా ఆమె పలకరించే సరికి అతని కళ్ళు వర్షించాయి

"ఇది చిత్రసీమ సార్! విచిత్రంగా వుంటుంది అందరి ప్రవర్తనా మనిషి ఎదిగే వరకు ఎంతో వేధిస్తారు ఎదిగి పోయాడా వద్దన్నా వెంట పడతారు" ఓదారుస్తున్నట్టు చెప్పింది మానస

"మానసా" అన్నాడు బాధగా

రండి' అతని చేయి పట్టుకుని నడిపించింది దారి చూపుతున్న వ్యక్తిలా మౌనంగా కదిలాడు చక్రవర్తి ఆమె వెంట.

* * * * * * * * * *

డైరక్టర్ త్రిమూర్తి, కళాదర్శకుడు రవి, అసిస్టెంటు డైరక్టర్లు, ప్రొడక్షన్ మేనేజరు, డిస్ట్రిబ్యూటరు అంతా సమావేశ మయ్యారు పార్థసారథి ఆఫీసులో

కోపంగాను, బాధగాను కూర్చుని వున్నాడు పార్థసారథి షూటింగు అర్థాంతరంగా ఆగిపోయినందుకు నష్టం వస్తుందని కాదు ఆయన బాధ తన లాంటి పెద్ద ప్రొడ్యూసరునే కీర్తన అంత తేలిగ్గా మాట్లాడినందుకు

"ఆమెకేం తెలుసని అలా మాట్లాడింది అన్నాడు పార్థసారథి

"ఆమె బాధ వేరండీ రైటరుగా మనం జగదీష్‌ను తీసుకోలేదని ఆమెబాధ ఈవిధంగా బెదిరిస్తే తీసుకుంటాం అనుకుని వుంటుంది ఆమెకు, జగదీష్‌కు వున్న సంబంధం అందరికీ తెలిసిందే కదా' వివరించాడు త్రిమూర్తి

"కావచ్చు కాని దానికి ఇలా ప్రవర్తించాలా

'నెంబర్ వన్ నటినన్న అహంకారం

"ఇవే డైలాగులకు జగదీష్ పేరు వేసినా చాలు ఆనందంగా నటిస్తుంది ఆమె' ఉన్న విషయం చెప్పాడు కిరీటి

'చక్రవర్తితో వ్రాయించి జగదీష్ పేరు వేయటమా నో' అని చక్రవర్తి కోసం కలయ చూశాడు పార్థసారథి

"చక్రవర్తి ఏడి అడిగాడు

అప్పుడు గుర్తు వచ్చింది రవికి చక్రవర్తి కాగితాలు తీసుకుని మౌనంగా వెళ్ళటం అదే విషయం చెప్పాడు అందరికీ

పాపం ఎంత బాధ పడుతున్నాడో ' నిట్టూర్చాడు పార్థసారథి

చక్రవర్తి ఎక్కడికి వెళ్ళాడో అర్థంకాలేదు రవికి హోటల్‌కు ఫోన్ చేశాడు రాలేదని సమాధానం వచ్చింది

'రేపు షూటింగు ఎలాసార్ అడిగాడు కిరీటి ఆందోళనగా

రెండు రోజులు క్యాన్సల్ చేద్దాం

# ధర్మపథం

## అపహాస్యం




నవ్వును కలిగించే హాస్యం నవరసాలలోనూ ఒకటిగా రూపొందింది. ఇది సహృదయుల ఆమోదాన్ని పొందినది. ప్రాచీనాలయిన సంస్కృత నాటకాలలో నాయకునికి వినోదం కలిగించడానికి వేడుక చెలికాడొకడు ప్రవేశపెట్టబడి ఉండేవాడు. అతని హాస్యం సభ్యతకు భంగం కలిగించే రీతిని ఉండదు.

అపహాస్యం అటువంటిదికాదు. కుంటి మున్నగు అంగవికలులనూ, ముక్కిడి మాటలాడేవాడు, నత్తివారు మున్నగు వారినీ అనుకరించి గేలిచెయ్యడం అపహాస్యం. సంకుచిత బుద్ధులే ఈ విధంగా గేలిచేస్తారు. ఇది సభ్యతకు దూరమైనది. సహృదయులు దీనిని మెచ్చరు.

మంచిచెడ్డలు ఎరగని బాల్యంలో ఉన్నవారు గేలిచేసేవారికి అనుయాయులై అనుకరించడం ఉన్నది. అలా అనుకరిస్తే అది అలవాటైపోతుంది. జ్ఞానం కొంత వచ్చిన తర్వాతగాని అది తప్పని తెలియదు. తెలిసేక ఆ అలవాటును తప్పించుకొనడం కష్టసాధ్యమవుతుంది. ముక్కిడి మాటలను అనుకరించి చిన్నప్పుడు అలవాటు చేసుకున్న ఆ మాటలను పెద్ద అయాక మానడానికి చాలా శ్రమపడవలసి వచ్చినట్లు వీరేశలింగంగారు తమ స్వీయ చరిత్రలో చెప్పుకొని ఉన్నారు.

అంగవిహీనులు మొదలైన వారిని గేలిచేస్తే వారికి ఎంతో బాధకలుగుతుంది, గేలిచేసేవారికి ఆనందం కలిగినా, ఇది పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణ పోకటవంటిది. కొన్ని సందర్భాలలో అపహసితులు, అది తమకు పెద్ద అవమానంగా భావించి ఆత్మహత్యకు పూనుకొనడం కూడా సంభవిస్తుంది. ఈ విధంగానే అంగవిహీనత మొదలైనవి లేకపోయినా, వ్యక్తి బాగానే వున్నా ఏదో ఒక కారణంవల్ల మారుపేర్లుపెట్టి వారిని కొందరు ఉడికిస్తారు. అవతలివారు లెక్కచెయ్యకపోతే బాధలేదు. కాని, వారు ఉద్రేకం పొందితే ఉడికించడం ఎక్కువ అవుతుంది. అల్లరి వాళ్లకు ఆనందం ఎక్కువ అవుతుంది. కాని, అవతలి వ్యక్తి అందరిలోనూ తిరగడానికి ఎంతో భయపడతాడు

అపహాస్యం చెయ్యడం, మారుపేర్లు పెట్టడం పెద్ద దుర్గుణాలు... అపహసిస్తూ, మారుపేర్లు పెడుతూ, నవ్వుతూ ఆనందించే వారని చూచి, మంచివారు కూడా నవ్వుతూ, ఆనందించడం కూడా జరగవచ్చు. ఇలా చెడుగుణాలు కలవారివల్ల మంచివారు కూడా చెడిపోగలరు.

అపహాస్యంవల్ల తాత్కాలికంగా వినోదం కలగవచ్చు కాని మరే ప్రయోజనం ఉండదు. నలుగురిలోనూ చెడ్డపేరు రావడానికి అది దోహదమవుతుంది. ఈ విషయాన్ని గ్రహించి, తమ సభ్యతను, గౌరవాన్ని నిలబెట్టుకొనుటకు అపహాస్యం జోలికి పోకూడదు. గేలిచేసేవారిని మందలించడం మంచిది.

అపహసించడం దుర్గుణాలలో ప్రధానమైనదని తెలిసికొనవలసి ఉన్నది.

—బులుసు వేంకట రమణయ్య

---

"కాని ఆ తరువాత అయినా కీర్తన ఒప్పుకుంటుందా" అనుమానంగా అడిగాడు త్రిమూర్తి

"ఇక ఆమెతో పని లేదు త్రిమూర్తీ! మరో ఆర్టిస్టును చూసుకుందాం" ఖచ్చితంగా చెప్పాడు పార్థసారథి

అక్కడ వున్న వాళ్ళంతా ఆశ్చర్య పోయారు ఆమాటకు చక్రవర్తి కోసం ఎంతో పేరు ప్రఖ్యాతులు వున్న కీర్తనను వదులు కోవటమా! అందరిలో అదే ప్రశ్న

ఈ క్యారక్టరును కీర్తనలా మరో ఆర్టిస్టు చెయ్యగల దంటారా"

'ఎందుకు చెయ్యలేరు త్రిమూర్తీ! అవకాశం రావాలి గాని కీర్తన కంటే బాగా చెయ్యగల వాళ్ళు ఎందరో వున్నారు "

"కాని సారథిగారూ ఈ స్టోరీ ప్రకారం ఈ క్యారక్టరును కీర్తన లాంటి ఆర్టిస్టు చెయ్యాలి లేదా మరో కొత్త నటి చెయ్యాలి" వివరించాడు త్రిమూర్తి.

'కొత్త నటికే అవకాశం ఇద్దాం' స్థిరంగా అన్నాడు పార్థసారథి

"చాలా రిస్కు అవుతుంది."

"అవనీ త్రిమూర్తీ సినిమా అంటేనే రిస్క్ కీర్తనతో తీసి నంత మాత్రాన సక్సెస్ అవుతుందని గ్యారంటీ ఇవ్వగలరా ఎవరైనా" ఆలోచిస్తూ అన్నాడు పార్థసారథి.

ఏదో చెప్పటానికి ప్రయత్నించాడు త్రిమూర్తి.

"ఆమె మాటవిని ఈరోజు చక్రవర్తిని తీసేశామనుకోండి. రేపు సగం సినిమా అయ్యాక మిమ్మల్నీ తీసెయ్యమని అడిగితే" త్రిమూర్తి మొహంలోకి చూస్తూ అడిగాడు పార్థసారథి. ఆ ప్రశ్నకు త్రిమూర్తి వద్ద సమాధానం లేదు

"రేపు పత్రికా విలేకరుల సమావేశం ఏర్పాటు చెయ్యండి కీర్తనను తీసేసినట్టు, అందుకు కారణాలు అన్నీ వివరిద్దాం" అని లేచాడు పార్థసారథి ఇక మాట్లాడటానికి ఏమీ లేదన్నట్టు

చక్రవర్తి కోసం కీర్తన లాంటి నటినే తీసి వేసిన ఆయన సహృదయతకు మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు రవి

(ఇంకాఉంది)

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన 'కథలు

## బుద్ధ దేవుని భూమిలో...

జయలక్ష్మి మనసు రక రకాల ఆలోచనలతో అస్థిమితంగా వున్నది. టిఫ్ఫింగ్ కోసం ఎల్లుండే వెళ్ళటం అని భర్త ప్రకటించాడు. అతను చెప్పిన దానికి సహకరించాలా! లేక అభ్యంతరం చెప్పాలా! అనే సమస్యతో మనసు సతమత మవుతున్నది విసుకుగా వుండి పక్కలైనులో వున్న దేవాలయానికి వెళ్ళింది జయలక్ష్మి. అక్కడ ఎవరో పురాణం చెపుతున్నారు ఆ పురాణం మనసుకు ఎక్కలేదు గాని, అందులో కొన్ని మాటలు మాత్రం చెవిలో ముద్రితాలయినాయి.

"కుయ్యిడ శక్తిలేదుదర గోళము లోపల నున్నవాడ"

"నేడియ్యెడ వహ్ని వాయుటకు నెయ్యది మార్గము"

"రాడా చూడ సమస్త భూతములలో రాజిల్లు వాడు

నాకీడా నేదభయ ప్రదానము" అని గతాగత ప్రాణుండై"

అని ఉత్తర గర్భస్థ శిశువు ఆక్రందనలు. అక్కడ వుండలేక ఇంటికివచ్చి కళ్ళు మూసుకుని పడుకున్నది. కళ్ళముందు ఏవేవో దృశ్యాలు, చీకటి గుహ, అక్కడ అంతా మెత్త మెత్తగా, తడి- తడిగా వున్నది. చుట్టూ సాలిగూళ్ళ దారాల్లాగా వున్నాయి. అక్కడ ఏదో నీలంగా, ఎర్రగా, ముద్దలా వున్నది. పిచ్చుక గూటిలో నుండి గ్రుడ్డు క్రిందపడి, పగిలి, అందులో ఇంకా ఆకారం తయారుకాని పిచ్చుక పిల్లల నెత్తురు ముద్దల్ని తాను చూచింది ఇది కూడా అలాగే వున్నది. ఆ ఆకారం అస్థిమితంగా కదిలినట్టుగా. తనలో తాను ఏదో అనుకుంటున్నట్టుగా జయలక్ష్మికి వినిపించసాగింది.

"ఈ పవిత్ర భారతావనిలో జన్మించాలంటే ఎంతో పుణ్యము, ఏ యోగ బలమో కావాలట. మంచి పూవులతో పూజించాలట. ఇటువంటి రత్నగర్భ గర్భంలో చోటు చేసుకోగలిగినందుకు నేను ఎంతో పొంగి పోయాను. కాని ఇదేమిటి! ఆ పుణ్యభూమిలోనే నా ప్రాణాలు హరించటానికి పథకాలు వేస్తున్నారు? ప్రాణాన్ని కాపాడిన వాడికే ఆ ప్రాణి మీద హక్కని హంస కోసం వాదించిన బుద్ధదేవుని భూమి ఇది. మరి నన్ను చంపినపుడు తల్లితండ్రులకు మిగిలిన సంతానం మీద మాత్రం హక్కు ఎలా వుంటుంది? సంతానం కోసం సంసారం చేయాలనే కర్మ భూమి ఇది కాల ధర్మాన్నిబట్టి అది మారినా గండుపిల్లిలాగ తమ ఆనందం కోసం సంతానాన్ని పొట్టన పెట్టుకునే ఈ పాశవిక ప్రవృత్తి ఏమిటి?

నన్ను ఆడ పిల్లా లేక మగ పిల్లవాడా అని పరీక్ష చేస్తారుట. ఆడపిల్ల నయితే నన్ను చంపుతారు కాబోలు. "మాతృ దేవో భవ అని మొట్ట మొదట చెప్పే ఈ దేశపు సంస్కృతి ఏమైపోతున్నది? ఒక స్త్రీ ఆమె ప్రాణాలను ఫణంగా పెట్టి తమకు జన్మనిచ్చి, మనుగడను సాధనమైన శరీరాన్ని పోషించి, పెంచి ఇచ్చింది. ఆ విషయం అసలు గుర్తులేదు కాబోలు వయస్సు వచ్చినప్పటి నుండి వల్లకాటికి వెళ్ళే వరకూ, వెంట వుండి అనుక్షణం సేవలు చేసేది స్త్రీ ఆమె రెండు రోజులు పుట్టింటికి కూడా వెళ్ళకూడదు మరి అయితే తన స్వార్థం తనదేనా! సమాజానికి మరొక మాతృమూర్తిని, మరొక సహధర్మచారిణిని ఇచ్చే బాధ్యత మానవులకు లేదా!

పథకం వేసుకుని హత్య చేస్తే మరణ శిక్ష అని చెపుతున్నది న్యాయదేవత. తల్లి గర్భంలో ఒదిగివున్న ప్రాణిని పరీక్ష చేయించి కేవలం లింగభేదం కారణంగా ప్రాణాలు హరిస్తూ వుంటే ఆ చట్టం వీళ్ళకు వర్తించదా! ఆ న్యాయదేవత అయినా నన్ను కాపాడదా?

అయినా ఇదే విధంగా కొన్ని దశాబ్దాలు జరిగితే ఏమవుతుంది? మగువల కోసం మారణకాండలు జరగకుండా వుంటాయా? వావి-వరసలు పోయి, వివేకం నశించి ఆడది కనిపిస్తే రిమ్మ తెగులు పుట్టే సమాజం ఏర్పడదా! పదునైన కత్తిలాంటి విజ్ఞాన శాస్త్రాన్ని గొంతు కోసుకోవటానికి సిద్ధపడుతున్న మానవుడు నిజంగా విజ్ఞాన దాయకంగా అభివృద్ధి సాధించే దెపుడు? నిప్పుతో ఇల్లు కాల్చుకునే మానవుడు రుచి, శుచి అయిన సమీకృతాహారాన్ని హాయిగా ఎలా తినగలడు?

అదిగో పిచ్చుకపాద బ్రహ్మాస్త్రంలా ఆ పదునైన కత్తి నన్ను చీల్చి వేయటానికి వస్తున్నది. అయ్యో- నన్ను కాపాడే వారెవరు! నేను ఆడపిల్లగానే పుట్టి ఈ శిశు హంతకులకు బుద్ధి చెప్పాలని వున్నది కాని నాకు ప్రాణదానం చేసే వారెవరు? ఈ మురికి కూపం నుండి ఆ పుణ్య భూమిపై పడి మానవ సహజమైన జీవన మాధుర్యం అనుభవించాలని వున్నది. నెత్తురు ముద్దగానే నూరేళ్ళు నిండబోతున్న నన్ను ఈ మృత్యుభీతి నుండి కాపాడేవారు ఎవరు? ఎవరు? ఎవరు?

మత్తుగా కళ్ళు మూసుకుని పడుకున్న జయలక్ష్మికి శరీరమంతా చిన్నగా కపించినట్టు అయి ఉలిక్కిపడి లేచి కూర్చున్నది ఒక్క క్షణం తర్వాత చిన్నగా తేరుకున్నది తనలోని బావావేశమే ఆ దృశ్యంగా కనపడిందని, లోపల వున్న ఆ నెత్తురుగుడ్డు పడ్డ ఆవేదన కూడా తనలో లావాలా మండుతున్న భావాలే అని అర్థమై పోయింది ఆమెకు. కాని ఆ నెత్తురు గుడ్డు కళ్ళ ముందు కనిపించసాగింది అది అటూ ఇటూ బాధతో మెదులుతూ కుయ్యిడ శక్తిలేదు దరగోళము లోపల వున్నా ననీ తనను కాపాడే వారెవరనీ నిస్సహాయంగా అర్తి చెందుతున్నట్లే అనిపించసాగింది అప్రయత్నంగా పొత్తి కడుపు మీద రెండు చేతులూ రక్షణ కవచంలా పెట్టింది జయలక్ష్మి

అమ్మనబ్రోలు విజయలక్ష్మి,
పర్చూరు



# 'బాధ్యతగా పెంచమ్మా !



**ఉ**దయంనుండి పని హడావిడితో అలసిపోవటంతో భోజనం అయిన వెంటనే నిద్రలోకి జారిపోయింది భారతి మృదు మధురంగా ఎవరో అప్యాయత నిండిన స్వరంతో పిలుస్తున్నారు ఎవరైందీ తెలియటం లేదు ఆ స్వరం హృదయ తంతుల్ని మీటినట్లయింది. అంతలోనే అమ్మా ' అనే పిలుపు అతిమెల్లగా విన్పించింది "అమ్మా! యివాళ నాన్నగారు, నువ్వు డాక్టర్‌గారి దగ్గఱకెళ్ళి 'ఎస్ డి టి' చేయించుకొని మళ్ళీ రెండవసారి బాబు పుట్టబోతున్నాడని తెలిసి ఎంతో మురిసిపోయారు కదూ! నాక్కూడ అనందంగా, గర్వంగా ఉందమ్మా. ఎందుకో తెలుసా! నీకు తెలియని నాకు తెలిసిన పూర్వజన్మ స్మృతి నా చిన్ని



గుండెలో యింకా పదిలంగా ఉంది అందుకే భగవంతుడిని వేడుకొని మరి మరి ప్రార్థించి ఈ జన్మకుకూడ నిన్నే తల్లిగా పొందేవరాన్ని పొందాను అవునమ్మా, పూర్వ జన్మలో కూడ నేను నీ కొడుకుగానే పుట్టి అల్లారు ముద్దుగా పెరిగాను. మరి రెండు సంవత్సరాలకి పుట్టిన తమ్ముడు నేను అన్నదమ్ములవలెగాక ప్రాణ స్నేహితులుగా పెరిగాము అవధులులేని నీ ప్రేమలో క్రమ శిక్షణకు మారుగా మా జీవిత ప్రయాణం ప్రక్క దారులంట ప్రయాణించవలసి వచ్చింది నీకు అశ్చర్యంగా ఉందికదూ అవును, రాత్రి 12 గంటలవరకు రోడ్లమీద, సినిమా హాళ్ళచుట్టూ తిరిగి వచ్చినా మాకు ఆదరంగా అన్నంపెట్టేదానివి విచిత్ర వేషధారులులాంటి దుస్తులు ఫేషన్ పేరుతో వేసుకుంటే అనందించేవారు

అవి మీరు కొన్నవేకదా! నెలకు ఒక్కసారైనా పుస్తకం తీసి చదివానా! మంచిమార్కులు తెచ్చుకున్నానా? అమ్మా! అన్నిటికంటే దురదృష్టకర సంఘటన గుర్తు చేస్తున్నాను. నేను నా స్నేహితుడు కలసి ఒక అమ్మాయిని మానభంగంచేస్తే అది బయటికి పొక్కకుండా నాన్నగారి మీద వత్తిడి తెచ్చి భారీగా లంచాలతో ఆ నిజాన్ని కప్పెట్టిచ్చావు ఆ అమ్మాయి ఆత్మహత్య చేసుకుంటే పీడ విరగడైందని సంతోషించావు ఆకక్షతో వాళ్ళు నన్ను కిరాయి మనుష్యులతో హత్య చేయించారు నీవు యిచ్చిన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలతో క్రమశిక్షణా రాహిత్య పెంపకంతోనే నేను అలా అర్ధాంతరంగా జీవితం చాలించటానికి, తమ్ముడు మత్తు మందులకు బానిసై ఉజ్వలమైన జీవితాన్ని నాశనం చేసుకోవటానికి నీ పెంపకంలోని లోపాలే కారణాలు మగపిల్లలని కూడ బాధ్యతగా పెంచి వాళ్ళ జీవితాలు ప్రవేశించేటట్లు చేయాలి మగపిల్లవాడైనంత మాత్రాన చిన్నప్పటినుండి విచ్చలవిడితనం నేర్పకూడదు చదువులోను ప్రవర్తనలోను మిన్నగా ఉండి కన్న తల్లితండ్రులకు, సమాజానికి తద్వారా దేశానికి మంచి పౌరుడిలా తీర్చిదిద్దాలి పెద్దమాటలు మాట్లాడి నీకు నీతులు బోధించినందుకు నన్ను మన్నించమ్మా కనీసం ఈ జన్మలోనైనా నన్ను బాధ్యతగా పెంచి విద్యావంతుడిగా, వివేకవంతుడిగా తీర్చిదిద్ది సంఘానికి పనికివచ్చే వ్యక్తిగా పెంచమ్మా నన్ను శాపగ్రస్తుడిగా చేయకమ్మా చెప్పమ్మా, అలాగె కదూ'

"అలాగే బాబూ! అలాగే. మగపిల్లల తల్లిని అని యింతకాలం గర్వంగా ఉండేది ఆడ అయినా మగ అయినా బాధ్యత ముఖ్యం. మగపిల్లవాడికైనా పెంపకంలో సరైన సెన్సార్ లేకపోతే భవిష్యత్తు జీవితం అస్తవ్యస్తమై అంధకారమౌతుంది బాబూ!నీవన్నట్టు మీ యిద్దర్ని విశిష్ట వ్యక్తులుగా తీర్చిదిద్దుతాను. పోయిన జన్మలోని నా తప్పులను క్షమించి మళ్ళీ నన్నే తల్లిగా కావాలని వరంపొందినందుకు నీ ఋణం తీర్చుకొంటాను బాబూ! నిర్భయంగా ఈ తల్లిమీద విశ్వాసాన్నుంచి భూమిమీద అడుగుపెట్టు నువ్వు జీవితంలో తప్పటడుగులు వేయకుండా జాగర్తగా ఉంటాను. కన్నా! నన్ను నమ్ము సుడిగుండాల దరిదాపులకి వెళ్ళనీయను .

భారతీ! సుడిగుండా లంటున్నావు ఏమిటి!పగటి కలలుకంటున్నావా," అని మెల్లగా తట్టిలేపాడు సతీష్ నిద్రలో ఏడుస్తున్నావు. పీడకల కాదుకదా!' అని అడిగే భర్తతో" ఏమండీ! బాబు యింకా స్కూలునుండి రాలేదు. వెళ్ళి తీసుకురండి చెడ్డ స్నేహితులతో తిరుగుతున్నాడేమో" అని కంగారు పడింది." భారతి! నీకు పీడకల తాలుకు కంగారు యింకా వదలనట్టుంది యు. జి. చదివే బాబు గురించి వాలాదూరం ఆలోచిస్తున్నావు. సరేలే. నేవెళ్ళి తీసుకొస్తాను. రెస్టు తీసుకో' అని వెళ్తున్న భర్త వేపుచూచింది. అవును, మొక్క అపుడే కంగారు పడాలి. మాను అయిన తరువాత కాదు" అనుకొని నిట్టూర్పు విడిచింది భారతి

'రమ', సీతమ్మధార,
విశాఖపట్నం □

# మనయ్యమాత్రం

## జి. రాజ్యలక్ష్మీ గుప్తా

అదొక ఊరు.

పల్లె వాతావరణానికి పట్నం వాతావరణానికి మధ్యస్థంగా వుంది

బాల్యం నుంచి యవ్వనంలోకి అడుగు పెడుతున్న కన్నెపిల్లలా, పల్లె వాసనలను వదలి పట్నంగా రూపొందుతుంది. ఆ ఊరు.

అప్పటి వరకు ఆ ఊళ్ళో ఆధునిక వసతులు లేవు. వెనుకబడిన ఊరి క్రింద ప్రభుత్వం ఆ ఊరిని చేపట్టి పట్నంగా మార్చడానికి ప్రయత్నిస్తోంది.

అనేక ఆధునిక సదుపాయాలను సంతరించుకొని క్రొత్త అందాలను రూపు దిద్దుకొంటోంది.

ఆ ఊరి ఆధునిక అందాలకు పెద్దలు, పిన్నలు సంబరపడుతుంటే, ఆ సంబరాన్ని సంతోషంగా అనుభవించలేని వ్యక్తి మనయ్య ఒక్కడే.

మనయ్య ఎక్కడ పుట్టాడో, ఎవరికి పుట్టాడో, ఆ ఊళ్ళో వారి కెవరికీ తెలియదు. ఎలా ఆ వూళ్ళో అడుగు పెట్టాడో, ఎవరిని అడిగినా, తెలియదంటారు. వుద్ధి బుద్ధెరిగిన నాటి నుంచి ఆ ఊళ్ళో బ్రాహ్మణుల పంచలో పెరిగాడు. మిగిలిన కులాల వారందరు బ్రాహ్మణుల పిల్లవాడనుకున్నారు. అందరికీ తలలో నాలుకలా ఉండి అన్ని పనులు చేస్తుండేవాడు. మన అయ్య, మన అయ్య అంటూ అందరూ పిలవడంతో ఆఖరికి ఆ పదం మనయ్యగా మారి అదే పేరుగా స్థిరపడింది. లేచింది మొదలు ఆ వాడలో ఏ తల్లి మొదటి ముద్ద పడేస్తే, ఆ తల్లికి సాయం చేసేవాడు. తల్లిదండ్రులు లేని మనయ్యకు ఆ వాడలోని వాళ్ళందరూ తల్లిదండ్రులే!

మనయ్యకు మొదట్లో ఏ పని చేయాలో, ఏ పని చేయకూడదో, ఎవరికి చెయ్యాలో, ఎవరికి చేయకూడదో తెలిసేది కాదు.

కాస్త ఊహ తెలిసాక తను చేయకూడని పనులు తెలుసుకున్నాడు. తను ఎవరికి చెయ్యాలో తనే ఊహించుకొనేవాడు.

అక్షరాభ్యాసం చేయడానికి 'నా' అన్న వాళ్ళెవరూ లేరు. చదువుకోవాలన్న ధ్యాస కాని, సమయం కాని లేదు. మంత్రాలు రాని పంతులని పేరు పొందాడు

మనయ్య బాల్యాన్ని వదలి యవ్వనంలోకి అడుగు పెడుతున్నాడు. అతని దిన చర్యలో మార్పు లేదు. తల్లిదండ్రి అయిన ఆ ఊరిలోని వాళ్ళు మనయ్యకు పెళ్ళి చేయాలనుకున్నారు

ఊర్లోని పెద్దలు "పెళ్ళి చేసుకుంటావా?" మనయ్య అని అడిగితే ముసి ముసిగా నవ్వి వూరుకొనేవాడు.

కల్యాణ ఘడియ వచ్చినా, కక్కొచ్చినా ఆగదన్నట్టు ఓ బీద పంతులు తన కూతురిని పెళ్ళి చేసుకొమ్మని మనయ్యను బ్రతిమాలాడు.

తన హీన, బీద స్థితిని తెలిసి కూడా, తన కూతురి కన్నె చెరను విడిపించమని తనను బ్రతిమాలుతున్న ఆ వృద్ధ బ్రాహ్మణుని చూసి జాలిపడి సరే అన్నాడు.

ఆ కన్నతండ్రి మనసు సంతోష తరంగాలలో తేలిపోయింది. రంగ, రంగ వైభోగంగా పెళ్ళి జరగకపోయినా ఆకాశమంత పందిరి లేకపోయినా, భూదేవంత అరుగు కాకపోయినా, ఆ వాడలోని వారందరూ ఆ పెళ్ళికి హాజరయ్యారు. వారందరి ఆప్యాయత అక్షింతల రూపంలో మనయ్య మీద పడుతుంటే తెలియని ఆనందంతో తేలిపోయాడు.

అమ్మయ్య! మనయ్యకు కూడా పెళ్ళయింది. అనుకున్నారు ఊళ్ళోని వారంతా. తమందరికి ఎంతో భారం దిగిపోయినట్టు.

అంత వరకు ఆ పంచల్లో, ఈ పంచల్లో పడుకొని కాలం గడుపుతున్న మనయ్య, భార్యతో సహా ఆ పంచల్లోనే పడుకోవడానికి సిద్ధమయ్యాడు.

భర్త వాలకాన్ని చూసిన మనయ్య భార్య పిచ్చి దానిలా, ఏమి చెప్పాలో తెలియని దానిలా నిలబడింది. అంతలో దేవుడు పంపిన దేవతలా ఆ యింటి యజమానురాలు బయటకు వచ్చి చూసి,

"మనయ్యా! నిన్ను సుందరమ్మగారు రమ్మన్నారు. వాళ్ళింట్లో ఓ చిన్నగది ఖాళీగా ఉందంట. అక్కడకు వెళ్ళండి" అంది.

ఆ సమయంలో తమ పరువును కాపాడడానికి వచ్చిన దేవతలా ఉన్న ఆమెకు చేతులెత్తి నమస్కరించింది మనయ్య భార్య. మనయ్య వెనుకగా నడుస్తూ.

సుందరమ్మ ఆ వాడలో బాల వితంతువుగా పేరు మోసింది. ఆవిడకు ఆస్తి అంటూ ఉన్నది. ఆ ఒక్క చిన్నగది మాత్రమే.

ఆ గదికి సున్నం వేసి తరాలయింది. చుట్టూ నాలుగు గోడలు నామ మాత్రంగానే ఉన్నాయి. పైన కప్పును చూస్తే ఉందో, లేదో అనే అనుమానం వస్తుంది. ఆ ఇంటి లోపల గోడలను, సూర్యుడు, చంద్రుడు ప్రతిరోజు వచ్చి పరామర్శించి పోతుంటారు.

మనయ్య ఆ ఇంటిని వింతగా చూస్తూ నిలబడ్డాడు.

"మనయ్యా! నా ఇంట్లో గది కావాలంటే నెలకు పది రూపాయలు బాడుగ ఇవ్వాలి. అట్లయితేనే నా ఇంట్లో ఉండు" అంది నిక్కచ్చిగా

రోజుకు పది పైసలు కూడా సంపాయించలేని మనయ్యకు పది రూపాయల కాగితం ఎలా వుంటుందో తెలియదు. ఆ పది రూపాయల కోసం ఎన్ని రోజులు కష్టపడాలో కూడా తెలియదు.

సందిగ్ధావస్థలో నున్న మనయ్యను చూసి సుందరమ్మ ఏదో అనే లోపునే, "సరే, అలాగే" అంటూ మనయ్యను చెయ్యి పట్టి ఇంట్లోకి తీసుకు వెళ్ళింది మనయ్య భార్య.

అంతవరకూ అతని చేయి ఎవరి చేతిని తాకలేదు. స్త్రీ స్పర్శను ఎరిగిలేడు. ఆప్యాయంగా పట్టుకున్న ఆ చేతిని తన చేతిలో వుంచుకోవాలో, వదలాలో తెలియక సంతోషంగా, కాస్త సిగ్గుగా భార్యను చూసాడు.

తను పడవలసిన అవస్థ తన భర్త పడుతున్నందుకు అమాయకంగా నవ్వింది మనయ్య భార్య.

ఆ రాత్రి ఆ నూతన దంపతులకు కటిక నేలకాని, కనీస అవసరాలు గాని గుర్తుకు రాలేదు

తెల్లవారింది. అందరికీ తెల్లవారడం వేరు. మనయ్యకు తెల్లవారడం వేరు. తెల్లవారి లేస్తూనే ముందుగా ఎవరింట్లో పనికి రమ్మని చెపితే వాళ్ళింటికి వెళ్ళేవాడు. ఆ రోజంతా ఆ ఇంట్లో పనులతో, వారు పెట్టిన తిండితో గడిపేవాడు. ఈ రోజు అట్లా చెయ్యడానికి అతని మనస్సు ఒప్పడం లేదు. భార్యను ఒక్కదాన్ని ఇంట్లో వుంచి తన దారిన తాను పోలేక పోయాడు.

కాలు గాలిన పిల్లిలా తెల్లవారిన దగ్గర నుంచి ఇంట్లోకి, బయటకు తిరగ సాగాడు.

భర్త రోజూ చేస్తున్నట్టుగా, చేసే పనులకు పంపడం ఇష్టం లేదు మనయ్య భార్యకు.

"ఈ రోజు నుంచి మీరు ఇంకేమైనా పనులు చేయండి" అంది దీనంగా.

"ఏం చెయ్యమంటావు" అన్నాడు అంతకంటే దీనంగా.

"అందరూ చేస్తున్నట్టుగానే, మీరు ఏదో ఒకటి చెయ్యండి అంది" ఏం చెయ్యాలో చెప్పడం తెలియక.

తనకు తెలిసిన వాళ్ళందరూ ఏం చేస్తున్నారో ఆలోచించాడు.

కొందరు పౌరోహిత్యం చేస్తుంటే, మరికొందరు పిల్లలకు పాఠాలు చెప్తున్నారు. ఇంకొందరు ఇంటింటికి వెళ్ళి ఆ రోజు తిథి, వారం, వర్జ్యం చెప్పి, వాళ్ళు పెట్టిన భిక్షపట్టుకెళ్తుండేవారు.

ఆ పనుల్లో ఏ పనీ చేతకాదు మనయ్యకు.

మధ్యాహ్నం వరకూ ఆలోచనలతో, ఏం చెయ్యాలో తెలియక బయటకు వెళ్ళలేదు మనయ్య.

ఆ ఒక్క పూటలోనే ఆ వాడలోని ఆడవాళ్ళకు మనయ్య లేని లోటు తెలిసి వచ్చింది.

ఆలోచించి, ఏమీ తోచక, కరణం గారింటికి వెళ్ళాడు మనయ్య.

మనయ్యను చూసి కరణంగారి భార్య కడుపు నిండా అన్నం పెట్టింది.

ఆకలిగా ఉండడంతో అంతా తినేశాడు. అప్పుడు గుర్తొచ్చింది అతనికి భార్య సంగతి.

భార్య భోజనము చేయలేదని, అతని అసహాయ స్థితికి అతని కళ్ళ వెంట కన్నీరు ప్రవహించసాగింది.

అదే సమయములో కరణంగారి పెద్ద కోడలు మంచినీళ్ళ బిందెతో ఇంట్లోకి రావడం కనిపించింది. మడిలో మంచినీళ్ళు తెచ్చి, వంట చేసి దేవుడికి నైవేద్యం పెట్టడం ఆ ఇంట్లో వాళ్ళ అలవాటు.

ఆ రోజు మనయ్య రాకపోవడంతో కరణంగారి కోడలు మంచినీళ్ళ బావి దగ్గరకు వెళ్ళి తేవలసి వచ్చింది

పాతిక ఎకరాల మాగాణి భూమి, వంద తులాల బంగారాన్ని తనతో పాటు తీసుకు వచ్చిన పెద్ద కోడలంటే కరణంగారికి ప్రత్యేక అభిమానము.



మనయ్య పనిలోకి రాకపోతే మనయ్య చెయ్యవలసిన పనులతో పాటు నీళ్ళు కూడా తేవలసిన బాధ్యత పెద్దకోడలి మీద పడుతుంది అన్న ఊహ భరించలేక పోతున్నారు కరణంగారు

ఎక్కువ రోజులు కరణం గారింటి పనులు చేస్తూనే కాలం గడిపే వాడు ఇది వరకు.

తన సమస్యను కరణంగారి ముందు చెప్పడానికి భయపడుతున్నాడు.

మనయ్య భయాన్ని గమనించిన కరణంగారు, "ఇదివరకు చేసే పనులన్నింటినీ మానేయవోయ్" అన్నారు తను చెప్పబోయే దానికి ఉపోద్ఘాతంలా.

"నాకు, నా భార్యకు బ్రతకడానికి మార్గం చూపించి పుణ్యం కట్టుకోండి బాబయ్యా" అన్నాడు కన్నీటితో

## గడుసులోకం —బాపు




# మనయ్య మరణం

భార్యను సర్వ సౌఖ్యాలతో ముంచెత్తాలని లేకపోయినా, కనీస అవసరాలను తీర్చవలసిన బాధ్యత తన మీద ఉందని అనుకున్నాడు భార్యను కష్టపెట్ట కూడదనుకున్నాడు. తానెంత కష్టపడయినా, భార్యను సుఖ పెట్టాలనుకున్నాడు. భార్యను ఏ పనీ చెయ్య నివ్వదలచుకోలేదు. కరణంగారు చెప్పబోయే ఏ పనైనా తన భార్యను సుఖపెట్టగలిగేదైతే చెయ్యదలచుకున్నాడు. ఇంతవరకు తనకు నా అన్న వాళ్ళెవరూ లేరు. ఈ ప్రపంచంలో ఇప్పటికి తన మనిషి అన్న వ్యక్తి 'భార్య' అనుకుంటే అతని మనసు దూది పింజలా తేలిపోసాగింది.

ఒళ్ళంతా చెవులు చేసుకొని కరణంగారు చెప్పబోయే దానిని వినడానికి సిద్ధమయ్యాడు

"మనయ్యా! ఇన్నాళ్ళు నువ్వు ఒక్కడివే ఈ రోజు నుంచి నీ భార్యను పోషించవలసిన బాధ్యత కూడా నీదే. ఇద్దరి కడుపులు నిండాలి. ఇదివరకు మాదిరిగా కాస్త, కూస్త సంపాయిస్తే లాభం లేదు. ఇంకొన్నాళ్ళు పోతే ముగ్గురవుతారు అప్పుడు ఇంకాస్త కష్టమవుతుంది. అందుకని మన వూరి పెద్దలందరం కలసి ప్రొద్దున నీ గురించి ఆలోచించాము నీకొక దారి చూపించాలనుకున్నాం."

"ఏమిటి బాబయ్య అది" అన్నాడు ఆత్రత ఆపుకోలేక.

"మన ఊళ్ళో అందరికి త్రాగడానికి మంచినీరు, ఊరి బయట బావుల నుంచి తెచ్చుకోవడం అందరి ఆడవాళ్ళకు సమస్యగా ఉంది కదా! అందుకని నువ్వు మా అందరి ఇళ్ళలో ఒక్కొక్కరికి ఒక్కొక్క బిందె చొప్పున మంచినీళ్ళు ప్రతిరోజు తెచ్చి పోస్తూండు నీ కష్టం ఉంచుకోకుండా, మేమందరం బిందెకు నెలకు మూడు రూపాయల చొప్పున ఇవ్వదలచుకొన్నాం నీకు ఇష్టమేనా?" అన్నాడు.

కటిక చీకట్లో దిక్కు తోచక తిరుగాడుతున్న వ్యక్తికి, వెలుగు చూపించడమే కాకుండా, దారిని కూడా చూపుతున్న ఆ నిలువెత్తు మనిషికి కృతజ్ఞతలు ఎలా చెప్పాలో తెలియక, ఆనంద బాష్పాలను తుడుచుకుంటూ ఆయన పాదాలపై మోకరిల్లాడు

"చూడు మనయ్యా! నీకు ఏ కష్టం వచ్చినా, మన ఊళ్ళో వాళ్ళందరూ, నీ వాళ్ళనుకో, నీ కష్ట సుఖాలను మాతో పంచుకో" అంటూ వెన్ను తట్టి ఆశీర్వదించారు."

అమృత తుల్యమైన ఆ మాటలకు చలించి పోయాడు

ఒక మంచి రోజు చూసి నీళ్ళు ఇంటింటికి ఒకో బిందెతో తెచ్చి పోయడం మొదలు పెట్టాడు. రోజంతా శ్రమించినా, శ్రమ అనిపించేది కాదు ఉత్సాహంతో అడిగిన వాళ్ళందరికీ పోయడం మొదలు పెట్టాడు

ఒకో బిందెతో తెచ్చి పోస్తుంటే అందరికి సమయానికి అందించ లేకపోవడంతో 'కావిడి' తయారు చేయించుకున్నాడు కావడిలో అటు రెండు బిందెలు, ఇటు రెండు బిందెలు పెట్టుకొని పాటలు పాడుకుంటూ పరుగులు తీసేవాడు

ఉదయాన్నే లేచి, కావిడి భుజాన వేసుకొని, మంచినీటి బావికి వెళుతున్న మనయ్యను చూస్తే, సూర్యుడు కూడా ఉత్సాహంతో చరచరా పైకి వచ్చేవాడు బద్ధకాన్ని వదలి

నెల నెలా, వచ్చే సంపాదనలో ఇంటద్దె పోనూ, మిగిలిన వాటితో భార్యా, భర్త గుట్టుగా సంసారం సాగించేవారు

ఆ వాడలోని ఆడవాళ్ళందరినీ మనయ్య ఏదో ఒక వరసతో పిలిచేవాడు.

మనయ్య నీళ్ళ బిందెతో వచ్చేపటికి, ఆ ఇంటిలోని వాళ్ళు ఏదైనా పనిలో వుంటే, తానే లోపలికి వచ్చి బిందె కడిగి నీళ్ళు పోసి వెళ్ళేవాడు.

మనయ్య నీళ్ళు తెచ్చే సమయానికి వాళ్ళేదైనా, పచ్చడో, కూరో చేసుకుంటుంటే రుచి చూడమంటూ కాస్త గిన్నెలో పెట్టి ఇచ్చేవారు.

వండుకున్నమ్మకు ఒక రకమైతే, అడుక్కున్నమ్మకు అరవై రకాలన్నట్టు ప్రతిరోజు రెండు మూడు రకాల కూరలతో భోజనం చేసే వాడు మనయ్య.

అత్తా కోడళ్ళ వ్యవహారాలను చక్కదిద్దడంలో ఆరి తేరాడు

భార్యా, భర్తల పోట్లాట ల్లో మధ్యవర్తి వ్యవహారాలను అతి చాకచక్యంగా నడిపి వాళ్ళను కలపడంలో నిపుణుడయ్యాడు

పెళ్ళిళ్ళను కుదిరించడంలో పెద్ద వ్యవహారాల వ్యక్తిగా మారాడు

అన్నదమ్ముల ఆస్తి పంపకాలలో న్యాయ నిర్ణేత అయ్యాడు

ఆ వాడలోని ప్రతి వ్యక్తికి మనయ్యతో అవసరం ఉండేది పెద్ద, చిన్న, ముసలి, ముతక అందరూ మనయ్యతో కాలక్షేపం కబుర్లాడేవారు. ఎంత శ్రమించినా, మనయ్య మొఖంలో అలసటను గాని, చిరాకును గాని, ఏ నాడూ ఏ వ్యక్తీ గుర్తు పట్టలేదు.

ఆ ఊరిలోని వారి ఆప్యాయతతో ఆదరణతో మనయ్య జీవితం ఏ ఒడుదుడుకులు లేకుండా గడుస్తోంది

రాబోయే రోజులు ఇంకా హాయిగా గడపవచ్చని కలలు కనేవాడు.

అన్నీ మనం అనుకున్నట్టు జరిగితే, భగవంతుణ్ని అందరూ మరిచేవారు

మనయ్య ఆ రోజు కావిడితో బయలుదేరగానే ఊళ్ళో చాల మంది క్రొత్త వాళ్ళు కనిపించారు. వాళ్ళెందుకు వచ్చారో, ఏం చేస్తారో తెలుసుకోవాలన్న ఆసక్తి లేదు ఊరంతా సందడిగా, కోలాహలంగా ఉంది. పెద్దలందరూ రచ్చబండ వద్ద సమావేశమయ్యారు ఊరంతా గోతులు తవ్వుతున్నారు కూలీలు.

ఆ గోతు లెందుకో, ఆ సంబరమేమిటో అర్థం కాలేదు

ఒకచోట కావిడిని దింపి, "ఇవన్నీ ఎందుకు తవ్వుతున్నారు" అని అడిగాడు

శ్రీరస్తు – శ్రీ త్రిపురసుందరి పరశివాభ్యాంనమః

# ఆంధ్రపత్రిక

పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో త్వరలో వెలువడుతుంది

పూర్తి ఆఫ్‌సెట్ ముద్రణతో త్వరలో వెలువడుతుంది

## ప్రభవనామ సంవత్సర పూర్ణశాస్త్రీయ పంచాంగము









'దైవజ్ఞచిన్తామణి' శ్రీ పిడపర్తి చినకృష్ణమూర్తిశాస్త్రి,

'భాషాప్రవీణ' శ్రీ సుబ్రహ్మణ్యశాస్త్రి సిద్ధాన్తి సోదరులచే గుణించబడినది.


ఆంధ్రపత్రికా కార్యాలయము

ప్రతి 1–కి రూ. 5-00

గాంధీనగరం – విజయవాడ - 3. — బషీర్‌బాగ్ – హైదరాబాద్ - 29.




**ఎ. పి. కలకత్తా**

దంపతుల్లో ఒకరి రక్తం ఆర్ హెచ్. పాజిటివ్‌గాను, మరొకరిది ఆర్ హెచ్. నెగిటివ్‌గాను ఉండే వారికి పిల్లలు దక్కే అవకాశం లేదా? సహజంగా మానవ రక్తం ఎక్కువగా పాజిటివ్‌గా ఉంటుందా? నెగిటివ్‌గా ఉంటుందా?

★ **ఆ స్త్రీలు ఆర్. హెచ్. యాంటిజన్ వాడటం వల్ల ఏ రోగము లేకుండా పిల్లలు పుట్టే అవకాశం ఉంటుంది ఒకవేళ ఆ యాంటిజన్ వాడకుండా పిల్లలు పుట్టినప్పుడు వారికి ఎరిత్రో, బ్లాస్టోసిస్ ఫిటాలిస్ అనే జబ్బు వస్తే పుట్టిన వెంటనే ఎక్స్‌చేంజి ట్రాన్స్‌ఫ్యూషన్ చేయటం ద్వారా చికిత్స చేసే అవకాశం ఉంటుంది. అంటే శిశువు శరీరంలోని రక్తం అంతా తీసి వేరే రక్తం ఎక్కించటం అని అర్థం సహజంగా ఆర్ హెచ్. పాజిటివ్ రక్తమే ఎక్కువగా ఉంటుంది**

**పి.వి.ఆర్. – తుని**

నాకు ఇదివరకు ఫైలేరియా వల్ల కాలు వాచింది మందులు, ఇంజక్షనులు వాడాక తగ్గినది కాని కాలు చీలమండ వద్ద కొంచము వాపు ఉంటుంది ఇది తగ్గుటకు మార్గము వున్నదా? నెప్పి ఏమీ లేదు.

★ **ఫైలేరియా వల్ల వచ్చిన వాపు పూర్తిగా తగ్గే అవకాశం చాలా తక్కువ. ఈ రకం వాపులు నొక్కితే గుంటపడవు. ఈ వాపుకి చికిత్స అనవసరం.**

**ఎమ్. కె. – విజయవాడ**

నేను 11వ ఏట నుండి చదువుకి, చూపుకి (+) 13.5 మరియు (+) 12 5 కళ్ళద్దాలు వాడుతున్నాను ఇప్పుడు నా వయస్సు 30 సంవత్సరములు నేను సాంసారిక జీవితానికి పనికి వస్తానా? మా చుట్టాలాయనికి 40 ఏళ్ళ ప్రాయంలోనే కళ్ళు పూర్తిగా కనిపించటం లేదు నాకు 15, 20 రోజుల కొకమారు తలనెప్పి, జ్వరం వస్తుంటుంది ఒక్క నిద్ర, స్నానం సమయంలో తప్ప మిగతా సమయాలలో కళ్ళద్దాలు వుంటాయి.

★ **మీరు వ్రాసినట్లు మీకు ఇవ్వబడిన కళ్ళద్దాల పవరు +• (ప్లస్) అవునాకాదా అనేది నా అనుమానం. మామూలుగా చిన్న వయస్సువారికి – (మైనస్) పవర్ వుండటం సహజం.**

**కళ్ళ పవర్‌కి సాంసారిక జీవితానికి ఏమీ సంబంధం లేదు. పవర్ ఇంత అధికంగా ఉన్నప్పుడు వెంట వెంటనే నిపుణుల వద్ద పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది. దీనివల్ల జ్వరం వచ్చే అవకాశం ఉండదు. ఇంత పవర్‌అధికంగా వుండటానికి కెరటో కోనస్ అనే కళ్ళ రోగం కారణం అయి వుండవచ్చును. దీనికిగాను నిపుణుల చేత పరీక్ష చేయించుకోవాలి.**

**ఎం.పి.ఆర్. – కలవలపల్లి**

ట్యుబెక్టమీ ఆపరేషన్ చేయించుకున్న తర్వాత ఎన్నాళ్ళకు రతిలో పాల్గొన వచ్చును?

★ **కనీసం రెండు మూడు నెలలు ఆగటం మంచిది. శారీరకంగా ఏవిధమైన కష్టమూ లేకపోయినా మానసిక తృప్తి కోసం ఇలా ఆగటం మంచిది.** □

## మనయ్య మరణం

ఒక కూలిని.

ఆ కూలి మనయ్యను పిచ్చివాడిలా చూసి, "ఇంకా నీకు తెలియలేదా? మా ఊళ్ళో కుళాయిలు వేస్తున్నాము అంటే అందరి ఇళ్ళలోకి మంచినీళ్ళు వాటంతట అవే వచ్చేస్తాయి కుళాయి తిప్పితే ఎన్ని నీళ్ళు కావాలంటే అన్ని నీళ్ళు వాడుకోవచ్చు. ఇలా నీళ్ళు మోసుకుంటూ కష్టపడక్కరలేదు" అన్నాడు జాలిగా.

అనేక వందల పిడుగులు ఒకేసారి తల మీద పడినట్లయి కూలిపోయాడు తన జీవనాధారాన్ని ఎవరో లాక్కుపోతున్నట్లుగా దిగాలు పడ్డాడు

ఆ రోజు ఏ ఇంటికి నీళ్ళు మోసుకు వెళ్ళినా, ఒకే మాట మా ఇంట్లోనూ, కుళాయి వేయించుకుంటున్నామని.

ఊళ్ళో వాళ్ళు మన ఊరికి నీటి దరిద్రం వదిలింది అన్నారు.

ఊరికి వదిలిన దరిద్రం తనకు పట్టుకుందనుకున్నాడు మనయ్య.

ప్రభుత్వం చేయదలచుకొన్న పనులన్నింటినీ చక, చకా పూర్తి చేసింది వీధి కొక కుళాయి చేయించింది ఆ కొత్త కుళాయిలతో వీధులన్నీ కొత్త పెళ్ళి కూతుళ్ళ లాగా కళకళలాడుతున్నాయి

ఆ వాడలోని వాళ్ళకే కాదు, ఈ ఊరిలోని వాళ్ళకు కూడా మనయ్యతో అవసరం తీరింది

కావిడి భుజాన వేసుకొని పది సంవత్సరాలయింది. పది సంవత్సరాలలోనూ ఊరి వాళ్ళలో మనయ్య పట్ల అభిమానం పెరిగిందే కాని తరగలేదు

ఆ కొళాయిలు వచ్చిన దగ్గర నుంచి అందరూ తనకు దూరమయ్యారని బాధ పడటం మొదలు పెట్టాడు.

కన్నతండ్రిలా ఆదరించి, కష్టంలోను, సుఖంలోను దరి చేర్చుకున్న కరణం గారు కాలం చేశారు

తన కష్టాన్ని తీర్చే నాథుడు ఎవరూ లేరు కనపడిన వాళ్ళందరిని అడిగే వాడు తనకేదైనా మార్గం చూపించమని

"నీకు నీళ్ళు తెచ్చి పోయడం తప్ప ఇంకేం పని చేతనవును" అంటూ ఎకసెక్కాలాడే వారు కుర్రకారు.

పట్నం వాసనలను అణువణువుగా అలంకరించుకొంటోంది ఆ ఊరు పల్లెలోని ప్రజలు కూడా ప్రక్కింట్లో ఏం జరుగుతుందో కూడా గమనించడం మానేశారు

ఆలోచించి, ఆలోచించి చివరకు ఒక నిశ్చయానికి వచ్చాడు

తనకు ఆ ఊరికి ఋణం తీరిపోయిందనుకున్నాడు తన అవసరం ఆ ఊరి వారికి అక్కర లేదని తెలుసుకున్నాడు అంత వరకు ఆ ఊరి వారి ఆదరణతో, ఆప్యాయతతో పెంచుకున్న శరీరం వారి నిరాదరణకు తట్టుకోలేక పోతోంది వీధిన ఉన్న ప్రతి కొళాయి తనను అపహాస్యం చేస్తున్నట్లుగా భావించాడు ఆ అపహాస్యాన్ని తట్టుకోలేని మనయ్య ఒక కొళాయి దగ్గరకు చేరాడు తన తలను ఆ కొళాయికి వేసి కొట్టుకుంటున్నాడు. కొట్టుకొని, కొట్టుకొని అలసిపోయాడు రక్తం కుళాయి వెంట నీరులా కారింది

చిట్లిన మనయ్య తల శాంతి కోసం కొట్టిన గుమ్మడి కాయలా ఉంది

ఊరంతా నిశ్శబ్దంగా నిద్దరోతుంది.

నోరులేని జీవాలు మూగగా రోదిస్తున్నాయి.

తెల్లవారింది ఊరంతా లేచింది మనయ్య కొళాయి వద్ద మరణించాడన్న వార్త ఊరంతా గుప్పుమంది

ఒక్కొక్కరు ఆ కొళాయి వద్దకు చేరుతున్నారు మనయ్య మంచితనాన్ని పొగుడుతున్నారు బతకని బిడ్డ బారెడన్నట్లు అందరి నోటి నుంచి మనయ్యను గురించిన పొగడ్తలే.

రాత్రి మనయ్య మరణం చూసిన చందమామ మబ్బులో మెల్లగా జారుకుంటోంది తనను ఎవరైనా సాక్ష్యం అడుగుతారేమోనని!

సూర్యుడు ఠీవిగా ఉదయిస్తున్నాడు తననెవరైనా సాక్ష్యం అడిగితే నాకేమీ తెలియదు అని చెబుదామన్న ధీమాతో

మనయ్య జీవితం మట్టి కలిసింది * □

# ఫాల్గుణి డైరీ

## కొంగని మించిన పక్షి!

పక్షులన్నిటిలో ఆస్ట్రేలియా దేశానికి చెందిన ఆస్ట్రిక్ అనే పక్షి చాలా పెద్దదట ప్రపంచంలో ఇంత కన్నా పెద్ద పక్షి లేనేలేదట దీని ఎత్తు ఏడున్నర అడుగులట – వోరి బా బో!

## వెయ్యికి రెండు వేలూ ఏడాది జైలూ!

విశాఖపట్నణం నక్కపల్లికి చెందిన పోలీసు సబ్ ఇనస్పెక్టర్ మూర్తిగారు ఓ కేసు సంబంధంగా వెయ్యి రూపాయలు లంచం పుచ్చుకుంటూ పట్టుబడిపోయాడట ఆయనకు కోర్టు ఓ ఏడు కఠిన శిక్షాష్టస్ రెండు వేలు అపరాధమూ విధించిందట!

## దొంగస్నేహితులు!

నర్సారావుపేటలో వో గృహిణి పద్మావతి అనే ఆవిడ జూన్ తొమ్మిదో తేదీ రాత్రి ఏడున్నర గంటలకు టి వి. చూస్తూండగా ఆమె కొడుకుకోసం వచ్చినట్టు వో ముగ్గురు కుర్రాళ్ళు వచ్చి, రక్కున చాకులు చూపి బెదిరించి 60 కాసుల బంగారం, 1500 నగదు తీసుకుని అప్పుడే వచ్చిన వాళ్ళబ్బాయి మెళ్ళో బంగారు గొలుసు కూడా తీసుకుని పోలీసులకు చెప్తే చంపేస్తామని బెదిరించి చక్కా పోయారట

## పురుషుడి బుర్రే బరువెక్కువ!

సాధారణంగా సాధారణ మానవుని మెదడు 49 ఔన్సుల బరువు. స్త్రీ మెదడు బరువు 44 ఔన్సులూ వుంటుందట

## చిక్కిపోతున్న చలన చిత్రాల సంఖ్య!

దక్షిణ భారత దేశంలో 1986వ సంవత్సరంలో సినిమాలు తక్కువ రిలీజయ్యాయట. 1985లో మొత్తం 632 అయితే 1986లో 577 అట! తెలుగులో 198 నుంచి 192 కు పడిపోతే, తమిళ సినిమాలు 190 నుంచి 154 కు తగ్గిపోయాయట ఈ 577 చిత్రాలలో 120 కేవలం డబ్బింగు చిత్రాలేనట మొత్తం మీద హోల్ ఇండియాలో 1986 లో చిత్ర నిర్మాణం సంఖ్య బొత్తిగా తగ్గిపోయిందట – మంచిదేగా?




## వింత ఆచారం!

మధ్యప్రదేశ్‌లో వో వింత వివాహాచారం వున్నదట పెళ్ళి ముహూర్తం రోజున పెళ్ళికుమార్తె వో కత్తి పుచ్చుకుని పెళ్ళి కుమారుని మీదికి ఎగబడి అతని కనుబొమ్మలు శుభ్రంగా షేవ్ చేసి పారేస్తుందట అంతే! ఆ పని అవగానే పెళ్ళయి పోయినట్టే లెక్కట అంతే గాక ఆమె తన భర్త కనుబొమ్మలను ఎదగనీయక రెగ్యులర్‌గా షేవ్ చేస్తూ వుండాలట!

## నిస్సహాయ మరణం!

పెడనకు చెందిన 19 ఏళ్ళ నాగమణి భర్త పని వెతుక్కుంటూ రాజమండ్రి వెళ్ళాడట ఎన్నాళ్ళయినా అతని ఖబురూ తెలియక, అతని వద్ద నుంచి డబ్బురాక, యిల్లు గడిచే పరిస్థితీ లేక నాగమణి తన మీద తానే కిరసనాయల్ పోసుకుని, నిప్పంటించుకు చనిపోయిందట ఈ చావుకు హత్య కాదు గదా అనే అనుమానాలూ వున్నాయట మంటల్లో నాగమణి ఏవిధమైన కేకలూ వేయలేదని, ఆమె కాలి చనిపోయిన పక్కనే ఆమె కూతురు నిద్ర పోతూ వుందనీ, ఆ పాప కూడా లేవలేదనీ అనుమానిస్తున్నారట

## తక్షక సంతతి 1670 రకాలు!

ప్రపంచంలోని పాములలో సుమారు 1670 రకాలున్నాయట వీటిలో మన దేశంలో సుమారు 180 రకాలున్నాయట వీటిలో కింగ్ కోబ్రా అనే జాతి చాలా విషం కక్కగలదట మామూలు తాచు పాముకు సుమారు ఆరు రెట్లు విషాన్ని అది కక్కగలదట ఆఫ్రికాలో విషాన్ని ఉమ్మి వేయగలిగే వో జాతి భయంకర సర్పం వుందట అది తన ఎదుట నిలబడిన జీవి మీద గురి చూసి విషాన్ని ఉమ్మి వేయగలదట

## వ్యసనాలకు పరిష్కారం ఉరి!

అనంత్‌నాగ్‌కు చెందిన బటకోటి గ్రామంలో 45 ఏళ్ళ అమామిర్ అనే ఆయన కొడుకు గులామ్‌నబి విపరీత మైన చెడు వ్యసనాలు, తాగుడే గాక, మత్తు పదార్థాలకు కూడా బానిసై పోయి, జీవచ్ఛవంలా బ్రతుకుతూండడం చూసిన ఆ తండ్రి యిహ తన కొడుకును ఏ దేవుడూ రక్షించ లేడని నిర్ణయించి, మత్తులో వున్న తన కొడుకును ఉచ్చులో వేసి, ఉరి పోసి చంపేశాడట ఆ నబికి వివాహమై మూడు నెలలయిందట – పాపం!

## పసి పాపపై అత్యాచారం!

ఢిల్లీ బారాహిందూరావ్ పోలీస్ స్టేషను పరిధిలో వుంటున్న మహమ్మద్ మియాన్ అనే వో 16 ఏళ్ళ కుర్రాడు కామోద్రేకాన్ని చంపుకోలేక కంటికి కనుపించిన రెండున్నర సంవత్సరాల పసి పాప మీద తన కామ దాహాన్ని తీర్చుకున్నాడట ఈ నేరానికి రెండు వేలు జరిమానా, పది ఏళ్ళు కఠిన కారాగార శిక్షాపడ్డదట

## బట్టతలలకు శుభవార్త

యునైటెడ్ స్టేట్స్‌కు చెందిన వో మందుల కంపెనీ బట్టతలపై జుట్టు రావడానికి ఉపయోగ పడే వో మలామాను తయారు చేసిందట ఈ తైలం బట్ట తలకు పట్టించి మర్దిస్తే జుట్టు మొలుస్తుందని ఆ కంపెనీ చెప్పిందట. బి ట్రైయిల్స్ లో యీ మందు తయారై విశ్వ వ్యాప్తంగా అమ్మకం కొనసాగించ గలదని ఆ కంపెనీ అన్నదట

## కట్నంగా కారడిగితే దేహశుద్ధి!

కాన్పూరుకు చెందిన కౌతినాగంజ్ అనే వూళ్ళో వో వివాహం జరుగుతోందట. మధ్యలో పెళ్ళి కొడుకు అలిగి తనకు వో కారు యిస్తే తప్ప పెళ్ళి కూతురిని పెళ్ళి చేస్కోననీ, పెళ్ళి తంతులోకి దిగననీ మంకు పట్టు పట్టాడట కారిచ్చే వోపిక వుంటే నీ కన్నా ఘనుణ్ణే వరుడుగా తెచ్చునని పెళ్ళి కూతురు తండ్రి వగచాడట ఎంతకీ ఆ కుమారుడు దిగి రాక పోవడంతో ఆడపెళ్ళి వారికి పెళ్ళి కూతురుతో సహా




కోపం వచ్చి అతని బట్టల్ని బదా... చింపేసి ఆడంగులంతా చేరి అతన్ని ... యీ పెళ్ళి నీకు సరియైనది అన్నారట దాంతో ఆ పెళ్ళి కొడుకు పెళ్ళివదిలి పరారైపోయాడట – భళా! □

# హైదరాబాద్ నోట్‌బుక్

## తెలుగు పత్రిక ఆవిష్కరణ

తెలుగు అకాడెమీని రద్దు చేసే ఉద్దేశం మా ప్రభుత్వానికి లేదు తెలుగు అకాడెమీ, మరికొన్ని సంస్థలు చేసే పనులలో డూప్లికేషన్ లేకుండా చేయడానికి నిశ్చయించాం అందువల్ల తెలుగు విశ్వవిద్యాలయం చేసే పరిశోధన మొదలయిన పనులు, అకాడెమీ పనులు ఒక్కటే కాకుండా తెలుగు అకాడెమీ బరువును కొంత తగ్గించదలచాం - అన్నారు రాష్ట్ర విద్యాశాఖా మాత్యులు శ్రీ గాలి ముద్దు కృష్ణమనాయుడు ఫిబ్రవరి 7వ తేదీన తెలుగు అకాడెమీ భవనంలో తెలుగు మాసపత్రికను ఆవిష్కరిస్తూ వసవారు మాతృభాషలో చదివితే విశేషంగా గ్రహిస్తారు కాబట్టి విజ్ఞానశాస్త్ర, వైద్యశాస్త్రాదుల వంటి అంతర్జాతీయ వ్యాప్త విషయాలు తప్ప తక్కినవన్ని మాతృభాషలో బోధించడం ముఖ్యం ఆ బోధనకు వివిధ పాఠ్య పుస్తకాలు కావాలి వాటిని అకాడెమీ సిద్ధపరుస్తుంది అకాడెమీ వ్యాపార సంస్థ కాదు ప్రజాసేవే ప్రధాన లక్ష్యంగా గలది ఈ సంస్థ సిద్ధపరచే పాఠ్య పుస్తకాల విక్రయానికి అనంతపురం, తిరుపతి, కరీంనగర్, విజయవాడలలోను, మరి రెండు చోట్ల - మొత్తం ఆరు కేంద్రాలు స్థాపించదలచాము ఫొటో టైప్ కంపోజింగ్ యూనిట్ ఏర్పాటు చేయదలచాము ట్రాన్స్‌లేషన్ బ్యూరోను కూడ పెట్టదలచాము - అనికూడ మంత్రి అన్నారు ఈ తెలుగు పత్రిక తన లక్ష్యాలను నిర్వహిస్తూ జనప్రియం కాగలదని ఆశిస్తున్నానని ఆయన అన్నారు మాజీమంత్రి డాక్టర్ ఎం ఆర్. అప్పారావు ఈ ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించారు స్వాతంత్ర్యానంతరం తెలుగు భాషాభివృద్ధిని గురించి, విశ్వవిద్యాలయాలలో జరిగిన మార్పును గురించి డాక్టర్ అప్పారావు సమీక్షిస్తూ, ఎం ఎ ఎ పెచ్‌డి పరీక్షలు తెలుగు వ్యవహార భాషలో జరుపవచ్చునని నిశ్చయించామని, మనం త్రిభాషా సూత్రాన్ని కచ్చితంగా అమలుపరచినట్లే ఉత్తర భారతంలోని రాష్ట్రాలు కచ్చితంగా అమలుపరచి తెలుగు మున్నగు దక్షిణాది భాషలను బోధించి గౌరవించాలని కోరారు నవోదయ పాఠశాలలలో త్రిభాషా సూత్రం కచ్చితంగా పాటించాలని, ఆ పాఠశాలలు దేశసమైక్యానికి ప్రయత్నించాలి కాని, దేశవిచ్ఛిత్తికి కారణం కారాదని ప్రభుత్వానికి తాము గట్టిగా చెప్పినట్టు ఆయన అన్నారు నిత్య వ్యవహారంలో వున్న రేడియో, రోడ్డు వంటి మాటలను వాడుకోవాలని, చాదస్తానికి పోరాదని ఆయన అన్నారు శ్రీమతి గాలి ప్రభావతి 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' ప్రార్థన తర్వాత అకాడెమీ డిప్యూటీ డైరెక్టర్ డాక్టర్ ముకురాల రామిరెడ్డి స్వాగత వచనాలు పలికిన మీదట అకాడెమీ డైరెక్టర్ పత్రిక ఉద్దేశాలను వివరించారు 16 సంవత్సరాలుగా ఈ పత్రిక త్రైమాస పత్రికగా ఉన్నదని, ఇప్పటి నుంచి మాసపత్రికగా వెలువడుతున్నదని చెప్పారు తెలుగు మాధ్యమం ద్వారా చదివే 75 శాతం విద్యార్థులకు శాస్త్ర విషయాలకు చెందిన ఆధునిక సాహిత్యం, వాటిలో త్వరితగతిని జరుగుతున్న పరిణామాలు ఎప్పటికప్పుడు లభ్యం కాకుండా పోతున్నాయి అందువల్ల విద్యలో ఉద్యోగాలకు చెందిన పోటీ పరీక్షలలో, పై చదువులకు చెందిన పోటీ పరీక్షలలో పరిశోధనలో తెలుగుమాధ్యమం విద్యార్థులు వెనుకబడి పోతున్నారు దానిని తొలగించడానికి పూనుకున్న ఈ పత్రిక ఉద్దేశాలివి వైజ్ఞానికరంగంలో వస్తున్న పరిణామాలను ఎప్పటికప్పుడు తాజాగా అందించడం, స్వేచ్ఛాయుత వాతావరణంలో తెలుగులో భావప్రకటనకు అవకాశం కల్పించడం భావప్రకటనకు అడ్డుగోడలు, అవరోధాలు కల్పించకుండా భాషాకల్పనకు భాష వాడుకకు స్వేచ్ఛాయుత వాతావరణం కల్పించడం, స్వేచ్ఛానువాదాలను ప్రోత్సహించడం విద్యార్థి విభాగం ద్వారా విద్యార్థులలో రచనా వికాసం కలిగించడం ఉత్తమ రచనలను ప్రచురించడానికి విద్యార్థి రచయితలను, ఇతర రచయితలను బహుమతుల ద్వారా ప్రోత్సాహం కలిగించడం చౌకధరకు విద్యార్థులకు అధ్యాపకులకు పరిశోధకులకు ఆకర్షణీయంగా అందరవంతంగా 'తెలుగు' మాసపత్రిక అందుబాటులో ఉండేటట్టుగా చూడడం, తెలుగునాడు మారుమూలల్లో కూడ విద్యావంతులకు తెలుగు మాసపత్రిక ద్వారా తెలుగులో విజ్ఞానాన్ని అందించడం - అని శ్రీ కొండలరావు వివరించారు ఈ పత్రికకు శ్రీ కొండలరావు ప్రధాన సంపాదకులు డాక్టర్ జి చెన్నకేశవరెడ్డి నిర్వాహక సంపాదకులు ఈ సంచికలో ఉన్న వ్యాసాలివి - భాషా సాహిత్య విభాగం - భాష ఆలోచన సమాజ సంస్కృతి డాక్టర్ జి ఎ సుబ్రహ్మణ్యం కళానుభూతి డాక్టర్ తుమ్మపూడి కోటేశ్వరరావు మానవీయ సామాజిక శాస్త్ర విభాగం - దక్షిణ భారతదేశ విద్యాలయాలలోని వాణిజ్య శాస్త్రంలో పరిశోధన డాక్టర్ జి సత్యనారాయణ భారతీయ గ్రంథసూచి డాక్టర్ వెలగా వెంకటప్పయ్య ప్రభుత్వరంగం కలిగిన పరిశ్రమలకు పరిమితం కావాలి డాక్టర్ ఆర్ వి చెల్లయ్య, పైరవీ కారు: డాక్టర్ జి రామిరెడ్డి, డాక్టర్ జి హరగోపాల్ విజ్ఞాన సాంకేతికశాస్త్ర విభాగం - మానవుని అద్వితీయత - వ్యక్తిత్వ ప్రాతిపదిక డాక్టర్ ఓ. ఎస్. రెడ్డి, ఉత్ప్రేరకంతో కాంతి రసాయనికంగా నైట్రోజన్ స్థిరీకరించడం డాక్టర్ ఎం ఎం తక్కీఖాన్ మేఘాలు వాటి వాతావరణ ప్రాముఖ్యం . డాక్టర్ వి పి సుబ్రహ్మణ్యం పెట్రోలియం ఉద్భవం వ్యాప్తి డాక్టర్ టి వి ఎస్ ఆర్ క్షీరసాగర్ పట్టుపురుగు మల్బరీఆకులను మాత్రమే ఎందుకు ఆహారంగా తీసుకుంటుంది? డాక్టర్ ఏ రామమోహనరావు, డాక్టర్ ఎం రమేశ్‌బాబు భూజల వనరుల అభివృద్ధికి క్రమబద్ధమైన ఉపాగమం డాక్టర్ వి ఎల్ ఎస్ విమశంకరం రసాయనిక చర్యలు ఎందుకు జరుగుతాయి? డాక్టర్ బి సేతూరామ్ విజ్ఞాన విశేషాలు డాక్టర్ కె బి గోపాలం సిద్ధాంత వ్యాసం గ్రహం డాక్టర్ మొదలి వెంకట పూర్వం తెలుగు భాష న్యాయ వేదాంతగణిత వైద్యాది శాస్త్రాల వివరణ ఎలా ఎలాంటిగా చాలావరకే ఎంతగా అభివృద్ధి చెందింది అను [illegible]

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మంత్రి శ్రీ గాలి ముద్దుకృష్ణమ నాయుడు తెలుగు అకాడెమి వారు ప్రచురించే తెలుగు మాసపత్రికను ఆవిష్కరిస్తున్న సందర్భంగా తెలుగు అకాడెమి డైరెక్టర్ శ్రీ వి కొండలరావు మాజీ మంత్రి శ్రీ ఎం ఆర్ అప్పారావుగారు సమక్షంలో [illegible]



ఈ వ్యాసాలన్నీ చూచిన ఎడప ఆదునిక శాస్త్రాలను వివరించడంలోను మన భాష ఎంత సమర్ధమైందని ఆశ్చర్యం కలుగుతుంది ఈ ప్రమాణం ఇక మీదనూ చెక్కు చెవరదని నమ్మినాను సంపాదక మండలి సభ్యులందరూ విశ్వవిద్యాలయాల వారే వీరిక ప్రజాసామాన్యంతో అంతగా సంబంధం వుండదనే భావం ప్రజలలో వుంది. కనుక విశ్వవిద్యాలయాలకు వెలుపల వున్న వివిద రంగాల పరిశోదకులనూ ఈ మండలిలో చేర్చుకోడం ఉచితం దానివల్ల ఈ పత్రిక కేవలం పాఠ్యపుస్తకం లాగ కాక జనరంజకంగాను అయి విజ్ఞాన వ్యాప్తికి మరింతగా తోడ్పడుతుందని భావిస్తున్నాను ఈ పత్రిక విడపత్రిక ధర ఐదు రూపాయలు సంవత్సరం చందా 60 రూపాయలు ఆవిష్కరణోత్సవం పత్రిక నిర్వాహక సంపాదకులు డాక్టర్ జి చెన్నకేశవరెడ్డి వంచన సమర్పణతో సమాప్తమైంది

## మూడు కావ్యాల ఆవిష్కరణ :–

ఫ్రిబవరి 10 వ తేదీ సాయంకాలం అశోక్‌నగర్‌లోని ఎటీ సెంట్రల్ లైబ్రరీలో సాహితీ చైతన్య శ్రీ పోతుకూచి సాంబశివరావు అధ్యక్షతన మూడు కావ్యాల ఆవిష్కరణ జరిగింది వీటిలో రెండు కావ్యాలు మాజీ పెన్షన్ పేమెంట్ ఆఫీసర్, సరసవ్యంగ్య కవి శ్రీ ఎన్ సి శేషాచార్యులు రచించిన కలువు మొక్కలు, ప్రతిబింబాలు మూడవది శ్రీ బాలాంత్రపు వీర్రాజు రచించిన ఆంధ్ర మేఘసందేశం ఈ ఆవిష్కరణ సాధన సాహితీ స్రవంతి పంచమ వార్షికోత్సవం సందర్భంగా జరిగింది ఈ సంస్థ 1982 లో స్థాపితమై సాంస్కృతిక సాహిత్య సేవారంగాలలో వివిధ కార్యక్రమాలు నిర్వహిస్తున్నది ఆవిష్కరణోత్సవం శ్రీ జి వి ఎస్ ఎల్ నరసింహరావు స్వాగత వచనాలతో ప్రారంభమైంది అధ్యక్షులు శ్రీ సాంబశివరావు తమ ప్రసంగంలో భారతీయ సంస్కృతిని తెలుసుకొని, దానిని రక్షించవలసిన అవసరం గురించి వివరించారు నేడు ఆవిష్కరింపబడిన రచనల వల్ల జీవిత గమ్యం స్పష్టమవుతుందన్నారు సుప్రసిద్ధ విద్వాంసులు డాక్టర్ ముదిగొండ శివప్రసాద్ కావ్యాలను ఆవిష్కరిస్తూ శ్రీ ఎన్ సి శేషాచార్యుల ముక్తకాలలోని వ్యంగ్య వైభవాన్ని, ఆంధ్ర మేఘసందేశంలోని సందేశమాధుర్యాన్ని విశదీకరించారు ప్రముఖ విద్వాంసులు శ్రీయుతులు వై వి రామకృష్ణరావు, జె యజ్ఞనారాయణ, డాక్టర్ చింతా వేంకటేశ్వర్లు కావ్యాల విశేషాలను గురించి ప్రసంగించారు కవుల కృతజ్ఞతా ప్రకటన తర్వాత ఉత్సవం సమాప్తమైంది

## ఉపశ్రుతి :–

దాదాపు ఎదు దశాబ్దాల క్రితం అందరూ బిరుదుల కోసం ప్రాకులాడుతూంటే శ్రీ టేకుమళ్ల అచ్యుతరావు గారిని ఎవరో అడిగారుట ఏమి సార్ మీరు ఏ మహోపాధ్యాయ, మహామహోపాధ్యాయ బిరుదం కోసం ప్రయత్నించడం లేదే – అని. నేను అసలే ప్రధానోపాధ్యాయుణ్ని నాకు మరొక ఉపాధ్యాయి బిరుదం ఎందుకండీ? – అన్నారట చలోక్తిగా ఆయన –తిరుమల రామచంద్ర

## వ్యక్తిగతం



భారత జాతి అతి క్లిష్టమైన పరిస్థితిని ఎదుర్కొంటున్న సమయంలో అపూర్వ మైన సాహసాన్ని ప్రదర్శించిన నాయకుడుగా నేతాజీ సుభాష్ చంద్ర బోస్‌ను భారతీయులందరూ గౌరవిస్తారు. భారత ప్రభుత్వం మాత్రం నేతాజీ కుమార్తె శ్రీమతి అనితా బోస్‌ను నిరాదరించి ఆమె బాధతో వెనుదిరిగి పోయేలా చేసింది. కలకత్తాలో జనవరి 23న జరిగిన నేతాజీ 90వ జన్మదినోత్సవ సదస్సులో పాల్గొన డానికి డా శిశిర్ బోస్ ఆహ్వానంపై ఆమె భారత దేశం వచ్చారు పశ్చిమ జర్మనీ లోని ఆగ్స్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో ఆమె ఆర్థిక శాస్త్రంలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు. 1942 లో జన్మించిన అనితాబోస్ భారతదేశాన్ని గతంలో రెండు సార్లు సందర్శించారు మొదటి సారి 1961లో వచ్చినప్పుడు ఆమె నెహ్రూ కుటుంబంతో పాటు తీన్‌మూర్తి భవన్‌లో ఉన్నారు రెండో సారి 1979 లో వచ్చారు జనవరి 23న కలకత్తాలో సదస్సు తర్వాత రాష్ట్రపతి ఆహ్వానంపై ఆమె రిపబ్లిక్ దినోత్సవాలని తిలకించడానికి ఢిల్లీ వచ్చారు జనవరి 30న ఆమె గౌరవార్థం రాష్ట్రపతి ఒక విందును ఏర్పాటు చేశారు ఆమె భారత దేశ పర్యటన మొత్తంలోనూ అధికార పార్టీ నాయకులు ఆమెను పూర్తిగా విస్మరించినట్టు ప్రవర్తించారు ప్రచార సాధనాలలో ఆమె గురించి ప్రస్తావన లేకుండా చూశారు. రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా ఎదురు పడినప్పుడు ప్రదాని ఆమెను "మీరు నేతాజీ మనుమరాలు కదూ!" అని అడిగారట." వాళ్ళు భయపడుతున్నది నా గురించి కాదు, నా తండ్రి ప్రతిష్ఠ గురించి. వాళ్ళిట్లా ప్రవర్తించడం చాలా సంకుచితం" అని ఆమె అన్నారట..... □



విదేశ వ్యవహారాల నిపుణుడు, దౌత్యవేత్త శ్రీ ఎ. పి. వెంకటేశ్వరన్ హఠాత్తుగా, అవమానంతో పదవి నుంచి వైదొలగ వలసి వచ్చింది. అనేక దేశాలలో భారత రాయబారిగా, దౌత్య అధికారిగా పని చేసిన శ్రీ వెంకటేశ్వరన్ పది నెలల క్రితమె భారత విదేశాంగ శాఖ కార్యదర్శిగా నియమితులయ్యారు ఆయన కంటే ముందు ఈ పదవిని నిర్వహిస్తున్న శ్రీ రమేష్ భండారీ రిటైరయ్యాక శ్రీ వెంకటేశ్వరన్ దానిని స్వీకరించారు ఆయనను ఆ పదవి నుంచి మారుస్తున్నామని అదికారికంగా ఆయనకు తెలియజేయ కుండానే, ప్రధాని పత్రికా సమావేశంలో ఒక ప్రశ్నకు జవాబుగా కొత్త విదేశాంగ కార్యదర్శి గురించి ప్రస్తావించారు ఈ అవమానాన్ని భరించలేని శ్రీ వెంకటేశ్వరన్ తన పదవికి రాజీనామా చేశారు వర్ణ వివక్షతకు వ్యతిరేకంగా యువజన కాంగ్రెస్ నిర్వహించిన అంతర్జాతీయ సమావేశం గురించి నిర్మొహమాట మైన అభిప్రాయాలు ప్రకటించినందు వల్ల, స్వతంత్ర ఆలోచనతో, నిర్దిష్టమైన వైఖరిని ప్రకటిస్తున్నందు వల్ల ఆయన ప్రధాని అనుగ్రహాన్ని కోల్పోయారు ఫలితంగా ప్రతిభావంతుడైన ఒక విదేశ వ్యవహారాల నిపుణుడు అర్ధాంతరంగా పదవి నుంచి వైదొలగవలసిన స్థితి ఏర్పడింది □




Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667



# దూరదర్శనం

## లత

శుక్రవారం 13–2–87

నిన్న మిత్రులు ఓన్నాల రంగనాదరావు గారు బగవత్సాయుజ్యం పొంద రన్న వార్త విన్నాక ఏమీ వ్రాయలేక పోయినాను నకాబ్ చివరి బాగం అద్భుతంగా ముగించాడు అమోల్ పాలేకర్ అనిల్ ఛటర్జీ నటన అమోఘం ఇహనుంచి నేను లవ్ కుమార్‌ని కాదు లవ్ బాబాని అని వాక్యాన్ని అంగీకరించి కుక్కతో ఆడుకుంటుండగా ముగింపు ఇవ్వటంలో వర్ణకుడి మేదస్సు ద్యోతక మవుతోంది

ఈ రోజు వాంయూస్తాని సంగీతంతో ప్రారంబ మయింది టి వి – ఇద్దరు గాయకుల యుగళగానం – అంటే జుగల్‌బంది

### మీరు తాగే పాలు

వ్యవసాయ దారుల కార్యక్రమం ఇందులో పాల వర ఆకాశాన్నంటించని వ్యాఖ్యాత చెప్పకూడదు కనక చెప్పలేదు ఆ విషయాన్ని గురించి ఆలోచిస్తే వారానికి నాలుగు లక్షల లటర్ల కలకత్తా ఎక్స్‌పోర్టు చేయటం ఆపేస్తే ఇక్కడ చవక అవుతయ్యేన్న ఆర్థిక సూత్రం మార్క్సు మహాశయుడికి వదిలేసి మన స్వార్థాన్నీ, మన రైతుల మట్టతనాన్ని మన తెలుగు గేదెల సౌందర్యాన్నీ మన దేశంలో కేవలం ఆరు లక్షల పాలపాకెట్లు విడుదలవుతుంటే మిగతా ఎన్ టి. ఆర్ గారి సోదరులూ బహుశా తెలుగు సారా తెలుగు కల్లూ వగైరాలు సేవించి సుర లవుతున్నారని అనందిద్దాం

* * * * *

ఏదో నృత్యం – ఒక మాదిరిగా ఉంది ప్రతి రోజూ నాట్యం చూసి తీరాలని రూలుందా? లేక వారా లిచ్చినట్లు – రోజూ ఒకరికివ్వాలని ఏమన్నా మరో రూలుందా? టి వి కే తెలియాలి ఓలేటి పార్వతీశం గారు కాకినాడ ప్రేక్షకుల్ని మాత్రమే మెచ్చుకున్నట్లు?

ఆనందశంకర్‌ట బాగానే ఉంది నాట్యం కాని నాట్యం డోసు ప్రేక్షకులకి ఎక్కువయి వికటించ-కుండా చూసుకోవాలి టి వి ని నిర్వాకం చేసే-వాళ్ళు

### ఇంద్ర ధనుస్సు

ఈ వారం కథ సన్మానం

కద– యర్రం శెట్టి శాయి – దర్శకత్వం దేవదాసు కనకాల

నాటకం డైరెక్షన్ బాగుంది సెటైరికల్‌గా ఉంది అయితే హైద్రాబాద్‌లో అలాటి రచయిత్రులూ–కవులూ ఉన్నారని శాయి మాకందరికీ తెలియ చెప్పటం బాగానే ఉంది గాని శాయి జాగ్రత్తగా టి వి చాన్సులు మూడు కొట్టాడు వెంట వెంటనే అలాటి రచయితలు కూడా రాజదానీ నగరంలో నివసించి మమ్మల్ని ధన్యుల్ని చేస్తున్నందుకు – మా గ్రామదేవత దుర్గమ్మ తల్లికి సన్మానం చేయాలి

### ఏక్ కహానీ

ఏక్‌కహానీ– కార్యక్రమంలో ప్రతీక్ష– పంఢరినాద్‌తో మరీ– రచన- ఈ మరాటీ కద మత్స్యకన్యల మీద – నోసే ఇందులో కథానాయిక పల్లెకారుల్ని సముద్రం రక్షిస్తుందన్న విశ్వాసం వారిజాతిలో ఉంది వారి స్త్రీలను ఇష్టానికి వ్యతిరేకంగా ఎవరైనా బలవంతం చేస్తే సముద్రుడో, భర్త ఆత్మో వచ్చి రక్షిస్తుందని నమ్మకం వీళ్ళలో ఉంది ఆ నమ్మకంతోటే సోనీ సముద్రంలో కలిసి పోయిన భర్త కోసం ప్రతీక్ష చెస్తూ ఉంటుంది అన్ని బాషల్లోనూ ఇలాటి కథలున్నాయి మలయాళంలో తక్కాళి శివశంకర పిళ్ళై రచించిన చెమ్మీన్ ప్రసిద్ధ నవల కథ బాగుంది

### రామాయణం

ఆదివారం 15–2–87 రామాయణంలో విశ్వామిత్ర యాగ సంరక్షణ అయి – సీతా స్వయంవరానికి బయలు దేరుతున్నారు- అశోక కుమార్‌జీ దాన్ని ఆధునిక అణుతత్వానికి ఇంకా అలాటి వాటికీ కల సంబంధాన్ని వ్యాఖ్యానం చేస్తున్నారు రామ చరిత్ర భారత చరిత్ర కదా? కాని రాక్షసుల్ని వికారంగా – రావణుడిని కాముకుడిగా– చూపించేట్లుంది కానివ్వండి చేసేదేముంది? అనేక రోజుల నించి అదే అమల్లో ఉన్న రామాయణం– అయినా అదీ తియ్యగానే- చెరుకు ఏ చివర నుంచి అయినా మధ్య నుంచి అయినా మదురంగా ఉంటుంది రామాయణం అంతే

### ఓల్డ్ ఫాక్స్

హత్యలూ – పోలీసుల అధునాతన ఆయుదాలూ – కార్లలో టెలిఫోన్లూ –కురిసే మంచూ కుక్క విశ్వాసం – హాస్పిటల్ – పసిపిల్ల జన్మించటం లాటివి ఏవో చూపించారు

### జిందగీ – జిందగీ

–ప్రతీ బేడి రచన – మహమ్మదీయుల్లో నాలుగు వివాహాలు న్యాయసమ్మతం కొడుకు పుట్టలేదని మొదట భార్యని ఒదిలి రెండో బార్యని చేసుకొని కొడుకుని కన్నా గాని జీవితంలో బంధనాలు ఒదలవు అందు భార్యా బంధం కన్న పుత్రికాబంధం ఈ వారం మహమ్మదీయుల్లో ఉన్న ఆచారం వల్ల మహమ్మదీయ వనితా లోకం నోరు తెరవకుండా ఎంత మానసిక వ్యధ అనుభవిస్తున్నదో చూపించారు ఇది డాక్టర్ల కథలో మరో పరిచ్చేదం

స్పైడర్ మాన్ మళ్ళీ ఇస్తున్నారు ఫాంటసీ ఎప్పుడూ బాగానే ఉంటుంది హేతువాదులు తిట్టినాసరే

### ప్రస్తావ్

–వాంఛీ సినిమా –– ఇద్దరు స్త్రీలు ఒకడిని ప్రేమించి ఒకరు త్యాగం చేయటం నిన్నటి సినిమా ఇద్దరూ కలిసి ఉండటం నేటి సినిమా ఇందులో మహాదేవి వర్మ పాటలు ప్రేమ గొప్పతనాన్ని గురించి ఆవిడ అతి తేలిగ్గా రెండు పాటలు వ్రాసింది జ్ఞానపీఠ అవార్డు తీసుకున్న ఈ పెద్దావిడ జీవితంలోనూ కవిత్వంలోనూ కూడా ప్రేమ అనేది లేనట్లుంది అందుకే దిక్కుమాలిన ప్రేమ సముద్ర మంత అసూయకి కారణం అని తెలుసుకో లేక – కత్తుల్లాటి ఇద్దరు ఆడవాళ్ళు కలిసి ప్రేమ్మారాదన చేస్తూ ఒక మగవాడినీ – ఒక పిల్లనీ పంచు కుంటారని నమ్మింది ఈ కథా డైరెక్షన్ అన్నీ మదుసూదన్‌ట– పాపం ఇందులో నటించిన వారంతా మోసపోయినా బాగానే నటించారు □

ఏక్ కహానీ "ప్రతీక్ష"లో ఒక దృశ్యం



# ప్రపంచ బాక్సింగ్ టైటిల్ విజేత మైక్ టైసన్



'ది గ్రేటెస్ట్' మహమ్మద్ అలీ



జో లూయిస్ (25 విజయాలు)

క్రీడలలో బాక్సింగ్‌కు ప్రత్యేకత గలదు. ఇతర క్రీడలలో మహిళలు పాల్గొనుటకు చూపే ఆసక్తి బాక్సింగ్ నందు చూపరు అందుకు కారణము ప్రమాదములతో పాటు, కావలసిన మనోనిబ్బరం, చురుకుతనం, శక్తి వారిలో లేకపోవుట అనవచ్చు అమెరికాలో బాక్సింగ్ ఒక వృత్తి, వినోద క్రీడకూడా ప్రపంచ హెవీ వెయిట్ బాక్సింగ్ చాంపియన్‌షిప్ సాదిస్తే ఆ వ్యక్తి కుబేరుడు అయిపోతాడు మొన్న జోలూయిస్, నిన్న మహమ్మద్ అలీ (కాసియస్ మెర్సిలస్ క్లే అసలు పేరు బ్లాక్‌ముస్లిం స్వీకరించి మహమ్మద్ అలీ అయాడు) నేడు మైక్ టైసన్ అత్యధిక రాబడికల క్రీడాకారులు బాక్సింగ్ వీరులు

మైక్ టైసన్ ప్రపంచ హెవీ వెయిట్ బాక్సింగ్ చాంపియన్‌షిప్ సాదించిన వారిలో చిన్నవాడు 20వ ఏట విశ్వ విజేత అయి క్రీడారంగ పండితులను సహితము ఆశ్చర్య పరిచాడు మైక్ టైసన్ 'ముష్టి' దెబ్బ తగిలితే అతిబరువుతో 'ట్రక్' మీద నుండి వెళ్ళితే కలుగు బాద వలే యుంటుంది 1985 మార్చిలో 'ప్రొఫెషనల్'గా టైసన్ మారిన తర్వాత 28 విజయాలు అందులో 26 నాక్- అవుట్‌లతో విశ్వవిఖ్యాతి పొంది ఇటీవలే ప్రపంచ హెవీ వెయిట్ ఛాంపియన్ బిరుదు కైవసం చేసుకొన్నాడు. కెనడాకు చెందిన ట్రివర్ బెర్‌బిక్‌ను మూడు రౌండులలోపు ఓడించి యీ బిరుదు పొందాడు. టైసన్ పేరు రెండు సంవత్సరముల క్రితం అంతర్జాతీయ క్రీడా రంగములో తెలియదు. 1986 ప్రారంభములో ప్రపంచ విజేతల జాబితాలో టైసన్ పేరు ఊహించబడలేదు. కాని గత జూన్ నాటికి 19 రౌండులలో 19 నాక్ అవుట్‌లతో గుర్తింపు పొందాడు. ప్రపంచ హెవీ వెయిట్ బిరుదు కైవసం చేసుకొన్న తర్వాత టైసన్ క్రొత్త ధృవతారగా, యింత వరకు 'బాక్సింగు -రింగు'లో యింత ప్రతిభ గల వ్యక్తి లేడని కొనియాడ బడుచున్నాడు. జోలూయిస్, రాకీ మెర్సిమోనో, మహమ్మద్ అలీలతో సమానముగా పోల్చబడుచున్నాడు.

నేడు ప్రపంచ విజేతగా కొనియాడబడుతున్న మైక్ టైసన్ జీవితం గురించి తెలుసుకొంటె ఆశ్చర్య పోతారు. టైసన్‌కు 11 సంవత్సరముల వయసు యున్నప్పుడు న్యూయార్క్ నగర వీధులలో పని పాటలు లేక మోసములు చేసి జీవించేవాడు. ఒకసారి అతని పెంపుడు పావురము దొంగలించ బడగా అనుమానముపై ఒక వ్యక్తిని తన ముష్టితో కొట్టి గాయపరిచాడు అందుకు శిక్షగా 'రిఫారమ్ యినిస్టి ట్యూట్'కు పంపించ బడ్డాడు రెండవ సంవత్సరము జైలుశిక్ష అనుబవించుచుండగా టైసన్ అనే బాలుని నేరము విషయం పత్రికలలో చదివి 'అమెరికన్ బాక్సింగు గురువు' కజ్ డి అమాటో రక్షించాడు అప్పటికి టైసన్ వయసు 13 ఏళ్ళు చిన్న వయసులో తన ముష్టి బలముతో తిండి సంపాదించుకో గలిగిన టైసన్ బవిష్యత్తులో ప్రపంచ ఖ్యాతి పొందగలనని ఎప్పుడు ఆశించలేదు అగ్రగామి బాక్సింగ్ హీరోలను రూపొందించిన కజ్ డి అమటో తన శిష్యుడు ప్లాయిడ్ ప్యాటర్సన్ 1985 నవంబరులో ఆకస్మికముగా మరణించుటతో మరొక శిష్యుని కొరకు వేట ప్రారంబించాడు అతను టైసన్ పై ప్రయత్నము చేయ నిశ్చయించు కొన్నాడు బాలునిగా యున్న టైసన్ నకు ప్రపంచ హెవీ వెయిట్ చాంపియన్ అగుట అన్ని అర్హతలు ఉన్నవని ఆశించి డి అమటో చెరసాల నుండి విడిపించి తన జిమ్నాసియంలో చేర్చుకున్నాడు తన జీవితమును తర్చి దిద్దుటయే గాక ప్రపంచ ఖ్యాతి పొందునట్లు రూపొందించిన డి అమటోను ఎంతో గౌరవిస్తాడు టైసన్. డి అమటో తనను దగ్గర తీయనిచో ఒక దొంగ, హంతకునిగా జైలు శిక్ష అనుభవించుచు యుండుట లేక మరణించి యుంటే వాడినని అంటాడు టైసన్ ఇరవై ఏళ్ళ టైసన్ ఆరుడు అడుగుల పదకొండు అంగుళాలు ఎత్తు కలిగి, యిరవై అంగుళాలు మెడ చుట్టు కొలత కలిగిన బారి విగ్రహము నేడు ప్రపంచ అగ్రగామి బాక్సింగ్ వీరులలో మేటీ హీరో మహమ్మద్ అలీ, జో ప్రెజర్, లూయిస్, మార్సినో 20 ఎళ్ళ వయసులో సాదించ లేని శక్తి, విజయాలు టైసన్ సాదించ కలిగాడు



మైక్ టైసన్ (28 విజయాలు)

రేపు మార్చిలో ప్రపంచ బాక్సింగ్ అసోసియేషన్ ఆధ్వర్యమున జెమ్స్ బోన్ క్రష్షర్ స్మిత్‌తో జరుగు పోటి ఎంతో ముఖ్యమైనది

టైసన్‌నకు పోటిలో పాల్గొనుట వలన రెండు మిలియన్ల అమెరికన్ డాలర్లు లభిస్తాయి 1928 వరకు గెన్నిటన్నీ విజేత

విశ్వ విఖ్యాతి పొందినవారు జోలూయిస్, మార్సియానో, మహమ్మద్ అలీలు లూయిస్‌ను బ్రౌన్ బాంబర్ అనేవారు 1937 నుంచి 1949 వరకు 71 పోటీలలో పాల్గొని 68 సార్లు విజయాలు సాదించుటయే గాక 25 సార్లు వరుసగా గెల్చి పొందాడు.

మార్సియానో "బ్రాక్‌టన్ బ్లాక్ బష్టర్" 1952 నుండి 56 వరకు 49 వరుసగా విజయాలు పొంది, ఓటమి పొందక రిటైర్ అయాడు. కాసియస్ క్లే 1964 లో ప్రపంచ బాక్సింగ్ రంగములో సంచలనం సృష్టించాడు. బ్లాక్ ముస్లిమ్ స్వీకరించి మహమ్మద్ అలీగా పేరు మార్చుకొన్నాడు. 'ది గ్రేటెస్ట్'గా పేరు పొందాడు. అమెరికా సైన్యములో చేరుటకు యిష్టపడక పోవుటతో తొమ్మిది సంవత్సరముల ఆధిక్యత కోల్పోయాడు.

బాక్సింగ్ పురుషుల క్రీడ అంటారు. కాని కొన్ని చోట్ల మహిళలు కూడా పాల్గొంటున్నారు. ఏది ఏమైన యీ క్రీడలో పురుషుల ఆధిక్యత గలదు. కొందరు మోటు క్రీడగా భావించి దూరముగా యున్నను పౌరుషము గల పురుషులు ఆసక్తి చూపు చున్నారు. 9వ ఆసియా క్రీడలలో బాక్సింగ్ నందు విజయనగరం జిల్లా వాసి జయరాం రజత పతకము సాధించి తెలుగు వారు కూడా 'బాక్సింగ్'లో ప్రతిభ చూపగలరని నిరూపించాడు.

–ముకరమ్


ఓటర్లకు ఉచితంగా ఫోటోలు!
బోనేపల్లి మురళి & Rao
ఏంటీ! పలకమీద నెంబరేసి ఫోటో తీస్తారా!! బస్ స్టాండ్‌లో జేబులు కొట్టే వాళ్ళమనుకున్నారా?
ఫోటోకు పదిరూపాయలా! మాయింటికొచ్చి ఊరికే తీస్తున్నారే!!
GEETHA STU
EXPOSURE H
బోనేపల్లి
పుట్టుమచ్చ ఎక్కడ ఉందో చెబితే చాలు!! చూపించక్కర్లేదు
ఓటున్న వాళ్ళకే ఫోటోలు. నీ ఫోటో తీయరురా అంటే వినవే !!!
వా!!!
Rao



పుష్పక విమానం లో కమలహాసన, అమల

## "త్రిమూర్తులు" ఫిబ్రవరి షెడ్యూల్

ఫిబ్రవరి 14 నుంచి 18 వరకు బాంకాక్‌లో వెంకటేశ్ శోభనలపై ఒక డ్యుయెట్‌ను చిత్రీకరించాం కథా పరంగా హాంకాంగ్‌లో ఫిబ్రవరి 18 నుంచి 28 వరకు చిత్రీకరించిన కొన్ని కీలకమైన సన్నివేశాలతో ప్రధాన పాత్ర ధారులందరూ పాల్గొన్నారు ఒక ఛాలెంజ్‌గా తీసుకుని రూపొందిస్తున్న ఈ కోటిన్నర రూపాయల బడ్జెట్ చిత్రంలో సెంటిమెంట్ క్రయిమ్ రొమాన్స్ కామెడీ అన్నీ సమపాళ్ళలో ఉన్నాయి అన్నారు కళాబంధు టి సుబ్బరామిరెడ్డి ఈయన సమర్పణలో పి శశిభూషణ్ నిర్మిస్తున్న మహేశ్వరి పరమేశ్వరి ప్రొడక్షన్స్ వారి పై చిత్రానికి జనవరి 15 నుంచి 20 వరకు వాహినీ స్టూడియోలో ఎనిమిదిన్నర లక్షల వ్యయంతో నిర్మించబడిన రివాల్వింగ్ సెట్‌లో ముగ్గురు హీరోలు ముగ్గురు హీరోయిన్‌లు పాల్గొన్న గీతాన్ని చిత్రీకరించారు వెంకటేశ్ అర్జున్ రాజేంద్రప్రసాద్ శోభన కుష్బూ, అశ్విని రావుగోపాలరావు, సత్యనారాయణ నూతన్‌ప్రసాద్ సుధాకర్ నాగేష్ వేలు వీరభద్రరావు భీమేశ్వరరావు చిట్టిబాబు రమాప్రభ సుమిత్ర కె విజయ మణిమాల ఒక కీలకమైన పాత్రలో హిందీ నటుడు అనుపమఖేర్ పాత్రదారులు ప్రయాగ్‌రాజ్ కథకు పరుచూరి సోదరులు సంభాషణల కర్తలు బప్పీలహరి స్వరకల్పనలో వేటూరి గీతాలు రాశారు

## సినిమా

(44 వ పేజీ తరువాయి)

ఎస్ గోపాలరెడ్డి ఛాయ సీను నృత్యాలు విజయన్ సాహసాలు నరసింహరావు కూర్పు ఆర్ పద్మనాభన్ నిర్వహణతో ఈ భారీ చిత్రానికి దర్శకత్వం వహిస్తున్న కె మురళీమోహనరావు మార్చి 1 నుంచి 10 20 నుంచి 30 ఏప్రిల్‌లో పది రోజుల పాచ్ వర్క్‌తో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు

లాయర్ భారతీదేవి లో మోహీషా



## పి. ఎల్ నారాయణ తొలి దర్శకత్వంలో "రాజధానిలో రంభ"

పెద్దల అండదండలతో ఘరానా మనుషులుగా కనిపించే గోముఖ వ్యాఘ్రాలు చేస్తున్న దురాగతాలకు అట్టడుగు వర్గం నుంచి ఉన్నత స్థానాన్ని అధిష్టించిన ఒక మహిళ ఎలా బుద్ధి చెప్పిందన్నది ప్రధానాంశం నేటి రాజకీయాలపై వ్యంగ్యం అంతర్లీనంగా ఉంటుంది ఫిబ్రవరిలో పాటలను రికార్డ్ చేశాం అన్నారు కేరెక్టర్ ఆర్టిస్ట్ పి ఎల్ నారాయణ ఈయన కథ స్క్రీన్‌ప్లే మాటలు సమకూర్చి దర్శకత్వం వహించే ఉమాదేవి ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో భానుచందర్ నూతన్‌ప్రసాద్ వేలు రాళ్ళపల్లి కృష్ణవేణి అన్నపూర్ణ పి ఎల్ నారాయణ నటవర్గం సత్యం సంగీతం ఆర్ రామారావు ఛాయ సురేఖా ప్రకాష్ నృత్యాలు కె సత్యం కూర్పు పి జె ప్రసాద్ నిర్వహణతో వి వి కృష్ణంరాజు సహ నిర్మాత ప్రధాన పాత్రకు నూతన నటిని పరిచయం చేస్తున్నాం విశాఖ పట్నంలో మార్చి నుంచి షూటింగ్ అన్నారు నిర్మాత కె తాతాజీ □